అపరాధ పరిశోధన అనుబంధం—99

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఫెంటు వెళ్లిన దెయ్యం
రచన : వసుంధర

## మూడు పొడి అక్షరాలు
రచన : బొమ్మిడి అచ్చారావు

## నగ్న పురుషులు
రచన : ఎమ్.వి.వి. సత్యనారాయణ

## బ్రతకాలంటే పారిపో
రచన : సికిందర్

రక్తం త్రాగే పిశాచం-తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—99
మార్చి, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# వెంట వెళ్ళిన దెయ్యం!

వసుంధర

తలుపు తీశాడు రమాకాంతం.

"మీ యింట్లో వాటా ఖాళీ వుందని తెలిసింది—"

రమాకాంతం ఆ వ్యక్తివంక తేరిపార చూసి—

"ఫామిలీకి తప్ప మా యిల్లు అద్దెకివ్వం—" అన్నాడు.

"నేను, నా భార్య, ముసలి తల్లి, ఇద్దరు పిల్లలు—ఇదీ మా కుటుంబం—ఇల్లు చూపిస్తారా?" అన్నాడా వ్యక్తి.

"అద్దె నెలకు మూడువందలు—" అన్నాడు రమాకాంతం.

"ఇల్లు చూడనివ్వండి—" అన్నాడా వ్యక్తి.

"మూడొందలు అద్దె యివ్వగలరా?" రమాకాంతం రెట్టించాడు.

"ఇల్లు నచ్చితే ఇంకా ఎక్కువే ఇవ్వగలను...." అన్నాడా వ్యక్తి.

అప్పుడు రమాకాంతం కాస్త పక్కకు కదిలి—

"రండి—వాటా చూద్దురుగాని—" అన్నాడు. ఆ వ్యక్తి లోపలకు వచ్చాడు.

రమాకాంతం ఆయన్ను కూర్చోమని చెప్పి, లోపలకు వెళ్ళి తాళంచెవులు తీసుకుని వచ్చి — "ఏమీ అనుకోకండి—ఇల్లు మాకు పెద్దదయిందని సగం వాటా అద్దెకిస్తున్నాంగానీ—అద్దె కోసమని ఇల్లుకట్టలేదు. అద్దెకుండే వాళ్ళూ మేమూ సహజీవనం చేయాలి—అందరికీ ఒకటే వీధి గుమ్మం—" అంటూ పక్క వాటా దగ్గరకు తీసుకు వెళ్ళాడు. తలుపు తాళం తీస్తూ—"మంచి సెంటర్లో వున్న మూలాన మా యింటికి మంచి డిమాండు. ఇల్లు ఖాళీ అయి ఇరవై నాలుగు గంటలు కాలేదు. అప్పుడే చూసుకుందుకు నలుగురొచ్చి వెళ్ళారు—" అన్నాడు.

ఆ వ్యక్తి రమాకాంతం చెప్పే మాటలన్నీ మౌనంగా వింటున్నాడు. ఈ రోజుల్లో అద్దెకిల్లు దొరకడం గగనంగా వుంది. ఏమంటే ఏం తప్పోనని భయపడుతూ విసుగును మనసులోనే భరిస్తూ నిలబడ్డాడు.

రమాకాంతం తాళంతీసి తలుపు తెరిచాడు. ఆయన వెనుకే ఆ వ్యక్తి కూడా అడుగులు వేశాడు. ఉన్నట్లుండి రమాకాంతం ఓ వెర్రికేక పెట్టాడు. ఉలిక్కిపడిన ఆ వ్యక్తి కూడా ఓ వెర్రికేక పెట్టాడు.

తలుపు తీయగానే ఆ గదిలో నేలమీద వెల్లకితలా పడివున్న యువతిని చూడడానికి రమాకాంతానికి అంత సేపు పట్టడానికి కారణం ఆయన మాటల ధోరణిలో వుండడం. పడివున్న ఆ యువతి గుండెల్లోకి కత్తి దిగి వుంది. రక్తం ఇంకా ఆరినట్లు కనబడదు.

"హత్య!" అద్దెకొచ్చిన వ్యక్తి వెనక్కి తిరిగి పరుగెత్తాడు అరుస్తూ.

# 2

పోలీసులు వచ్చి అన్నివిధాలా పరీక్షలు చేసి వెళ్ళారు.

చనిపోయిన యువతి ఎవరో రమాకాంతానికిగానీ, ఆ వీధిలో వాళ్ళకుగానీ తెలియదు. ఆ గది తలుపులు తాళంవేసి ఉండగా హత్య జరిగింది. హంతకుడు ఎప్పుడు ఎలా అక్కణ్ణించి పారిపోయాడో తెలుసుకోనడం కష్టంగా వుంది. గదిలో ఏ విధమైన ఆధారాలూ లేవు.

పరిస్థితి విచారించాక పోలీసులు రమాకాంతాన్ని అనుమానించారు.

"మీ సమాధానాలు సంతృప్తికరంగా లేవు. మీ యింట్లో ఎవ్వరికీ తెలియకుండా ఈ యువతి ఇక్కడ చచ్చిపడుండే అవకాశంలేదు. మీకింకా కొంత అవకాశ మిస్తున్నాను. రేపు మధ్యాహ్నానికల్లా నాకు నిజం తెలియాలి—" అన్నాడు పోలీసు ఇన్స్పెక్టర్.

రమాకాంతం గది తలుపులు తీసిన సమయం ఉదయం ఎనిమిదిన్నర. డాక్టరు అంచనా ప్రకారం హత్య ఏడున్నర, ఎనిమిది గంటల మధ్య జరిగింది. అది ఆత్మ హత్య అనుకుందుకు వీల్లేదని—శవం వున్న పొజిషన్, మరణం సంభవించిన పద్ధతినిబట్టి డాక్టరు నిర్ణయించాడు. ఇంట్లో ఎవరికీ తెలియకుండా ఇదంతా ఎలా జరుగుతుంది?

రమాకాంతం వాదనేమిటంటే—ఇంట్లో అన్ని వ్యవహారాలూ సర్వసాధారణంగా గడిచిపోయాయి. అంతా మామూలుగా ఉన్నారు. ఇంట్లో హత్య జరిగినట్లు తెలిస్తే తను పరాయి వ్యక్తికి పనికట్టుకొని శవాన్నెందుకు చూపిస్తాడు?

ఆయన వాదన సబబుగానే వున్నప్పటికీ మొగుణ్ణి కొట్టి మొగసాలకెక్కే వారెందరినో ఇన్స్పెక్టర్ తన

సర్వీసులో చూసి వున్నాడు. అందువల్ల — ఆ యువతి గురించి ఎంతో కొంత ఏదో విధమైన సమాచారం ఇవ్వ వలసిన బాధ్యత రమాకాంతానికున్నది.

రమాకాంతం యింట్లో జనాభా చాలా మంది వున్నారు. ఆయన వయస్సు నలభై అయిదు. ఆయన భార్య శాంతమ్మ. వయసు నలభై — వారి పెద్ద కూతురు రమాదేవి వయసు సుమారు పాతిక ఉంటుంది. పుట్టింటికి వచ్చి వారం రోజులయింది. రెండోవాడు అబ్బాయి. ఇరవైమూడేళ్ళు. పేరు రఘు. బియ్యే ప్యాసవగానే ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం వచ్చింది. మూడో అమ్మాయి విజయ వయసు ఇరవై వుంటుంది. పెళ్ళి సంబంధం నిశ్చయమయింది. బియ్యే ఫైనలియర్ చదువు తోంది. నాలుగో అమ్మాయి లక్ష్మికి పదహారేళ్ళు. ఇంటర్మీడియేట్ చదువుతోంది. అయిదవవాడు శ్యామలరావు వయసు పదకొండు. ఆరో తరగతి చదువు తున్నాడు.

ఇంతమందినీ ఇన్స్పెక్టర్ విడివిడిగానూ, సమూహం గానూ కూడా ఎన్నో ప్రశ్నలు వేశాడు. ఆ అమ్మా యెవరో ఎవ్వరూ చెప్పడంలేదు. బదులు చెప్పే పద్ధతిని బట్టి అంతా నిజమే చెబుతున్నారనిపిస్తోంది. ఆ పరి స్థితుల్లో ఇన్స్పెక్టర్‌కు రమాకాంతం కుటుంబం తప్ప ఆధారంలేదు. అందుకే ఆయన వాళ్ళను హెచ్చరించీ, బెదిరించీ వెళ్ళిపోయాడు.

పోలీసులు వెళ్ళిపోయాక రమాకాంతం కుటుంబ సభ్యులందర్నీ ఒకచోట సమావేశ పరచి తలపట్టు క్కూర్చున్నాడు.

"ఇన్స్పెక్టర్ చెప్పిందాంట్లో అబద్ధంలేదు. మనింట్లో

ఎవ్వరికీ తెలీకుండా ఆ పిల్ల అక్కడికెలా చేరింది? తెలిసినవాళ్ళు చెప్పకపోతే నేను జైల్లో కూర్చోవాలి!" అన్నాడాయన.

"బాగుందండీ—మీరు అనుమానించి, ఇన్స్పెక్టరూ అనుమానిస్తే మేమంతా ఏమైపోవాలి?" అంది శాంతమ్మ చిరాగ్గా.

"అలా చిరాకుపడకు. నువ్వే పోలీసు ఇన్స్పెక్టరనుకో. ఈ పరిస్థితిలో ఏం చేస్తానో చెప్పు!" అన్నాడు రమాకాంతం.

"నేనే పోలీసు ఇన్స్పెక్టర్నయితే ఇబ్బందేముంది? నా పిల్లలూ, నా భర్తా అమాయకులని నాకే తెలుస్తుంది గదా!" అంది శాంతమ్మ.

"అబ్బ—నీకు అర్థమయ్యేలా చెప్పడం కష్టం—ఆ పిల్ల ఎవరో మనింటికెలా వచ్చిందో, ఎవరు చంపారో ఎలా తెలుసుకోవడం? తెలుసుకోకపోతే నా చావు దగ్గరపడేలాగుంది!" అన్నాడు రమాకాంతం.

సరిగ్గా ఆ సమయంలో కాలింగ్ బెల్ మ్రోగింది.

"మళ్ళీ పోలీస్ ఇన్స్పెక్టరేమో?" అన్నాడు రఘు.

"కాదు. ఎవరో యిల్లు అద్దెకి చూసుకుంటూ వచ్చి ఉంటారు—" అంది రమాదేవి. కానీ ఆమె కళ్ళలో భయం స్పష్టంగా కనబడుతోంది.

"నువ్వెళ్ళి తలుపు తీసి—ఇప్పుడిల్లు అద్దెకివ్వడంలేదని చెప్పిరా!" అన్నాడు రమాకాంతం, ఆఖరివాడు శ్యామలరావు నుద్దేశించి.

"నాకు భయం — అన్నయ్యను వెళ్ళమనండి!" అన్నాడు శ్యామలరావు.

అతడివాక్యం పూర్తికాకుండనే రఘు లేచి వెళ్ళి

తలుపు తీశాడు.

బయట ఒక అపరిచిత యువకుడు నిలబడివున్నాడు. అతడికి సుమారు పాతికేళ్ళ వయసుంటుంది.

"నా పేరు ఆనందరావు. రమాకాంతంగారితో మాట్లాడాలి. ఒక్కసారి పిలుస్తారా?" అన్నాడతను.

"ప్రస్తుతం మేము ఇల్లు అద్దెకిచ్చే ఉద్దేశ్యంలో లేము—" అన్నాడు రఘు.

"నేనొచ్చింది ఇంటి కోసం కాదు. హత్య గురించి మాట్లాడడానికని చెప్పండి...." అన్నాడు ఆనందరావు.

రఘు ఒక్క క్షణం మ్రాన్పడిపోయాడు. తర్వాత ఆనందరావు వంక ఎగాదిగా చూశాడు. ఉన్నట్లుండి ఒక్క పరుగున లోపలకు వెళ్ళి—"నాన్నా—ఎవరో ఆనందరావుట. మీతో హత్య గురించి మాట్లాడతాడట" అన్నాడు.

అంతా ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. రమాకాంతం గారు చటుక్కున లేచి నిలబడ్డాడు. ఆయన ముందు నడుస్తూంటే ఆ ఆగంతకుణ్ని చూడడానికి అంతా ఉబలాటపడుతూ వెనక నే నడిచారు.

"నమస్కారమండి — మీరే రమాకాంతంగారను కుంటాను. పది నిమిషాలు మీతో మాట్లాడాలి!" అన్నాడు ఆనందరావు.

రమాకాంతం, ఆనందరావు ఒక గదిలోకి వెళ్ళారు.

"మీకు వచ్చిన యిబ్బంది విన్నాను. మీకు సాయ పడాలని వచ్చాను—" అన్నాడు ఆనందరావు సూటిగా రమాకాంతం మొఖంలోనికి చూస్తూ.

"నాకు ఎలా సాయపడగలవు?" రమాకాంతం అను మానంగా అడిగాడు.

"డబ్బు తీసుకుని!" అన్నాడు ఆనందరావు నిర్లిప్తంగా.

"నాకు అర్థంకావటంలేదు—" అన్నాడు రమాకాంతం.

"ఇందులో అర్థంకావడానికేముందండీ — చాలా సింపుల్! ఇన్‌స్పెక్టర్ మిమ్మల్ని చనిపోయిన యువతి వివరాలు చెప్పమన్నాడు. మీకేమీ తెలియదంటున్నారు. అందులోని నిజానిజాలు మీకే తెలియాలి. ఒకవేళ ఆ హత్య మీరేచేసినా చేసి వుండవచ్చు. అదంతా నాకు అనవసరం. ఆ అమ్మాయెవరో నాకు తెలుసు. ఆ హత్య నేను చేశాను. ఆ రెండూ ఒప్పుకుంటాను. పదివేల రూపాయలు నాకివ్వండి—" అన్నాడు ఆనందరావు.

"ఆ హత్య నువ్వు చేశావంటే పోలీసులెలా నమ్ముతారు?" అన్నాడు రమాకాంతం.

"కథలు నేను కల్పించగలను. ముందు పదివేలు ఇవ్వండి. ఆ తర్వాత పోలీసుల్ని నేను నమ్మిస్తాను—" అన్నాడు ఆనందరావు.

"డబ్బు తీసుకొని మోసంచేస్తే?"

"చేయకుండా మీకో ఉపాయముంది. హత్య జరిగిన గది తలుపుల మీద నా వేలిముద్రలు పడేలా చేసి పోతాను—" అన్నాడు ఆనందరావు.

"పదివేలకోసం హంతకుడిననిపించుకొని ఉరికంబం ఎక్కుతావా?" అన్నాడు రమాకాంతం అనుమానంగా.

"బ్రతికుంటే పైసా విలువచేయను నేను—" అన్నాడు ఆనందరావు.

కాసేపు రమాకాంతానికీ, ఆనందరావుకీ వాదన జరిగింది. ఆఖరికి రమాకాంతం, ఆనందరావుకి డబ్బివ్వ

డానికి ఒప్పుకొన్నాడు.

ఆనందరావు బయటకు వచ్చి హత్య జరిగిన గది తలుపులమీద తన కుడి చేయి అన్చి—"దుమ్ము బాగా వుంది. వేలి ముద్రలు బాగా పడ్డాయి—" అన్నాడు.

రమాకాంతం అతడికి ఇంట్లోంచి పదివేలు తెచ్చి యిచ్చి "ఎంతో కష్టపడి సంపాదించిన డబ్బిది నాకు. గతిలేక నీకు ఇస్తున్నాను. ఇప్పుడు నీ కథేమిటో చెప్పు!" అన్నాడు.

ఆనందరావు డబ్బు జేబులో పెట్టుకున్నాడు.

"నేనో గ్రాడ్యుయేట్ని. ఉద్యోగంలేదు. ఓ పేదింటి అమ్మాయిని ప్రేమించానని చెప్పి వాళ్ళింట్లో మకాంపెట్టి రోజూ ఫ్రీగా భోజనం లాగిస్తున్నాను. ఉద్యోగం రాగానే పెళ్ళి చేసుకుంటానని చెప్పాను. ఈలోగా ఓ లక్షాధికారి కూతురు నన్ను ప్రేమించింది. ఆమె తండ్రికి కూడా నేను నచ్చాను. ఈ అదృష్టాన్ని నేను వదులుకోదల్చుకోలేదు. ఈ సంగతి చూచాయగా నా పేద ప్రియురాలికి తెలిసింది. లక్షాధికారి దగ్గర నా రంగు బయటపెడతానని బెదిరించింది.

నామీద ఎలాంటి ఫిర్యాదు వచ్చినా లక్షాధికారికి అనుమానం వస్తుంది. నా జీవితం నాశనమవుతుంది. అందుకని నేను నా ప్రియురాలిని చంపాలనుకున్నాను. ఆమెను మాయమాటలతో మోసగించాను. లక్షాధికారి కూతురిపై ప్రేమంతా నటన అని చెప్పి నమ్మించాను. మీ యిల్లు ఎన్నుకున్నాను హత్యకు. ఓ రోజు రాత్రి నాప్రియురాలిని మంచి మాటలతో వంచించి మీ యింటిదాకా తెచ్చాను. మీ యింట్లో పిల్లలు హాల్లో కంబైన్డ్ స్టడీస్ చేసుకుంటూ వీధి తలుపులు దగ్గరగా వేసి నిద్రపోయారు. ఆ సమయంలో చప్పుడు చేయ

కుండా మేమిద్దరం యింట్లో ప్రవేశించాం. నా దగ్గరున్న మారు తాళంచెవులతో పక్క వాటా తాళంతీసి లోపలకు వెళ్ళాను.

ఉదయం ఆమెను హత్యచేసి తెలివిగా అక్కణ్నించి బైటపడ్డాను. మీ హాల్లో జనసంచారం తక్కువ. అందువల్ల ఆ వాటా తాళం వేసి బయటపడటం నాకు కష్టంకాలేదు. అదీ కథ.... ఈ కథలో చిరు లోపాలున్నాయి. వాటన్నింటినీ తెలివిగా సద్దుకుంటాను—" అన్నాడు ఆనందరావు. అతడి కళ్ళలో బెంగ, భయం ఏమీ లేవు.

"ఈ పదివేలూ ఏం చేసుకుంటావు?" అన్నాడు రమాకాంతం.

"నావాళ్ళకిచ్చుకుంటాను. కాసేపటిలో మా తాలూకు మనిషి ఒకడు వస్తాడు. అతనికి డబ్బిచ్చి పంపేస్తాను. నేను మీ యింట్లో వుండిపోతాను. మీరు నన్ను తాళ్ళతో బంధించుకోండి. రేపు ఇన్స్పెక్టర్ రాగానే నన్నప్పగించండి—" అన్నాడు ఆనందరావు.

రమాకాంతం నిట్టూర్చి-"నీ కథ చాలా తమాషాగా వుంది. కానీ నాకు నీ గురించి జాలిగా కూడా వుంది—" అన్నాడు.

"నామీద మీరు జాలిపడనవసరంలేదు. పోలీసుల్నించి తప్పించుకు పారిపోవడం నాకు వెన్నతో పెట్టిన విద్య!" అన్నాడు ఆనందరావు.

దీనికి రరాకాంతం ఇంకా ఆశ్చర్యపోయాడు.

"ఇది నా వృత్తి. ఇబ్బందుల్లో ఉన్న వాళ్ళను ఆదుకుంటాను. డబ్బు తీసుకుంటాను. అమాయకులమీది నేరం నా మీదకు మళ్ళిస్తాను. ఇప్పుడు పోలీసుల దృష్టి నా

మీదకు మళ్లుతుంది. నేను పారిపోతే నా గురించే వేట ప్రారంభమవుతుంది. మీకు పోలీసుల బెడద తప్పుతుంది" అన్నాడు ఆనందరావు. చిన్న పిల్లలకు రహస్యాలు దాచే శక్తి వుండదు కాబట్టి ఈ విషయం ఆనందరావుకూ, రమాకాంతానికీ మధ్య వుండిపోవాలని చెప్పాడు ఆనంద రావు. రమాకాంతానికీ అది కూడా సబబుగానే అని పించింది.

కాసేపటికి ఆనందరావు మనిషి వచ్చి డబ్బు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆనందరావు ఆ యింట బందీగా వుండిపోయాడు. మర్నాడు పోలీస్ ఇన్స్పెక్టరు వచ్చినపుడు ఆయనకు రమాకాంతం ఆనందరావును అప్పజెప్పాడు.

ఇన్స్పెక్టర్ ఆశ్చర్యపోతూ-"ప్రపంచంలో ఎలాంటి విచిత్రాలుంటాయి! ఇది నేను ఏ మాత్రమూ ఊహించని సంఘటన!" అన్నాడు.

ఆయన ఆనందరావుని తీసుకుని వెళ్ళిపోతూంటే రమా కాంతం తేలికగా నిట్టూర్చలేకపోయాడు. పది వేల రూపాయలకు తన ప్రాణాలు పణంగా పెట్టే వృత్తిని స్వీకరించిన ఆనందరావంటే ఆయనకు జాలిగా కూడా వుంది.

# 3

రమాకాంతం ఆ హత్య కేసుగురించి మరిచిపోవడానికే ప్రయత్నించాడు. ఆ కేసు ఏమవుతోందనిగానీ, ఆనంద రావు ఏమయ్యాడోగానీ ఆయన తెలుసుకుందుకు ప్రయ త్నించలేదు. ఎటొచ్చీ తనింట్లో చనిపోయిన ఆ యువతి ఎవరో తెలుసుకోవాలని మాత్రం ఆయనకుండేది. ఆమె ఎవరో? ఎందుకు హత్య కావించబడిందో? అసలక్కడకు

ఎలా చేరిందో?

ఆనందరావు అభూతకల్పనను ఇన్స్పెక్టర్ నమ్మి వుండవచ్చు. కానీ అది అసాధ్యమని రమాకాంతానికి తెలుసు. మొత్తం కథంతా ఆయనకు మిస్టరీగానే వుండి పోయింది.

ఈ గొడవ జరిగిన పదిరోజులకు ఆ యింట్లో మాధవ రావు సకుటుంబంగా అడుగుపెట్టాడు. మాధవరావు కొత్తగా పెళ్ళయినవాడు. అతడి భార్య అందమైనది. వాళ్ళు తప్ప అక్కడ యింకెవ్వరూ లేరు. అతడి ఉద్యోగం మంచిదేమో — మూడువందల రూపాయల అద్దెకు అతను మాట్లాడకుండా అంగీకరించాడు.

మాధవరావు భార్య కుసుమ కలుపుగోలు మనిషి. ఆమె కళ్ళు ఎంతో అమాయకంగా వుంటాయి. మాటల్లో కల్మషం స్ఫురించదు. భర్త ఆఫీసుకు పోగానే ఆమె తన కాలంలో ఎక్కువ భాగం రమాకాంతం యింట్లోనే గడిపేది. ఆమె మంచి చిత్రకారిణి. మనిషిని చూసి బొమ్మ వేయగలిగేది. విజయకూ, లక్ష్మికీ కూడా చిత్ర లేఖనం మీద మంచి ఆసక్తి వుండడంవల్ల రోజూ ఆమెతో కలిసి చాలాసేపు గడిపేవారు.

ఒక రోజు కుసుమ వారిద్దరితోనూ మాట్లాడుతూ—

"మీ యింట్లో దెయ్యం వుంది—" అంది నెమ్మదిగా.

"దెయ్యమా?" అంటూ విజయ, లక్ష్మి కూడా ఒకే పర్యాయం ఉలిక్కిపడ్డారు.

"అవును. నేను రాత్రి చూశాను...." అంది కుసుమ.

"నువ్వబద్ధం చెబుతున్నావ్?!" అంది లక్ష్మి.

"లేదు. నీమీదొట్టు—" అంది కుసుమ.

"ఎలా వుంది దయ్యం?" అంది విజయ.

"ముఖం స్పష్టంగా కనబడలేదు. జుట్టు విరబోసుకుని వుంది—" అంది కుసుమ.

"నీకు భయం వేయలేదూ?" ఆశ్చర్యంగా అడిగింది లక్ష్మి.

"ఏమో — చిన్నప్పట్నుంచీ నాకు భయమంటే తెలియదు. చిన్నతనంలో కూడా ఒకటి రెండుసార్లు దెయ్యాల్ని చూశాను. అయితే యింత దగ్గర్నుంచి ఎప్పుడూ చూడలేదు...."

"అసలేం జరిగిందో చెప్పు...." అంది విజయ.

"రాత్రి నిద్రపోతూంటే ఉన్నట్లుండి మెలకువ వచ్చింది. గదిలో ఏదో అలికిడి అవుతున్నట్లనిపించింది. కళ్ళు విప్పి చూస్తే జుట్టు విరబోసుకుని అటూ ఇటూ గదిలో తిరుగుతున్న ఓ యువతి కనబడింది. ఆమె పాదాలు నేలమీద ఆనడంలేదు. వెంటనే గ్రహించేశాను అది దెయ్యమని! కుతూహలంగా పరిశీలించి చూడ బోయేంతలో అది మాయమయింది...."

"మాధవరావుగారిని లేపావా?" విజయ అడిగింది.

"లేదు. ఆయనకు దెయ్యాలంటే చచ్చేటంత భయం...." అంది కుసుమ.

విజయ, లక్ష్మి ఫక్కున నవ్వి—"నువ్వు తమాషా చేస్తున్నావు. అంతా అబద్ధం. అవునా?" అన్నారు.

కుసుమ అప్పటికేమీ మాట్లాడలేదు. కానీ తర్వాత నాలుగు రోజులకి ఆమె వాళ్ళతో — "మా యింట్లో దెయ్యముంది. అందుకు సందేహంలేదు—" అని చెప్పింది.

"ఏమయింది?" అనడిగారిద్దరూ.

"దెయ్యం రోజూ రాత్రి పన్నెండింటికి వస్తోంది. గదిలో కాసేపు అటూ యిటూ పచార్లుచేసి వెళ్ళిపో

తోంది—" అంది కుసుమ.

విజయకూ, లక్ష్మికీ గుండెలదిరాయి. కుసుమ ఎంతో తాపీగా చెబుతోందంటే అది నిజమని వారికి నమ్మకం కుదరడంలేదు.

ఆ మర్నాడు మాధవరావు ఆఫీసు పనిమీద టూర్ వెళ్ళాడు. కుసుమ తనకు సాయంగా పడుకోమని విజయనూ, లక్ష్మినీ కోరింది. వారిద్దరూ అంగీకరించారు. అప్పుడు వారికి దెయ్యం సంగతి గుర్తులేదు. కానీ రాత్రికి గుర్తొచ్చింది.

"మాకు భయంగా వుంది—" అంది విజయ.

"అది ఎవర్నీ ఏమీ చేయదు. కాసేపు అటూ యిటూ పచార్లుచేసి వెళ్ళిపోతుంది—" అంది కుసుమ—"అయినా మీరు నా మాటలు నమ్మడంలేదుకదా—నిజానిజాలు ఈ రోజు తెలుసుకుంటారు."

ఎనిమిదికల్లా భోజనాలుచేసి ముగ్గురూ పక్క ఎక్కారు. పదిదాకా కబుర్లు చెప్పుకొని అప్పుడు నిద్రలో పడ్డారు.

ఓ రాత్రివేళ కుసుమ విజయనూ, లక్ష్మినీ ఇద్దర్నీ గిల్లి లేపింది. వాళ్ళు ఏదో అనబోతూంటే చప్పుడుచేయ వద్దన్నట్లు వారించింది. ఇద్దర్నీ మంచానికటువైపు చూడ మంది.

ఒక ఆకారం గాలిలో తేలిపోతున్నట్లుగా గదిలో అటూ యిటూ తిరుగుతోంది. ఆమె జుట్టు విరబోసుకొని వుంది. ముఖం చూసే ధైర్యం కూడా చాలలేదు ఆ అక్కచెల్లెళ్ళకు. ఇద్దరూ చటుక్కున కళ్ళు మూసు కొన్నారు. కిక్కురు మనలేదు. అలా కొద్ది క్షణాలు గడిచేక—"ఇంక కళ్ళు తెరవండి—దెయ్యం మాయ

మయింది—" అంది కుసుమ.

భయం భయంగానే ఇద్దరూ కళ్ళు తెరిచారు. గదిలో ఎవ్వరూ కనబడలేదు. అయినా ఇద్దరూ మాట్లాడలేదు.

"నేను దాని ముఖం చూశాను. చాలా స్పష్టంగా కనబడింది—" అంది కుసుమ.

విజయ, లక్ష్మి కూడా వణికిపోతూ "నీకు భయంగా లేదూ?" అన్నారు.

"భయపడ్డంవల్ల ప్రయోజనమేమిటి?" అంది కుసుమ.

"అవునూ—దెయ్యం సంగతి నువ్వు మీ ఆయనక్కూడా చెప్పకుండా మాకు చెబుతున్నావు. మమ్మల్ని భయపెట్టాలనా నీ ఉద్దేశ్యం?" అంది విజయ.

"అబ్బే—అది కాదు. ఆయనది మొద్దు నిద్దర. రాత్రి పడుకుంటే తెల్లారేదాకా నిద్రలేవరు. ఇంట్లో దెయ్యముున్నదన్నానంటే వాడిలిపోయి ఖాళీచేసి వెళ్ళిపోదామంటారు. ఇంత మంచి కంపెనీని యింత మంచి ఇల్లునూ వదులుకొని వెళ్ళడం నాకేమాత్రమూ ఇష్టంలేదు. ఆయనకు తెలియనంత కాలం ఈ విషయం రహస్యంగానే వుంచుతాను—" అంది కుసుమ.

"ఎలా వుంది దెయ్యం?" అంది లక్ష్మి.

"దాని రూపం ఇంకా నా బుర్రలో స్పష్టంగా మెదులోంది. తెల్లారి లేచేసరికి మర్చిపోతానో ఏమిటో బెంగగా వుంది. ఇప్పుడే దాని బొమ్మ గీస్తాను—" అంది కుసుమ.

"వద్దు. ఆ భయంకర రూపం చూస్తే ఇప్పుడింక నిద్ర పట్టదు—" అంటూ అక్కా చెల్లెళ్ళిద్దరూ ఆమెను వారించారు.

"అదేమీ భయంకరంగా లేదు. ఇంతో అంతో

అందంగా కూడా వుంది—" అంటూ కుసుమ సరంజామా తీసుకొని బొమ్మ గీయడం ప్రారంభించింది. ఆమెను వారించినప్పటికీ ఆ అక్కచెల్లెళ్ళిద్దరూ కుతూహలంగా ఆమెవంక చూస్తున్నారు.

పదినిమిషాల్లో కుసుమ బొమ్మ గీయడం పూర్తయింది. ఆ బొమ్మను చూస్తూనే విజయ, లక్ష్మి ఉలిక్కిపడ్డారు. ఆ దెయ్యం .... ఆ యువతి .... కొద్ది వారాలక్రితం ఆ వాటాలో హత్య కావించబడిన అనామకురాలు!

"ఏమిటలా ఉండిపోయారు? ఏం జరిగింది? ఈ మనిషి మీకు తెలుసా?" అనడిగింది కుసుమ ఆశ్చర్యంగా.

ఆమెకు నిజం చెప్పాలో చెప్పకూడదో అర్థంకాక అక్కచెల్లెళ్ళిద్దరూ ఇంకేమీ మాట్లాడలేదు. తర్వాత కాసేపటికి అంతా నిద్రకు పడ్డారు.

## 4

ఇంటిల్లపాదీ ఆ బొమ్మనే చూస్తున్నారు.

ఆ వాటాలో చనిపోయిన ఆ అమ్మాయి దయ్యమై యింట్లో తిరుగుతోందా? రమాకాంతంగారు వెంటనే కుసుమను పిలిచి మాట్లాడేరు. విజయకూ, లక్ష్మికీ చెప్పినట్లే ఆయనకూ చెప్పి—"ఇంతకీ ఆమె ఎవరు?" అనడిగింది కుసుమ.

"అవన్నీ నువ్వడక్కూడదు, చెప్పకూడదు...." అన్నాడు రమాకాంతం.

"పోనీలెండి. దయుంచి ఈ విషయం ఆయనదాకా పోనివ్వకండి. ఆయనకు దెయ్యాలంటే చాలా భయం. ఇల్లొదిలి పోదామంటారు. ఈ యిల్లు నాకు బాగా నచ్చింది. మనుషులూ నచ్చారు—" అంది కుసుమ.

"ఈ రోజు రాకపోతే రేపైనా అతడికి తెలియక పోదు. ఒకసారి దెయ్యాల కొంపగా పేరుపడిందంటే ఇంక ఈ యింటికెవరూ అద్దెకు రారు—" అన్నాడు రమాకాంతం.

"మరేం చేస్తారు?" అంది కుసుమ.

"దెయ్యాన్ని తరిమేస్తాను—" అన్నాడు రమాకాంతం.

"ఎలా?"

"ఎవరైనా మంత్రగాణ్ని పిలుస్తాను—"

కుసుమ గంభీరంగా—"మంత్రగాళ్ళమని చాలామంది మోసం చేస్తారు. డబ్బు నష్టమేకానీ వాళ్ళవల్ల ప్రయోజనముండదు. నాకు తెలిసిన ఓ పేరాసైకాలజిస్టు ఉన్నాడు. ఆయన సైన్సు ఉపయోగించి ఇలాంటివి అవగాహన చేసుకుంటాడు. మా ఊళ్ళో నాలుగు దెయ్యాలను వదిల్చాడు. కానీ ఆయన ఛార్జి ఎక్కువ."

రమాకాంతం ఆత్రుతగా ఆమె వంక చూశాడు. "ఛార్జి ఎక్కువంటే ఏ మాత్రం తీసుకొంటాడేమిటి?"

"దెయ్యానికి అయిదు వేలు చొప్పున పుచ్చుకొంటాడు...."

"అయిదు వేలే?" అన్నాడు రమాకాంతం- "ఇంతకూ ఆయన పేరు?"

"ప్రొఫెసర్ కర్మ!" అంది కుసుమ.

రమాకాంతం అప్పటికి వెళ్ళిపోయాడు. ఆయన మనసులో చాలాసేపు ఆవీ యివీ లెక్కలువేశాడు. ఆ అనామక యువతి ఎవరో కానీ తనను చాలా ఇబ్బందిలో పెడుతోంది. ఆమె తన యింట్లో చచ్చినందుకు ఆనందరావు అనేవాడికి పదివేలిచ్చుకొన్నాడు. ఇప్పుడు చచ్చి

దెయ్యమైనందుకు మరో ప్రొఫెసర్ కర్మకు అయిదు వేలిచ్చుకోవాలి. కానీ అదే మంచిదేమో!

మంత్రగాడిని తీసుకొనివస్తే చాలా హడావుడి అవుతుంది. వీధంతా దెయ్యం గురించి ప్రచారమవుతుంది. ప్రొఫెసర్ కర్మ అయితే మూడో కంటివాడికి తెలియకుండా దెయ్యాన్ని పారద్రోల గలడేమో?

అయితే రమాకాంతం తనూ ఒకసారి దెయ్యాన్ని స్వయంగా చూడాలని ఉబలాటపడ్డాడు. ఫలితంగా ఆ రాత్రి కుసుమ రమాకాంతం ఇంట్లో పడుకొంటే ఆయన మాధవరావు వాటాలో పడుకొని దెయ్యం కోసం ఎదురు చూడసాగాడు.

గదిలో అన్ని తలుపులూ వేసివున్నాయి. దెయ్యం ఎక్కణ్ణుంచి వస్తుంది? ఎలా వస్తుంది? వచ్చి ఏం చేస్తుంది?

రమాకాంతానికి పన్నెండు లోగానే చిన్న కునుకు పట్టింది. ఏదో అలికిడికి మెలకువవచ్చి చూసేసరికి గదిలో చూసేసరికి గదిలో అటూ యిటూ తిరుగుతున్న దెయ్యం కనబడింది. ఆయనకు కాలూ, చెయ్యీ కదలలేదు.

సహజంగా రమాకాంతం ధైర్యవంతుడు. కానీ యింత స్పష్టంగా దెయ్యాన్ని మాస్తానని ఆయన అనుకోలేదు. దెయ్యం ముఖాన్నాయన స్పష్టంగా చూశాడు. ఆ వాటాలో హత్య గావించబడిన యువతి అనడంలో సందేహం లేదు.

క్షణం పనిచేయడం మానేసినా రమాకాంతం బుర్ర చురుగ్గా పనిచేయసాగింది. అది నిజంగా దెయ్యమేనా, లేక మనిషా? మనిషే అయితే లోపలకెలా వచ్చింది? గదిలో అంత ధైర్యంగా ఎలా తిరుగుతోంది? అయినా

ఆమె శవాన్ని తను కళ్ళారా చూశాడు. తన కళ్ళ ముందే పోలీసులు తీసుకొని పోయారు. ఇంతలో ఈమె మనిషిగా ఎలా మారింది?

రమాకాంతం చటుక్కున మంచంమీంచి లేచాడు.

అటుగా వెడుతున్న దెయ్యం ఇటు తిరిగింది. లేచిన రమాకాంతం చటుక్కున మంచంపై కూలబడి కెవ్వుమని అరిచాడు.

దెయ్యం రూపం ఇప్పుడు మనోహరంగా లేదు. వికృతంగా వుంది. చూస్తూండగా ఆమె రూపమెలా మారింది?

రమాకాంతం భయంతో కళ్లు మూసుకొన్నాడు. ఆయన కళ్ళు తెరిచేసరికి దెయ్యం కనబడలేదు. ఆయన మంచంమీంచి కదలలేదు. కాళ్ళూ చేతులూ వణుకుతున్నాయి.

# 5

మర్నాడు యింట్లో దెయ్యం గురించి చర్చ మొదలయింది. రమాకాంతం మరో రోజు పడుకొని దెయ్యం అంతు తేలుస్తానన్నాడు. కానీ అందుకు శాంతమ్మ ఒప్పుకోలేదు. భార్య ఒప్పుకోదని తెలిసే ఆయన ధైర్యం మరింత పెరిగింది.

ఎంత డబ్బయినాసరే ఆ దెయ్యాన్ని వదిలించాలంది శాంతమ్మ.

దీనికి రఘు ఒప్పుకోలేదు. తనూ ఒక రోజు పడుకొని దెయ్యం సంగతి తేలుస్తానన్నాడు. శాంతమ్మ ససేమిరా అంది.

దాని జోలికి పోకుండా చూసి ఊరుకొన్నారంటే ఆ దెయ్యం ఏమీ చెయ్యదని కుసుమ చెప్పింది. అలాగే

చూసి ఊరుకొంటానని మాట ఇచ్చాక నే రఘుకి కూడా మాధవరావు గదిలో ఒక రాత్రి పడుకొనే అవకాశం వచ్చింది.

రాత్రి పన్నెండు గంటలవేళ అతనూ దెయ్యాన్ని చూశాడు. తండ్రిలా అతను భయపడలేదు. లేచి దెయ్యాన్ని సమీపించాడు.

చటుక్కున వికృతమైన ముఖంతో దెయ్యం అతడివైపు తిరిగింది. అప్రయత్నంగా ఒక్కడుగు వెనక్కువేశాడు రఘు.

దెయ్యం రఘు వంకే చూస్తోంది. చేతులు చాపింది. కుసుమకోమలమైన ఆమె చేతివ్రేళ్ళకు పొడవాటి గోళ్ళు ఉన్నాయి.

రఘు ఆగి దెయ్యం వంక నే పరిశీలనగా చూస్తున్నాడు.

దెయ్యం రఘును సమీపిస్తోంది. రఘు దాని వంక నే చూస్తున్నాడు.

దెయ్యం అతణ్ని సమీపించి ఆగింది. ఆగకుండా అతడి కళ్ళలోకే చూడసాగింది. రఘు కొద్ది క్షణాలలాగే నిలబడి వున్నట్టుండి కెవ్వుమని అరిచాడు. తర్వాత అతడు భయంతో కాసేపు కళ్ళు తెరవలేదు. కళ్ళు తెరిచేసరికి దెయ్యంలేదు.

అతని కేక వింటూనే ఇంటిల్లిపాదీ తలుపులు తట్టేరు. ఆ తలుపు తీయాలంటే రఘు రెండు గదులు దాటి వెళ్లాలి. వెళ్ళడానికి అతడికి ధైర్యం చాలడంలేదు.

"రఘూ....రఘూ...." అందరి గొంతుకలూ వినబడుతున్నాయి.

రఘు మంచంమీంచి లేచాడు. ముందు నెమ్మదిగా

నడిచి గది తలుపు తీశాడు. తర్వాత రెండు గుమ్మాలు దాటాలి.

"రఘూ....రఘూ...." కేకలు వినబడుతున్నాయి.

అతను క్షణం తటపటాయించి ఒక్క పరుగున రెండు గుమ్మాలు దాటి తలుపుతీసి కుప్పలా కూలిపోయాడు.

"రఘూ, ఏమయిందిరా?" అంది శాంతమ్మ.

"అమ్మా—అది చాలా ప్రమాదకరమైన దెయ్యం!" అన్నాడు రఘు—"అది నాకు దగ్గరగా వచ్చి ఎంతో క్రూరంగా చూసింది. అప్పుడే నా ప్రాణాలు పోయి నట్లనిపించింది...."

"నాకేసి ఎప్పుడూ క్రూరంగా చూడలేదే!" అంది కుసుమ.

"నేను దాన్ని పట్టుకోవాలనుకొన్నాను. చూపులతోనే నన్నశక్తుణ్ని చేసింది అది—" అన్నాడు రఘు. అతడి మాట ఇంకా వణుకుతూనే వుంది.

రమాకాంతం కుసుమ వంక చూసి—"ప్రొఫెసర్ కర్మ అడ్రసు చెప్పు!" అన్నాడు. ఇంకా జాప్యం చేయడం మంచిదికాదని ఆయనకు తోచింది.

రమాకాంతం ఆ అడ్రసు తీసుకొని మర్నాడు ప్రొఫెసర్ కర్మను కలుసుకొన్నాడు.

"మీ యింటి గుమ్మందాటి కుడిపాదం లోపల పెట్టబోయే ముందు మీరు నాకు అయిదువేలూ అందించాలి. నేను మీ యింటి గుమ్మందాటి వెళ్ళేటప్పుడు దెయ్యాన్ని నాకూడా తీసుకుపోతాను...." అన్నాడు ప్రొఫెసర్ కర్మ.

ఆయన షరతులన్నింటికీ రమాకాంతం అంగీకరించాడు. "మా యింట్లో దెయ్యముందనిగానీ, దాన్ని మీరు

కదిల్చారని గానీ మీ రెవ్వరికీ చెప్పకూడదు—" అన్నాడు.

దీనికి ప్రొఫెసర్ అంగీకరించాడు.

సాయంత్రం ఆరింటికి రమాకాంతం, కర్మ కలిసి ఇల్లు చేరారు. ప్రొఫెసర్ గుమ్మం దగ్గరకు వచ్చి కుడికాలు పైకెత్తి ఆగిపోయాడు. రమాకాంతం వెంటనే ఆయనకు ఓ యాభై రూపాయల నోట్లకట్ట అందించాడు. ప్రొఫెసర్ తృప్తిగా అది జేబులో వేసుకొని ఇంట్లో పాదం పెట్టి—"ఆహా — చక్కటి పరిమళం — మీ యింట్లోని దెయ్యం ఎంతో అందమైనదయుండాలి—" అన్నాడు. ఆయన ముఖంలో పరవశం కొట్టొచ్చినట్లు కనబడుతోంది.

రమాకాంతం ఏమీ మాట్లాడలేదు.

ప్రొఫెసర్ కర్మ అందరితోటీ కలిసి భోంచేశాడు. పడుకొనేందుకు ఆయనకు మాధవరావు గది కేటాయించ బడింది.

ఆయన పక్కవాటాలోకి వెళ్ళి తలుపులు బిగించు కోగానే అంతా అక్కడే కూర్చుండిపోయారు. ఆ రాత్రికింకెవ్వరూ నిద్రపోరాదనీ ఏం చిత్రం జరుగు తుందో చూడాలనీ అంతా నిశ్చయించుకొన్నారు.

సరిగ్గా రాత్రి పన్నెండుంపావుకి పక్కవాటా తలుపులు తెరుచుకొన్నాయి. అందరూ ఆత్రుతగా గుమ్మంవైపే దృష్టిసారించారు.

అందరికీ గుమ్మందగ్గర ప్రొఫెసర్ కర్మ కనిపించాడు.

"వీధి తలుపులు తియ్యండి. మేము వెళ్ళిపోతాం—" అన్నాడు కర్మ.

రఘు పరుగున వెళ్ళి వీధి తలుపులు తీశాడు.

అప్పుడు ప్రొఫెసర్ కర్మ హాల్లో అడుగుపెట్టాడు.

అంతా ఊపిరిబిగబట్టి చూస్తూండగా ఆయన వెనుకనే దెయ్యం కూడా హాల్లో అడుగుపెట్టింది. అంతవరకూ దెయ్యాన్ని చూడనివాళ్ళందరూ ఆసక్తిగా దాన్ని చూడసాగారు.

గుమ్మం సమీపిస్తూండగా కర్మ అన్నాడు—"మేము గుమ్మం దాటగానే వెంటనే తలుపులు వేసుకోండి. తెల్లారేదాకా ఎవరొచ్చినా తలుపు తియ్యకండి—"

ప్రొఫెసర్ కర్మ గుమ్మం దాటాడు. ఆయన వెనుకనే దెయ్యం కూడా గుమ్మం దాటింది.

రఘు చటుక్కున తలుపులు వేసేశాడు.

"అయిదువేలు పోతే పోయాయిగానీ. దెయ్యం వదిలింది—" అంది శాంతమ్మ.

"మంత్రగాళ్ళయితే అయిదారొండల్లో వస్తారు. కానీ దెయ్యాన్ని వదల్చలేరు. దెయ్యాల్ని వదుల్చుకుందుకిదే శాశ్వతమైన ఉపాయం-"అంది కుసుమ.

# 6

దెయ్యం ఎలాగూ పోయిందని కుసుమ మాధవరావుకు జరిగిందంతా చెప్పింది. అతను కంగారుపడి తక్షణం ఇల్లు ఖాళీచేయాలన్నాడు. ఆమె ఎంత చెప్పినా వినలేదు. దెయ్యమున్న యింట్లో క్షణం కూడా ఉండలేనన్నాడతను.

టూర్నించి వచ్చాక అతడికి నాలుగురోజులు సెలవు దొరికిందట. ముందు సామానుతో ఊరువెళ్ళి తిరిగివచ్చి తను ఇల్లు ఇంకోటి చూస్తానన్నాడు. అవసరమైతే తను ఒంటిగా వచ్చి హోటల్లో మకాం పెడతానన్నాడు.

ఈ దంపతుల తీరు రమాకాంతానికి విచిత్రంగానే తోచింది. భార్య దెయ్యాన్ని చూసి కూడా భయపడ

లేదు. భర్త దెయ్యం వెళ్ళిపోయిందని తెలిసి కూడా భయపడుతున్నాడు. ఏది ఏమైనా — "మా యింట్లో దెయ్యమున్నట్లు ఎవరికీ చెప్పొద్దు—" అని ఆయన ఆ దంపతులను ప్రత్యేకంగా కోరాడు.

ఇది జరిగిన మర్నాడు సాయంత్రం ఆరుగంటలకు ఆ యింటికి ఓ పొడుగాటి మనిషి వచ్చాడు. అతడు లాంగ్ కోట్ తొడుక్కొన్నాడు. హ్యాట్ పెట్టుకొన్నాడు.

"నేను మాధవరావుగారి కోసం వచ్చాను—" అన్నాడతను.

"ఆయన లేడు—" అన్నాడు రమాకాంతం.

"కాస్త లోపలకు రావచ్చా?" అన్నాడతను.

"రండి—కూర్చోండి—" అన్నాడు రమాకాంతం.

అతను వచ్చి కూర్చుని నెత్తిమీద టోపీ తీసేశాడు.

రమాకాంతం ఆ వ్యక్తిని చూసి ఉలిక్కిపడ్డాడు. నున్నగా గీసిన గుండు అప్పుడు బయటపడింది. అతడు చాలా భయంకరంగా వున్నాడు.

"వెళ్ళేటప్పుడు మాధవరావు మీకిచ్చిన బ్రీఫ్ కేసు కోసం వచ్చాను—" అన్నాడతను.

"బ్రీఫ్ కేసా? అలాంటిదేమీ యివ్వలేదే?" అన్నాడు రమాకాంతం.

"ఎందుకివ్వడు? ఈ శతమానాన్ని మోసం చేయాలని కూడా ఎవ్వడూ అనుకోడు. నన్ను మోసంచేసిన వాడి పేగులు కత్తి అవసరం లేకుండా నా చేతుల్తో బైటకు తీయగలనని మాధవరావుకు తెలుసు-" అన్నాడు గుండు వ్యక్తి.

"నిజంగా మాధవరావు మాకేమీ యివ్వలేదు—" అన్నాడు రమాకాంతం. గుండు వ్యక్తి అన్నమాటలు

తనకూడా హెచ్చరిక అని గ్రహించడంవల్ల ఆయన శరీరంలో సన్నని వణుకు ప్రారంభమయింది.

గుండు వ్యక్తి లేచి నిలబడ్డాడు. లాంగ్ కోట్ విప్పాడు. పక్కనేవున్న కుర్చీమీద వేశాడు. ఇన్షర్టును లాగి విప్పి దాన్ని లాంగ్ కోట్ మీద వేశాడు. ఒళ్ళంతా కండలే ఆ మనిషికి. అది ఉక్కు శరీరంలాగుంది. అతడొకసారి వ్యాయామం చేసేవాడిలాగానూ, మరోసారి కండల్ని ప్రదర్శించేవాడిలాగానూ ఒళ్ళు కదిపాడు.

పొడుగైన ఆ గుండుమనిషి అలా చేస్తున్నపుడు మనిషిలా గాక రాక్షసుడిలాగున్నాడు. రమాకాంతం పై ప్రాణాలు పైనే పోయాయి.

గుండు మనిషి మళ్ళీ చొక్కా వేసుకొని ఆపైన లాంగ్ కోట్ కూడా వేసుకొని మళ్ళీ కుర్చీలో కూర్చుని—

"ఆ బ్రీఫ్ కేస్ గురించి ఏమన్నారూ?" అన్నాడు తాపీగా.

రమాకాంతానికి ఏం జవాబు చెప్పాలో తెలియదు. గుడ్లు మిటకరించి ఆ మనిషివైపే చూస్తూ వుండి పోయాడు.

"తొందరగా ఆ బ్రీఫ్కేసు తెచ్చి యిస్తే నేను వెళ్ళిపోతాను—"

అతడు వెళ్ళిపోవాలని రమాకాంతానికీ వున్నది కానీ బ్రీఫ్కేసు ఎక్కణ్ణించి తెచ్చి యిచ్చేది?

"ఆ బ్రీఫ్కేసు ఏ రంగుదో, అందులో ఏముందో చెప్పగలరా?"

"బ్రీఫ్కేసు ఏ రంగైతే నాకెందుకూ? అందులో ఇరవై వేలు క్యాషుండాలి—"

"ఇరవై వేలా?" రమాకాంతం నోరు తెరిచాడు.

"తీసుకొన్నప్పుడది చాలా చిన్న మొత్తంగా అని పిస్తుంది. తిరిగివ్వాల్సొస్తే చాలా పెద్ద మొత్తం అని పిస్తుంది. మాధవరావు వెళ్ళిపోయాడుగదా అని నేరం అతడిమీదకు తోసేస్తే నమ్మే రకం కాదు. నా యిరవై వేలూ నాకు అందకపోతే మీ యింట్లో రోజుకొకరు చొప్పున గల్లంతవుతారు—" అన్నాడు శతమానం.

"కానీ ఇరవై వేలు నేనెక్కణ్ణించి తెచ్చి ఇచ్చేది?" రమాకాంతం ప్రపంచంలోని దుఃఖానికంతకూ ప్రతినిధిగా వున్న గొంతుతో అన్నాడు.

"మాధవరావిచ్చిన డబ్బు మీరెక్కడ పెట్టారో నాకేం తెలుసు? ఎక్కడ పెట్టారో అక్కణ్ణించి తెచ్చి ఇవ్వండి!" అన్నాడు శతమానం.

రమాకాంతం ఏదో అనబోయి ఊరుకొన్నాడు. ఇది మాధవరావు చేసిన పనే అయుంటుంది. ఏ కారణం వల్లనో అతడీ మనిషికి ఇరవై వేలు బాకీపడ్డాడు. బాకీ తీర్చే సమయానికెక్కణ్ణించి చల్లగా జారుకొన్నాడు. ఈ శతమానం మూర్ఖుడు. అన్నంత పనీ చేస్తాడు. తనేం చెప్పినా నమ్మడు.

"నాకు కొంత వ్యవధి కావాలి!" అన్నాడు రమాకాంతం.

"ఎల్లుండి మధ్యాహ్నం రెండింటివరకూ మీకు వ్యవధి. ఆ సమయంలోగా మీరు నెహ్రూనగర్ పోస్టాఫీసులో మీ పేరునే ఆ యిరవై వేల రూపాయలనూ అందమైన పార్సిల్‌గా పంపుకోవాలి. అది మీ పేరునే అయినప్పటికీ నాకే చేరుతుంది. మీరేమీ కంగారుపడ నవసరంలేదు—" అన్నాడు శతమానం.

రమాకాంతం ఆలోచిస్తున్నాడు. ఈలోగా తను

పోలీసు రక్షణ పొందితే ఎలాగుంటుందీ అన్న భావం కూడా ఆయనకు కలిగింది. ఆ భావాన్ని చదివినట్లుగా "పోలీసుల గురించి ఆలోచించవద్దు. నన్నెవ్వరూ ఏమీ చెయ్యలేరు. ఆఖరికి నా అంతట నేను చావాలనుకొంటే తప్ప ఆ మృత్యుదేవత కూడా నన్ను సమీపించలేదు..." అన్నాడు శతమానం.

అప్రయత్నంగా తలూపాడు రమాకాంతం.

"సరే—అయితే ఒకసారి మీ ఆఖరబ్బాయి శ్యామల రావునిలా పిలవండి—" అన్నాడు శతమానం.

"ఎందుకూ?" అన్నాడు రమాకాంతం కంగారుగా.

తన లాంగ్ కోట్‌లోంచి ఉల్లిపాయంత బంతిలాంటి పదార్థాన్ని బైటకుతీసి రమాకాంతానికి చూపించాడు శతమానం—"ఇది బాంబు. మీ యింటిని ఒక్కక్షణంలో కూల్చేయగలదు. అయితే యిలాంటివి నేను మీవంటి వాళ్ళకోసం ఉపయోగించను. అవసరపడితే ఎలాంటి వాళ్ళమీద ఉపయోగించడానికీ సందేహించను. నేను చెప్పినట్లు వినకపోతే ఈ బాంబు పేల్చవలసిన అగత్యం పడుతుంది. మీరు ఇక్కడే కూర్చుని మీ ఆఖరబ్బాయి శ్యామలరావుని పిలవండి—" అన్నాడతను.

తడబడుతూ ఆఖరి కొడుకును పిలిచాడు రమాకాంతం.

శ్యామలరావు వచ్చేలోగా టోపీ పెట్టుకొన్నాడు శతమానం. అతడు రాగానే అభిమానంగా పలకరించి—"బాబూ—మీ నాన్నగారు నిన్ను నాతో తీసుకువెళ్ళ మన్నారు. చిన్న పని వుంది. రేపుగానీ, ఎల్లుండిగానీ మనం వెనక్కు వచ్చేస్తాం—" అన్నాడు.

విషయం రామాకాంతానికి అర్థమయింది. శ్యామల రావు తండ్రి వంక చూస్తే ఆయన అసహాయంగా తలా

డించాడు. శతమానం కొడుకుని తీసుకొని వెళ్ళిపోతూంటే ఆయన పర్చీలోంచి వెనక్కి కూడా లేవలేదు.

# 7

జరిగింది విని శాంతమ్మ శోకాలు ప్రారంభించింది — "పసిపిల్లవాడిని ఆ రాక్షసుడు తీసుకుపోతూంటే అలా చూస్తూ ఎలా ఊరుకొన్నారండీ—" అని.

"నాన్నా — ఈ వ్యవహారమేం బాగోలేదు. ఈ లెక్కన రోజుకొక్కడొచ్చి ఏదో బాంబు చూపించి అడిగితే ఓ మనిషినిచ్చి పంపించేస్తూండాలా?" అన్నాడు రఘు.

రమాకాంతం నెమ్మదిగా ఇలా అన్నాడు — "అలా ఎన్నటికీ జరుగదు. ఇదంతా మన దౌర్భాగ్యం. మనకు చెడ్డరోజులు వచ్చాయి. అందుకే ఉన్న డబ్బంతా పోతోంది. ఆ మాధవరావు మూలంగా ఇదంతా జరిగింది. ఉన్న పళంగా వాడు ఇల్లు ఖాళీచేస్తానంటే నేను అందులో ఇంత మోసమున్నదని అనుకోలేదు. ఇక్కణ్ణించి ఎవరికి పడితే వాళ్ళకు ఇల్లివ్వకూడదు. బాగా తెలుసున్న వాళ్ళకో, తెలిసున్నవాళ్ళు చెప్పినవాళ్ళకో యివ్వాలి. ఆ శతమానం మనం డబ్బు కాజేశామని అనుమానపడ్డాడు. లేకపోతే అతడు మనలాంటివాళ్ళ జోలికి రాడు—"

"అయితే ఇప్పుడంత డబ్బు ఎలా తెస్తాం?" అంది శాంతమ్మ.

"వడ్డాణాలు తాకట్టు పెడదాం!" అన్నాడు రమాకాంతం. ఆ మాట వింటూనే రమాదేవి చటుక్కున అక్కణ్ణించి కదిలి వెళ్ళిపోయింది. తన వడ్డాణం కూడా తాకట్టు పెడతారని ఆమె భయపడినట్లుంది.

అయితే రమాకాంతం పెళ్ళయిన పిల్ల వస్తువులు వాడుకొనే మన సత్యం గలవాడు కాదు. ఆ యింట్లో ఆడపిల్లలందరికీ వడ్డాణాలున్నాయి. అవి తాకట్టుపెడితే ఇరవై వేలు తెచ్చుకోవడం పెద్ద కష్టంకాదు—

"మళ్ళీ వాటిని విడిపించేదెప్పుడు?"

"ఎప్పుడేమిటి? రెండు మూడు నెలల్లో విడిపించుకుందాం...."

రమాకాంతం పద్దులు రాయడంలో నిపుణుడు. గొప్ప గొప్ప వాళ్ళకాయన పద్దులు రాయడంలో సలహాలిచ్చి డబ్బు సంపాదిస్తూంటాడు. ఆ ఊళ్ళోనేకాక ఆ చుట్టుపక్కల పొరుగూళ్ళనుంచి కూడా ఆయనకు బేరాలు వస్తూంటాయి.

ఆ విధంగా ఆయన డబ్బు చాలా సంపాదిస్తున్నాడు. వడ్డీ వ్యాపారం చేస్తున్నాడు. అయితే ఆయన అప్పులిచ్చి పుచ్చుకొనేది చాలా తక్కువమందికి. వసూళ్ళు చేసే సామర్థ్యం ఆయనకు లేదు. అందుకని ఆయనకు అప్పులివ్వడం ఇష్టముండదు. ఆదాయం జస్టిఫై చేసుకోవడం కోసం తనింట్లో కూడా ఆయన దొంగ ఋణ పత్రాలూ, దొంగపద్దులూ నడుపుతున్నాడు.

ఆ విధంగా యెందరినో ఇన్‌కంటాక్సు బారినుండి రక్షిస్తూ తను రక్షించబడుతూ వుండే రమాకాంతం తన డబ్బును ఎక్కువగా బ్యాంకుల్లో వుంచడు. ఇంట్లో కొంత రహస్యపుటరల్లో క్యాషుగానూ, మిగతాది నగలరూపేణా దాస్తున్నాడు. ఇన్నాళ్ళకు ఆయనకు కష్టాలొచ్చిపడ్డాయి. బంగారాన్ని తాకట్టు పెట్టే దుర్దశ జీవితంలో మొట్టమొదటిసారిగా కలిగింది.

రమాకాంతం బాధ వేరు .... ఇంతవరకూ వచ్చిన

కష్టాలు తను ఏదో విధంగా తట్టుకొన్నాడు. ఇలాగే కొనసాగితే నిజంగానే తను అన్నీ పోగొట్టుకొని నడి బజార్లో నిలబడాల్సిన అగత్యం పడుతుంది.

8

డబ్బు పోస్టు పార్సిల్ గా పంపించి రమాకాంతం యింటికొచ్చేసరికి ఇంటిల్లిపాదీ ఉత్సాహంగా వున్నారు. శ్యామలరావు యింట్లో వున్నాడు.

"ఎక్కడున్నావురా? ఆ శతమానంగాడు ఇన్నాళ్ళూ ఏన్నేం చేశాడురా?" అని రమాకాంతం కంగారుగా అడిగాడు. శ్యామలరావు ఉత్సాహంగా — "ఆయన చాలా మంచివాడు నాన్నా — ఈ వేళ వెళ్ళిపొమ్మ న్నాడు కానీ నాకింకా రావాలని లేదు—" అన్నాడు.

శతమానం శ్యామలరావుని వదిలిపెట్టిన యింట్లో అతడీడువాళ్ళు అయిదారుగురు పిల్లలున్నారట. ఆ ఇంట్లో పిల్లలాడుకునేందుకు ఎన్ని రకాల గేమ్సున్నాయో లెక్క లేదుట. వాటికి మించి కార్టూన్ ఫిలిమ్స్ చూసుకునేందుకు మంచి ప్రొజక్టరు, బోలెడు ఫిలిమ్సూ వున్నాయట. రోజు క్షణంలా గడిచిపోయిందిట.

"నన్ను మళ్ళీ ఆయనతో పంపించండి నాన్నా!" అన్నాడు శ్యామలరావు.

"ఛ!—నోర్మూయ్—" అంటూ లోపలకు వెళ్ళి పోయాడు రమాకాంతం. జరిగిన నష్టానికి ఆయన గుండె మండిపోతోంది.

ఇప్పుడు తనేం చేయాలి? ఆ శతమానం, మాధవ రావులపైన ఎటువంటి ప్రతీకారం తీసుకోవాలి? అసలు ప్రతీకారం తీసుకోవడం ఎలా? వాళ్ళెక్కడున్నారో తెలియదు. తెలుసుకొనే అవకాశం లేదు.

రమాకాంతం ముఖ్యంగా మాధవరావుని దృష్టిలో ఉంచుకొన్నాడు. అతడు కూడా ఈ వ్యవహారంలో తోడుదొంగ అని ఆయన అనుమానం. అయితే ప్రొఫెసర్ కర్మ సంగతేమిటి? ఆయన వెనుక దెయ్యంగా వెళ్ళి పోయిన ఆ పిల్ల ....

ఆ పిల్ల ఈ వ్యవహారంలో ఉందనుకుందుకు లేదు. ఎందుకంటే ఆమె తన కళ్ళముందే శవం రూపంలో పడి వుండగా చూశాడు. మీదు మిక్కిలి పోలీసులామెను పరీక్షించారు. పోస్టుమార్టం గురించి తీసుకుని వెళ్ళారు.

రమాకాంతానికి అంతా అయోమయంగా వుంది. ఏది నిజమో, ఏది అబద్ధమో, మోసం ఎక్కడ జరిగిందో ఆయనకు తెలియడంలేదు. పోనీ ఇదంతా కలిపి మొత్తం మోసమా అనుకుందామా అంటే—మనసంగీకరించడం లేదు.

అయితే ఒక అనుమానం ఆయన్ను వేధిస్తోంది. తన ఇంట్లోని హత్యా విశేషం పేపర్లలో రాలేదు. పోలీసులు మళ్ళీ తనింటికి రాలేదు-ఆనందరావుని తీసుకొని వెళ్ళడం అయ్యాక ఈ కేసు ఏమయింది? ఆనందరావు ఏమయ్యాడు?

రమాకాంతం ఆత్రుత చంపుకోలేక ఒకో పోలీసు స్టేషనే వెళ్ళాడు. ఎవరో చెప్పుకుంటూండగా విన్నట్లు ఆనందరావు గురించి వాకబు చేశాడు. ఆయన నాలుగు రోజులు తిరిగాక తెలుసుకున్నదేమిటంటే పోలీసు రిజిష్టర్సులో యెక్కడా ఆ కేసు నమోదవలేదు. తను చూసిన ఇన్స్‌పెక్టర్ ఆ ఊళ్ళో లేడు.

అప్పటికి రమాకాంతానికి అనుమానం వచ్చింది. హత్యతో సహా మొత్తమంతా మోసమేనా? ఇలా

ఆలోచించాక ఆయన మొత్తం కథను మననం చేసుకున్నాడు.

ఎలాగో ఒక యువతి తన యింట ప్రవేశించి గదిలో చచ్చినట్లు పడుకున్నది. ఆమె ముఠాకు చెందిన వ్యక్తి ఇల్లు దెబ్బ కావాలని వచ్చి శవాన్ని తన కళ్ళబడేలా చేసి పరుగెత్తాడు. అతడే పోలీసుల్ని పంపించాడు. ఆ పోలీసులూ ముఠా వ్యక్తులే! వారు వచ్చి కాసేపు శవాన్ని పరీక్ష చేసి ఆ యువతిని తీసుకుపోయారు. అప్పుడు ఆనందరావు వచ్చాడు. అతడూ ఆ ముఠాలోని వ్యక్తియే! అతనూ, ఇన్స్పెక్టర్ వేషధారీ కలిసి తన్ను బుట్టలో వేశారు. అంతవరకూ బాగానే వుంది. పది వేలతో పోయింది.

ఆ తర్వాత మాధవరావు, కుసుమ యింట్లో ప్రవేశించారు. వారి ముఠాలోని వ్యక్తి అయిన ప్రొఫెసర్ కర్మకు అయిదు వేలు యిప్పించారు. చనిపోయినట్లు నటించిన యువతి దెయ్యంలా నటించి ప్రొఫెసర్ కర్మతో వెళ్ళిపోయింది.

అప్పటికీ వాళ్ళు తనని వదల్లేదు. శతమానం రంగంలోకి ప్రవేశించి ఇరవై వేలు పట్టుకుపోయాడు. అసలు పోస్టాఫీసులో రిజిష్టరు పార్సిలు చేసినప్పటికి కౌంటర్లోని మనిషి కూడా ఆ ముఠావాడే అయివుంటాడు. అంటే వాళ్ళు తన దగ్గర మొత్తం ముప్ఫైఅయిదు వేలు కొట్టేశారు. కానీ ఈ ముఠాలో ఎంతమందున్నారు?

తన అనుభవాలు పురస్కరించుకొని చూస్తూంటే ఈ ముఠాలోని వాళ్ళు పది పదిహేనుమందయినా వుంటారు. అంటే తన దగ్గర కొట్టేసిన డబ్బు మనిషికి మూడువేలు

కూడా రాదు. వాళ్ళు పడ్డ శ్రమ, తీసుకొన్న రిస్కు సామాన్యమైనది కాదు. మనిషికి మూడు వేల కోసం ఇంత శ్రమపడ్డారంటే నమ్మశక్యంగాలేదు.

బాగా తెగించిన వాళ్ళు తప్ప ఇలాంటి పధకాలు వేయరు. అంతలా తెగించినవారు ఇంత స్వల్ప ఆదాయం కోసం ఇంతగా శ్రమపడరు. అదీకాక ఈ మూఫ్పైఅయిదు వేలకోసం వాళ్ళు కొన్ని వారాలపాటు శ్రమపడవలసి వచ్చింది.

రమాకాంతం ఆలోచనలు మరికాస్త దూరం వెళ్ళేసరికి తన ఆలోచనలు తప్పుదారిలో పడుతున్నాయనిపించింది. హత్య జరిగే ఉం టుం ది. పోలీసులా ఆ శవాన్ని తీసుకుపోయే ఉంటారు. ఆనందరావు ఇప్పుడు జైల్లోనే ఉండివుంటాడు. చనిపోయిన ఆ యువతి దెయ్యమయ్యే ఉంటుంది.

రమాకాంతం ఆలోచనలు అక్కడ ఆగాయి.

వికృతంగా మారిన ఆ యువతి రూపం క్షణమాత్రంలో ఆయనకు వణుకును తెప్పించింది. ఐతే ఆ వికృత రూపం....

ఆలోచన ఆపి ఆయన రఘుని పిలిచాడు. రాగానే—

"ఏరా ఆ పిల్లను దెయ్యంగా నువ్వు కూడా చూశావు. అది వికృత రూపంలో వున్నప్పుడు నీకేమనిపించింది? బాగా ఆలోచించి చెప్పు. ఆమె మాస్కుగానీ వేసుకో లేదుకదా!" అన్నాడు.

రఘు ఆలోచించి — "ఏమో నాన్నా — ఇప్పుడు చెప్పడం కష్టం. అప్పుడు భయంలో ఇంకేమీ తెలియ లేదు. అందులోనూ దగ్గరకు వచ్చి నాకేసి చూడగానే ఏదో మానవాతీత శక్తి అనిపించింది. అది దెయ్యమే అనిపించింది—" అన్నాడు.

"కొంతమందికి హిప్నాటిక్ పవర్ ఉంటుంది. దాంతో వాళ్ళు మనుషుల్ని విభ్రాంతుల్ని చెయ్యగల్గుతారు. మనని వాళ్ళు చాలా తెలివిగా మోసగించారని నా అనుమానం" అన్నాడు రమాకాంతం. రఘు తండ్రి వంక ఆశ్చర్యంగా చూశాడు.

అప్పుడు రమాకాంతం మొత్తం తన అనుమానాలన్నింటినీ వివరించి కొడుక్కి చెప్పాడు. రఘు అదంతా విని—"మనింటికొచ్చిన ఇన్స్పెక్టర్ ఈ ఊళ్ళోలేడు. ప్రొఫెసర్ కర్మ మనకు మళ్ళీ దొరకలేదు. దీన్నిబట్టి చూస్తూంటే మీ ఊహ సరైనదేననిపిస్తోంది. అయినా కొద్ది వారాల శ్రమకు, రిస్కుకు మనిషికి మూడువేలతో తృప్తిపడే ముఠా యిలాంటి కార్యక్రమం తలపెట్టదు. బహుశా ఆనందరావు, ప్రొఫెసర్ కర్మ, శతమానాలకులాగే ఇంకా ఎవరైనా మనింటికి డబ్బుకు వస్తారేమో! మనం చాలా జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు.

కొడుకిలా అనగానే రమాకాంతం బెంగపెట్టుకొన్నాడు. అతడు చెప్పిందాంట్లో వాస్తవముంది. ఆ ముఠా తననుంచి లక్షదాకా రాబట్టుకోవాలంటే తన పని అయిపోయినట్లే! ఇంతవరకూ వచ్చిన నష్టాన్నిలా కూడదీసుకోవాలా అని తను ఆలోచిస్తున్నాడు. ఇంక ఎట్టి నష్టాన్నీ ఊహలో కూడా భరించలేడు.

"నేను వీర్రాజుగారిని కలుసుకొని వస్తాను—" అన్నాడు రమాకాంతం.

రఘు తండ్రివంక ఆశ్చర్యంగా చూశాడు.

వీర్రాజుగారికి రమాకాంతంతో ముఖ్యమైన పనివుంది. ఆయన డబ్బు కూడా బాగా ముట్టజెపుతాడు. అయితే ఆయనతో వ్యవహారంలో చాలా చిక్కులున్నాయని

రమాకాంతం ఓ పట్టాన ఆయన పని చూడడు. సాధ్య మైనంత వరకూ తప్పించుకు తిరుగుతాడు. వెతుక్కుంటూ రమాకాంతం, వీర్రాజు దగ్గరకు వెళ్ళాడంటే ఆయన ఎగిరి గంతేస్తాడు.

9

ఏ వేళలో న్యాయం కావాలనుకున్నా ప్రభు దర్శనం కలిగించే న్యాయ గంట కొన్ని రాజ్యాల్లో ఉండేదట. వీర్రాజు ప్రభువు కాకపోయినా, రాజ్యాలు లేకపోయినా ఆయనకూ న్యాయగంట అవసరముంది. ఆ న్యాయ గంట పేరు గంటయ్య.

రమాకాంతం గంటయ్యనే కలుసుకొన్నాడు.

"మంచి టైములో వచ్చారు బాబూ—అయ్యగారు మంచి మూడ్‌లో వున్నారు—" అన్నాడు గంటయ్య.

మూడ్ అనగానే రమాకాంతం గుండెల్లో రాయి పడింది. వీర్రాజుకి మంచి మూడ్ అందమైన కొత్త ఆడపిల్ల దొరికినప్పుడేనని ఆయనకు తెలుసును. అందుకు ర మా కా ం త ం అభ్యంతరమేమీ లేదు. ప్రపంచంలో సత్ప్రవర్తన తరఫున ఆయన వకాల్తానామా ఏమీ తీసుకో లేదు. ఆడవాళ్ళ విషయంలో కాస్త ముడి కట్టుకున్నా డబ్బు విషయంలో అంతో యింతో గడికరుస్తూనే వున్నాడు. కాబట్టి తనో ఆదర్శపురుషుడనుకుందుకు వీల్లేదు. ఇబ్బంది అల్లా ఏమిటంటే వీర్రాజుకో సరదా వుంది. తనలాంటి వాళ్ళతో మాట్లాడేటప్పుడు ఆడ వాళ్ళతో అసభ్యంగా సరసాలాడ్డం ఆయన హాబీ.

తన యిబ్బంది నాయన పట్టించుకోడు. ఆయన, ప్రియురాలు — మూడో మనిషి లేనట్లే చనువుగా ప్రవ ర్తిస్తారు. ఆయన తనతో వ్యాపార విషయాలు చర్చి

న్తూంటే ఆమె డిస్టర్బ్ చేస్తూంటుంది. ఆ ప్రియురాలు తన ఉనికిని గుర్తించదు. అతడిని రకరకాలుగా రెచ్చగొడుతూ తన వైపు దృష్టి మరల్చుకొనేందుకు ప్రయత్నిస్తుంది. ఆమెను మృదువుగా అనునయిస్తూ సంభాషణ కొనసాగిస్తాడు వీర్రాజు.

ఈ విధంగా రమాకాంతం చాలామార్లు ఇబ్బంది పడ్డాడు. ఆ ఇబ్బంది పలురకాలు. అందులో మనసు చలించడం కూడా ఒకటి.

ఇప్పుడూ వీర్రాజు మంచి మూడ్‌లో వున్నాడంటే తన ఇబ్బంది తనకు తప్పదు. కానీ ఇప్పుడు డబ్బు అవసరం.

తన ఇబ్బందిని రమాకాంతం వీర్రాజుకు చెప్పలేదంటే అందుకు మొహమాటం ఒక్కటే కారణంకాదు. వీర్రాజు కోటీశ్వరుడు!

రాత్రి ఎనిమిది గంటలకు ముహూర్తం పెట్టాడు గంటయ్య.

రమాకాంతానికి మంచి భోజనం ఏర్పాటయింది. భోంచేశాక గంటయ్య ఆయనకు స్వయంగా మారువేషం వేశాడు. గంటయ్య హస్తకౌశలంతోపాటు, గెడ్డం మీసాలు కూడా తోడ్పడగా రమాకాంతం రూపం పూర్తిగా మారిపోయింది.

వీర్రాజు విలాసమందిరం ఊరి మధ్యలోనే వుంది. డబ్బుంటే బహిరంగంగా తప్పులు చేయొచ్చుననడానికి ఆ విలాసమందిరం ఒక చిహ్నం.

వీర్రాజుకు డబ్బున్నా సమాజంలో మరీ అంత గౌరవ ప్రతిష్ఠలు లేవు. పోలీసుల కన్ను ఆయనపై వున్నది. ఆయనతో దగ్గరగా తిరిగే సామాన్యులను

పోలీసులు వేధిస్తూంటారు కూడా. రమాకాంతం వీర్రాజును మారువేషంలో కలుసుకోనే కారణం కూడా అదే! పోలీసులు వీర్రాజును పట్టుకోనే అవకాశం కోసం వేచివున్నారని కూడా చెప్పుకుంటారు. తనకు వ్యతిరేకంగా ఉండే సాక్ష్యాలను నిర్దాక్షిణ్యంగా అణచివేయగల సామర్థ్యం, దౌష్ట్యం—రెండూ ఉండడంవల్ల వీర్రాజు ఇంకా జైలుకు వెళ్ళలేదని చాలామంది అనుకుంటూంటారు.

ఏది ఏమైనా పోలీసుల సానుభూతి పొందని ధనవంతుల్లో అతడొకడని చాలామందికి తెలిసినట్లే—రమాకాంతానికీ తెలుసు.

రమాకాంతం వీర్రాజు విలాస మందిరానికి వెళ్ళాడు. ఆ మందిరంలో వీర్రాజుకో అంతఃపుర మందిరమున్నది. అందులోనికి తప్ప ఎందులోనికైనా వెళ్లాలని రమాకాంతం అనుకుంటాడు. కానీ ఎప్పటిలాగే ఈ రోజూ ఆ మందిరంలోకే వెళ్ళవలసి వచ్చింది.

ఆ గదిలో నాలుగు గోడలకూ శృంగారభరితమైన తైలవర్ణ చిత్రాలు తగిలించి వున్నాయి. గదిలో అడుగు పెట్టగానే మత్తెక్కించే పరిమళం. గది మధ్యలో అందమైన పాన్పు. పాన్పుమీద వీర్రాజు. పాన్పుకు దగ్గర్లో సుఖంగా కూర్చోడానికో సోఫా. అది రమాకాంతం కోసం. సోఫాముందొక చిన్న బల్ల. బల్ల మీద పద్దు పుస్తకాలు. పోలీసులు పట్టుకొన్నా అర్థంచేసుకోలేని ఆ పుస్తకాలకు భాష్యం చెప్పి మార్పులూ, చేర్పులూ చేయగల సామర్థ్యం రమాకాంతంలాంటి కొద్దిమందికే ఉంటుంది.

గదిలో స్త్రీలు లేకపోవడం చూసి రమాకాంతం

తేలికగా నిట్టూర్చాడు. ఈ రోజు తన అదృష్టం బాగుంది.

మంచంమీద వీర్రాజూ, సోఫాలో రమాకాంతం కాసేపు వ్యాపార విశేషాలు చర్చించారు. సమస్య లొకొక్కటే చెప్పుకుపోతున్నాడు వీర్రాజు. ఒకటి కాదు — రెండు కాదు — అరవై లక్షల బ్లాక్ మనీ బైటకు తియ్యాలి.

రమాకాంతం రకరకాల స్కీములు చెప్పాడు. వాటన్నింట్లోనూ ఆయన బ్లాకు మనీ ఎప్పుడో పెట్టాడు. ఈ డబ్బు బైటకొచ్చే ఉపాయం చెబితే రమాకాంతానికి యాభై వేలు ఇస్తానన్నాడు వీర్రాజు. అందులో ఆశ్చర్య మేమీ లేదు. ఆ పూట తిండి ఎలాగా అని ఏడ్చేవాళ్ళున్న ఈ దేశంలోనే ఓ చిన్న పనికి యాభై వేలు పారితోషికంగా ఇవ్వగల పౌరులూ ఉన్నారు. ఇలాంటి బేరం ఆయన దగ్గరున్నదని రమాకాంతానికి తెలుసు. అయితే రావడానికి సంకోచించాడు.

తను ఇచ్చే సలహాల్లో రిస్కులుంటాయి. ఒకోసారి ఆ సలహా ఫెయిలై పోవచ్చు. వీర్రాజు బహుమానం ఎంత ఘనంగా వుంటుందో, శిక్ష కూడా అంత క్రూరంగానూ ఉంటుంది. అందుకే భయపడ్డాడు. కానీ ఇప్పుడు డబ్బు అవసరం రావడంతో అన్ని రిస్కులూ తీసుకోదలిచాడు.

ఇంతవరకూ ఎవ్వరికీ ఇవ్వని సలహా అది!

రమాకాంతం చెప్పింది వింటూనే అప్రయత్నంగానే- "శభాష్!" అన్నాడు వీర్రాజు-"యూ ఆర్ జీనియస్-" అంటూ వందరూపాయల కట్టలు రెండు ఆయనమీదకు విసిరి— "ఇది అడ్వాన్సు...." అన్నాడు.

తర్వాత పద్దులు గురించి చర్చ ప్రారంభమయింది.

సరిగ్గా అప్పుడే గదిలో వీణనాదం వినిపించింది. అది కాలింగ్ బెల్ అని రమాకాంతానికి తెలుసు. వీర్రాజు మంచంమీది ఒక స్విచ్ నొక్కాడు.

తలుపులు తెర్చుకొని ఎవరో గుమ్మంలోకి అడుగు పెట్టిన శబ్దమయింది. రమాకాంతం వీపు తలుపువేపు వుంది. ఆయన వెనక్కు తిరగలేదు!

"ఇలా దగ్గరగా—రా!" అన్నాడు వీర్రాజు.

రమాకాంతం మనసు బాధగా మూలిగింది. ఆయన శరీరంలో వేడిమి కూడా హెచ్చింది. ఒక గంటసేపు ఆవస.... వీర్రాజుతో వినోదం....

"ఇంకెవరో ఉన్నారు.... నాకు సిగ్గు...." ఆ కంఠ స్వరం ఎంతో తీయగా వీణ మీటినట్లుగా ఉన్నది.

"ఫరవాలేదు....రా...." అన్నాడు వీర్రాజు.

"రాలేను.... నాకు సిగ్గు...." అందా కంఠస్వరం.

"సిగ్గంటే కుదరదు..నృత్యం చేస్తానని మాటిచ్చావు."

"చేస్తాను.... కానీ .... నృత్యమెక్కడ్నుంచి!" అందా కంఠస్వరం.

"ఇప్పట్నించీ బేరాలెందుకు? ముందు నృత్యం చేయి" అంటూ మంచంమీది పలుచటి దుస్తులు ఆమె వైపుగా విసిరి—"ఇవి వేసుకో!" అన్నాడు.

"బట్టలు మార్చుకోనా—నాకు సిగ్గు!" అందామె.

"సిగ్గుపడడానికా నీకు డబ్బిచ్చింది!" అన్నాడు వీర్రాజు.

"మీరైతే ఫరవాలేదు .... కానీ ఇంకెవరో?" అందామె.

"మీరు వెనక్కు తిరక్కండీ — నా ప్రియురాలు

బట్టలు మార్చుకుంటుంది...." అన్నాడు వీర్రాజు.

రమాకాంతం వెనక్కు తిరగలేదు.... కానీ ఓ నగ్న సుందరి అతడికి నలువైపులా కనిపిస్తోంది. అది చాలదనట్లు వీర్రాజు కామెంటరీ ప్రారంభించాడు. ఆమెను అతడు వర్ణిస్తున్నాడు. ఏం చేస్తున్నదో, ఎలా ఉన్నదో....

ఆమె బట్టలు మార్చుకోవడం అయినట్లుంది....వీర్రాజు నృత్యం ప్రారంభించమన్నాడు. అతడు మంచంమీద కూర్చునే ఓ స్విచ్ నొక్కగానే గదిలో పాశ్చాత్య సంగీతం ఆరంభమయింది. ఆమె రమాకాంతం ముందుకు రాకుండా వెనుకనే ఉండి నృత్యం చేస్తోంది. ఆమె శరీరాన్నిలా కదపాలో వీర్రాజు సూచనలిస్తున్నాడు. రమాకాంతం పుస్తకాలు చూస్తున్నాడేకానీ దృష్టి కేంద్రీకరించలేకపోతున్నాడు. వీర్రాజుకిదేం ఆనందమో! తన ముఖ్యమైన పని అయిపోగానే ఆయన ఏదో వంక పెట్టి గంటైనా తననలా కూర్చోబెడతాడు. ఆయన వెళ్ళమనే దాకా తను వెళ్ళడానికి లేదు.

అయితే ఈ యువతి ఎవరోగానీ సెరజాణలా వుంది. అరగంటలోనే రమాకాంతానికి వెళ్ళిపోవడానికి అనుమతి లభించింది. అంటే దాని అర్థం — వీర్రాజు ఆ యువతి పొందుకోసం తహతహలాడుతున్నాడన్నమాట!

రమాకాంతం లేచి వెనుదిరిగాడు. వీర్రాజు నంతగా తహాపహలాడిన్నూ అంత సేపూ తనకు కనబడకుండా నర్తించిన ఆ యువతి ముఖం చూడాలని ఆయనకు కుతూహలంగా వుంది. అప్రయత్నంగా ఆయన ఆమెను చూశాడు. అదే కుతూహలం ఆమెను కూడా వేధించినదేమో — అదే సమయంలో ఆమె కూడా తలెత్తి ఆయన వంక చూసి— వెంటనే తల దించుకుంది.

అప్సరసలా మిసమిసలాడిపోతున్న ఆ యువతి ముఖం చూసి రమాకాంతం ఆశ్చర్యపోయాడు. ఆమెను ఇదివరలో చూశాడు. తన యింటినుంచి ప్రొఫెసర్ కర్మ వెనుక దెయ్యం రూపంలో నడిచి వెళ్ళిపోయిన వనిత రూపం ఇలాగే ఉంటుంది.

హంతురాలిగా పడివున్న, దెయ్యంలా గదిలో తిరిగిన, ప్రొఫెసర్ కర్మ వెనుక నడిచిన ఆ రూపం — తన హృదయంలో చెరగని ముద్ర వేసుకుంది.

అయితే ఇదెలా సాధ్యం? ఆమె ఇక్కడికెలా వచ్చింది? తను మోసపోవడం సంగతి సరే — ఆమె ఇక్కడేం చేస్తుంది? వీర్రాజును కూడా మోసగించి బ్రతకగలదా ఆమె!

ఆమె తనను గుర్తుపట్టిందా! పట్టివుండదు. తను మారు వేషంలో ఉన్నాడు. ఈ వేషంలో తనను తన భార్య కూడా గుర్తించలేదు.

ఆమె గురించి తను వీర్రాజుకు చెప్పాలా? చెబితే ఆయనిప్పుడు వింటాడా? ఈ విలాస మందిరంలో వీర్రాజు కెదురులేదు. ఆయన మంచి మూడ్‌లో వున్నాడు ఇప్పుడాయనకు రసభంగం చేయడమెందుకు?

ఎటొచ్చీ తనే ఈ యువతి ముఠా గురించి తెలుసుకోవాల్సి ఉంది. ఎలా? తనకు ముప్పైఅయిదువేలు క్షవురం చేసిన ఈ ముఠాను అంత సులభంగా వదలకూడదు. వాళ్ళ ఉనికి తెలుసుకొనే అవకాశం వచ్చింది.

రమాకాంతం గదిలోంచి బయటకు వచ్చాడు. అయితే ఆయన వెంటనే విలాసమందిరంనుంచి వెళ్ళిపోలేదు. అక్కడేం జరుగుతుందోనన్న కుతూహలం ఆ యువతి వివరాలు తెలుసుకోవాలన్న ఆసక్తి ఆయన్ను అక్కడే

వుందేలా చేశాయి.

విలాసమందిరంలో అతిథుల కోసమని ఒక గదివుంది. రమాకాంతానికి అందులో ఉండాలని వుంది. అదృష్ట వశాత్తూ అది ఖాళీగానే వుంది. వెంటనే ఏర్పాటు జరిగింది.

అప్పుడు టైము పదకొండవస్తోంది. రమాకాంతానికి నిద్ర పట్టలేదు. ఆయన ఆలోచనంతా అంతఃపుర మందిరం మీదనే వున్నది. ఆ యువతి ఎప్పుడు బైటకు వస్తుంది? ఆమె ఆచూకీ ఎలా తీయాలి? ... ఇవే ఆలోచనలతడిని వేధిస్తున్నాయి.

సరిగ్గా పదకొండున్నరకు కాబోలు .... విలాసమందిరంలో కలకలం బయల్దేరింది. ఎవడో దొంగ...వాడిని పోలీసులు తరుముతున్నారు. వాడు పారిపోతూ విలాసమందిరంలో దూరాడు. పోలీసులు వాడిననుసరించారు. వాడెక్కడ మాయమయ్యాడో తెలియదు. కానీ పోలీసులు అంతఃపుర మందిరంలో ప్రవేశించారు.

వారక్కడ ప్రవేశించేసరికి గదిలో వీర్రాజు ఓ శవం ముందు నిలబడి వున్నాడు. పోలీసుల్ని చూస్తూనే ఆయన తడబడినా తమాయించుకొని—"ఈమె ఆత్మహత్య చేసుకుంది!" అన్నాడు.

"దొంగను వెంటాడుతూ వస్తే — హత్య కేసు దొరికింది—" అన్నాడు ఇన్‌స్పెక్టర్. ఆయన ఆ ప్రాంతాన్ని పరిశీలిస్తూ వీర్రాజును ప్రశ్నలు వేయసాగాడు. తర్వాత తన మనిషిని పంపించి అప్పటికి వ్రేలిముద్రల నిపుణుడు, డాక్టరు, ఫోటోగ్రాఫర్ వగైరాలను రప్పించాడు.

వీర్రాజు జరిగిందంతా నిజమే చెప్పాడు.

తనకు స్త్రీ వ్యసనముంది. డబ్బిచ్చి ఆడవాళ్ళను

రప్పించుకున్నాడు. అలాగే ఈమెను రప్పించుకున్నాడు. మొదట్నుంచీ ఆమె నృత్యం మాత్రం చేస్తానంది. ఆమె అందానికి మోజుపడి రప్పించుకున్నాడు. వచ్చేక డబ్బుకు లొంగదా అనుకున్నాడు. లొంగలేదు. బలవంతం చేయబోయాడు. ప్రతిఘటించింది. వినలేదు. వెంటనే తన బొడ్లోంచి బాకుతీసుకొని పొడుచుకొని చనిపోయింది.

వీర్రాజు కథ విని ఇన్స్‌పెక్టర్ నవ్వాడు. ఆ నవ్వు చూడగానే వీర్రాజు పైప్రాణాలు పైనే పోయ్యాయి. అసలే పోలీసులు తనపై పగబట్టి వున్నారు. ఈ అవకాశంతో తనను హంతకుణ్ని చేసి కోర్టులో నిలబెడతారు. తను సంపాదించిన యింత డబ్బూ వృథా!

"ప్రస్తుతానికి మీ కథ నమ్ముతున్నాం. కానీ రికార్డు చెయ్యడంలేదు. యింతకంటే మంచి కథేదైనా ఆలోచించి వుంచండి — రేపు వచ్చినపుడు చెబుదురుగాని. మేమింక శవాన్ని పోస్టుమార్టంకు తీసుకువెళ్ళాలి!" అన్నాడు పోలీసు ఇన్స్‌పెక్టర్.

శవాన్నీ, ఆ గదినీ వివిధ కోణాల్లో ఫోటోలు తీయడం అయింది. శవాన్ని అంబులెన్స్‌లో ఎక్కించేక వీర్రాజు ఇన్స్‌పెక్టర్ని పిలిచాడు....

"నేను నిజంగా నిర్దోషిని. కానీ చట్టానికి కళ్ళు లేవు. ఈ పరిస్థితుల్లో నన్ను నేను కాపాడుకోవడానికి నా దగ్గర డబ్బు తప్ప ఏమీలేదు. అది ఎంతైనా ఖర్చు పెట్టగలను. నన్ను రక్షించే ఉపాయం చెప్పండి!" అన్నాడు వీర్రాజు.

ఇన్స్‌పెక్టర్ అదోలా నవ్వి—"హంతకుడు దొరక్కపోతే మా ఉద్యోగాలే పోతాయి. మిమ్మల్నొదిలిపెడితే మాకీ కేసులో హంతకుడు దొరకడు. ఇది ఆత్మహత్య

కాదనీ, హత్య అనీ డాక్టరు ధృవపరిచాడు. డాక్టరు రిపోర్టు మార్చడం చాలా ప్రమాదకరం. ఈ విషయంలో నేనో సాయం చేయగలను. ఆనందరావని ఒకతనున్నాడు. డబ్బు తీసుకొని ఎదుటివాళ్ళ నేరాలు తనమీద వేసుకుంటాడతను. ఛార్జి చాలా ఎక్కువ. దొంగతనాలకైతే వేలల్లోనూ హత్యలకైతే లక్షల్లోనూ ఛార్జి చేస్తాడు. అతణ్ణి నేరానికి ఒప్పించగలిగితే అప్పుడు మేమూ మీ దగ్గర తృణమో, పణమో తీసుకుంటాము—" అన్నాడు.

వీర్రాజు కాసమయంలో ఇంకేమీ తెలియడంలేదు. ఆయన అర్జంటుగా ఆనందరావు అడ్రసు తీసుకున్నాడు.

# 10

మొత్తం వ్యవహారమంతా రమాకాంతం రహస్యంగా కనిపెడుతూనే వున్నాడు. ఆయన అతిథి గదిలోంచి బయటపడి ఆ పోలీస్ జీపునూ, అంబులెన్సునూ రహస్యంగా వెంటాడాడు ఓ టాక్సీ సహాయంతో. అవి ఒకచోట ఆగాయి. అందులోంచీ ఆ యువతితో సహా అంతా దిగి తలోవైపు నడిచారు.

రమాకాంతం ఈ అవకాశాన్నుపయోగించుకున్నాడు. ఆయన ఆ యువతిని అనుసరించాడు. ఆమె పూర్తిగా ఒంటరిదనీ తనకేమీ ప్రమాదంలేదనీ ధృవపర్చుకొని ఒకచోట ఆమెను అటకాయించి—తన గడ్డం, మీసాలు పీకి "నా పేరు రమాకాంతం! నువ్వు నా యింట్లో దెయ్యంలా నటించావు. నీ గుట్టంతా తెలుసుకొన్నాను-" అన్నాడు.

ఆ యువతి ఖణకిపోతూ — "మీరిందాకా వీర్రాజు గదిలో వున్నారు కదూ—అప్పుడు నేను మిమ్మల్ని గుర్తు

పట్టలేదు....” అంది.

“కానీ నేను నిన్ను గుర్తుపట్టాను. మీ నాటకమంతా చూశాను. రేపు దీనికి స్వస్తివాచకం పలుకుతాను....” అన్నాడు రమాకాంతం.

అప్పటికాయువతి కాస్త తేరుకొని — “అది మీకే ప్రమాదం. మా ముఠా చాలా ప్రమాదకరమైనది. మా రహస్యం తెలుసుకున్నవారు బ్రతికుండరు....” అంది.

“ముందు నీ బ్రతుకు చూద్దాం—” అన్నాడు రమాకాంతం.

ఆమె ఇంకా నిబ్బరంగా—“రమాకాంతంగారూ—మీది పెద్ద కుటుంబం. మా ముఠా మిమ్మల్ని ముప్పై అయిదు వేలతో వదిలిపెట్టింది. డబ్బుతో తృప్తిపడిన మిమ్మల్ని రక్తం కోసం ఆత్రపడేలా చేయకండి. మేము చుక్క రక్తం లేకుండా మా కార్యక్రమాలనన్నీ జరుపుకుంటాము. మీ కారణంగా అది మారకూడదు...” అంది.

ఆమె గుండె నిబ్బరాన్నీ ఈ హెచ్చరికనూ విని రమాకాంతం భయపడ్డాడు. ఆమె తన మాటలతో ఆయన్నింకా భయపెట్టింది. తనవంటివారు ఇలాంటి ముఠాకు ఎదురుతిరగడం మంచిదికాదని రమాకాంతం గ్రహించాడు.

“కానీ మీరు ఇప్పటికే మా రహస్యం తెలుసుకొన్నవారయ్యారు. మా ముఠా మిమ్మల్ని వేటాడుతుందో ఏమో!” అందా యువతి.

ఆమె ఓ మోసగత్తె! రమాకాంతం ఆమెవల్ల మోసపోయి ఈ నాటికి పట్టుకున్నాడు. కానీ పట్టుబడ్డ ఆ మోసగత్తె ఆయన్నే బెదిరిస్తోంది.

"తప్పించుకొనే దారిలేదా?" అన్నాడు రమాకాంతం.

"నేను వాళ్ళకు చెప్పను. వీర్రాజు దగ్గర మా ప్లాన్ సక్సెస్ అయితే మీ గురించి నేను వాళ్ళకు చెప్పవలసిన అవసరమూ ఉండదు. ఫెయిలయిందా మీకు మూడింది."

రమాకాంతం తేలిగ్గా నిట్టూర్చి—"వీర్రాజు దగ్గర్నుంచి ఎంత లాగాలనుకుంటున్నారు?" అనడిగాడు.

"వీలునుబట్టి పదో, పదిహేనో లక్షలు...." అందా యువతి.

అప్పుడు రమాకాంతానికో అనుమానం వచ్చింది "మీది చాలా పెద్ద ముఠా! మీవి చాలా పెద్ద ఎత్తులు. అలాంటప్పుడు ముప్ఫైఅయిదువేల కోసం నాలాంటి పేదవాడి మీద ఎందుకు పడ్డారు?"

ఆ యువతి నవ్వి — "మేము తీసుకొనే రిస్కు సామాన్యమైనది కాదు. ప్రాణాలు పోవచ్చు. శాశ్వతంగా జైలుపాలు కావచ్చు....ఒకరు కాదు....ఇద్దరు కాదు.... ఎందరో ముఠా వ్యక్తుల రహస్యాలు బయటపడవచ్చు."

"అయితే?" అన్నాడు రమాకాంతం.

"అందుకని మేము ఎప్పుడే పెద్ద కార్యక్రమం తలపెట్టినా ముందుగా రిహార్సల్సు వేసి చూసుకుంటాము..."

రమాకాంతం అవాక్కయిపోయాడు. ఆ యువతి దర్జాగా అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

—:ఐ పో యి ం ది:—

# మూడు పొడి అక్షరాలు!

## బొమ్మిడి అచ్చారావు

"లలితా, నాకు హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటుగా ప్రమోషన్ రాబోతోంది" సంతోషంగా చెప్పాడు మాధవరావు.

లలిత మెరిసే కళ్ళతో భర్త వంక చూసింది.

"నిజంగానా? మీకన్న యింకా సీనియర్స్ చాలా మంది వున్నారనుకుంటాను!?"

"ఇద్దరున్నారు. మా సబ్జక్టుకి ముగ్గురమే లెక్చరర్సు. వాళ్ళిద్దరు నాకన్న నాలుగేళ్ళు సీనియర్సు. అయితే, వాళ్ళకు సబ్జక్టు మీద యింట్రెస్టులేదు. పిల్లలకు బోధించగల సత్తా కూడా లేదు. అందుకే వాళ్ళిద్దర్నీ ఓవర్ టక్ చేసి నాకిచ్చారు ప్రమోషను!"

"మరి వాళ్ళిద్దరు వూరుకుంటారా? రిట్ వెయ్యరూ?"

"లల్లీ! మాది ప్రయివేట్ కాలేజి. సీనియార్టీ కన్నా వ్యక్తి ప్రతిభకే యిక్కడ విలువిస్తారు. మేనేజిమెంటు

ఎవడు యోగ్యుడని నిర్ణయిస్తే వాడికే ప్రమోషనిస్తారు. ఒక్కోసారి వాళ్ళకు యెవడు 'ఫేవరబుల్'గా వుంటే వాడికిస్తారనుకో—అది వాళ్ళిష్టం! మన విషయంలో మాత్రం వాళ్ళు న్యాయంగానే వ్యవహరించారని చెప్పాలి!"

"ఆ మాట నిజమేలెండి! రాత్రిళ్ళు నాకు అనుభవమే కదా! మీరు క్లాసుకి ప్రిపరేషన్ చేసుకుంటూ ఒక్కోసారి తెల్లార్లూ అలా కూచుని ఏదో రాస్తూనే వుంటారు. ఎన్నో అందమైన రాత్రిళ్ళు మిస్సయిపోయాం కదా!.." క్రీగంట భర్తని చూస్తూ అంది లలిత.

"ఓహో నువ్వు ఆ లైన్‌లో వచ్చావా?" పెద్దపెట్టున నవ్వేశాడు మాధవరావు.

"సంతోషకరమైన కబురు చెప్పినందుకు మీకేం బహుమతి ఇవ్వాలా అని ఆలోచిస్తున్నాను."

"ఏమిస్తావు?"

"అదే, ఏమివ్వాలా అని...."

"నే చెప్పనా?"

చెప్పండన్నట్లు చూసింది.

"అద్భాన్నుగా ఓ తియ్యటి ము...."

"ఛీ! ఇంత వయసొచ్చింది! ఇద్దరు పిల్లలు పుట్టుకొచ్చారు. అయినా మీ వేషాలకేం కొదవలేదు" అందంగా విసుక్కుంది లలిత.

"పిల్లలు పుట్టినంతమాత్రాన వయసయిపోయినట్టేనా? దేనిదారి దానిదే!"

"అదిగో పిల్లలు స్కూళ్ళనుంచి వచ్చేసినట్టున్నారు" భర్తకు దూరంగా జరిగింది.

"మంచి ఛాన్స్ పోగొట్టేశారు మద్రవేధవలు!"

లలిత కొంగుచాటున రాబోయే నవ్వు నాపుకొని వంట గదివైపు పారిపోయింది.

## 2

విద్యార్థులు పరీక్ష రాస్తున్నారు.

మాధవరావు యిన్విజిలేటర్.

అతని దృష్టి వెనక బెంచీలో కూచుని పరీక్షరాస్తున్న కుర్రాడిమీద కేంద్రీకృతమయింది.

ఆ కుర్రాడు ఆన్సర్ షీటు కిందనించి కాపీ తీసి రాస్తున్నాడు. గమనించాడు మాధవరావు.

ఆ కుర్రాడి దగ్గరకి వెళ్లాడు. అతను రావటం చూసి ఆ కుర్రాడు కాపీ జేబులో దాచెయ్యబోయాడు.

చెయ్యి పట్టి ఆపాడు మాధవరావు.

ఆ కుర్రాడు గుర్రుగా చూశాడు మాధవరావు వంక.

"ఆ కాపీ ఇలా ఇచ్చెయ్యి" మెల్లగా అడిగాడు.

"నా దగ్గర కాపీ ఏంలేదు."

"ఉందో లేదో మనిద్దరికీ తెలుసు. అది పదిమందికీ తెలీకుండా నాకు ముందే యిచ్చేస్తే మంచిది."

"బెదిరిస్తున్నావా?" ఏకవచనంలోకి దిగాడు కుర్రాడు.

"బెదిరించాల్సిన అగత్యమేముంది? నువ్వు నాకు కాపీ హేండోవర్ చేస్తే నిన్నేం చెయ్యను. లేకుంటే ఏం చెయ్యాలో నాకు బాగా తెలుసు."

ఆ కుర్రాడు జేబులో చెయ్యిపెట్టాడు. బయటికి తీసింది కాపీ స్లిప్పులు కాదు—తళతళ మెరుస్తున్న కత్తి!

అది ప్రక్కవాళ్ళకి కనిపించకుండా, వినిపించకుండా అన్నాడు! "ప్రాణాలమీద తీపివుంటే నా జోలికి

రావు. చూసీ చూడనట్టుపో! నా పనేదో నేను చేసుకుంటాను."

మాధవరావు కళ్ళు నిప్పులు కురిశాయి.

"యూ గెటవుట్ ఫస్టు!" గుమ్మంవైపు తర్జనితో చూపిస్తూ అరిచాడు మాధవరావు.

ఆ కుర్రాడు తీక్షణంగా చూశాడు మాధవరావు వంక.

పరీక్ష రాస్తూన్న కుర్రాళ్ళందరూ కళ్ళప్పగించి చూస్తూన్నారు. కుర్రాడికి అవమానమనిపించింది.

"ఇప్పటితో అయిపోయిందనుకోకు. బయటికి వస్తావు కదూ! చూస్తాను.... ఈ అశోక్‌తో గొడవపెట్టుకుంటే ఏమవుతుందో ప్రత్యక్షంగా తెలుసుకుంటావు" విసవిస వెళ్ళిపోయాడు బయటికి.

మాధవరావు కోపంగా అతని పేపరు తీసుకున్నాడు.

అశోక్ దగ్గర తీసుకొన్న కాపీ స్లిప్పులు దానికి జత పరిచాడు.

అంతవరకు రాసిన ఆన్సర్ షీటుమీద రిపోర్టు రాశాడు. ఇద్దరు ముగ్గురు కుర్రాళ్ళచేత సాక్షి సంతకాలు చేయించాడు.

## 3

లోపలికొస్తున్న ఆగంతకుల్ని చూసి, "ఎవరు మీరు?" అన్నది కంగారుగా లలిత.

"నీ శ్రేయోభిలాషులం" అన్నాడు వామనరావు.

"నీ భర్తకు మిత్రులం" అన్నాడు పరాంకుశం.

"ఆయన బజారుకెళ్ళారు. వచ్చేదాకా అలా హాల్లో కూచోండి" అన్నది లలిత.

"ప్రస్తుతం మీ ఆయనతో పనిలేదు."

"మరి?...."

"పనంతా నీతోనే" వెకిలిగా నవ్వాడు వామనరావు.

లలిత కోపంగా చూసి, "మర్యాద యిచ్చి పుచ్చుకోవాలి" అన్నది.

"ఆ విషయం మాకూ తెలుసు" అన్నాడు పరాంకుశం.

"నా భర్త స్నేహితులుగా మిమ్మల్ని నే నెరగను."

"పోనీలే, ఇప్పుడు పరిచయం చేసుకున్నాంగా! మేం వచ్చిన పని చెబుతాం, విను!" అన్నాడు వామనరావు.

లలిత ఆసక్తిగా చూసింది.

"మరేంలేదు. రెండు రోజుల క్రితం మీ ఆయనకు వాల్యుయేషన్ చెయ్యమని కొన్ని పరీక్ష పేపర్లొచ్చాయి" అరోకిలో ఆగిపోయాడు పరాంకుశం.

"అవి ఎక్కడ దాచినదీ నీకు బాగా తెలిసేవుంటుంది. వాటిని మాకు తెచ్చివ్వాలి" అన్నాడు వామనరావు.

లలిత అసహ్యంగా, కోపంగా చూసింది వాళ్ళవంక.

"అయితే మీ యిద్దరు తోడు దొంగలన్నమాట! ఇంట్లోకి దొంగచాటుగా ప్రవేశించినపుడే అనుకొన్నాను. మీరేదో ద్రోహ బుద్ధితోనే లోపలకొచ్చారని! .... నే చెప్పేది కూడా వినిపోండి!....వారొచ్చే టయిమయింది. మీకు సత్కారం చేసి పంపుతారు, మర్యాదగా పోయినా సరే లేకుంటే సన్మానం పొంది వెళ్తానంటే మరి కాస్సే పాగి పోండి" అన్నది లలిత.

వామనరావు నవ్వాడు.

"సత్కారం మాకు చేద్దువుగాని సరే! మీ ఆయనకీ విషయం చెబితే నీ పిల్లలు, నీ భర్త కూడా నీకు దక్క

కుండా పోతారు. జాగ్రత్త!"

లలిత గుండె ఓ క్షణం ఆగి కొట్టుకుంది.

"ఏమిటి నువ్వంటున్నది?" కీచుగా అరిచింది.

"భవిష్యత్తు చెప్తున్నాం. అనవసరంగా ప్రసంగం పెంచకుండా మేం చెప్పినట్లు చెయ్యి. ఆ పేపర్లు ఎక్కడ పెట్టాడో తెచ్చి ఇవ్వు. టైంలేదు, క్విక్!" అన్నాడు వామనరావు.

లలిత తీవ్రంగా ఆలోచిస్తోంది.

"అవి ఇవ్వని పక్షంలో నీ భర్త నీకు దక్కడు. నిన్ను చంపి అయినా తీసుకు వెళ్ళగలం" పరాంకుశం సైలెంట్ బాంబ్ విసిరాడు.

లలిత ఉలిక్కిపడింది.

"మీ కెందుకా పేపర్లు?"

"వాటితో మాకుండే పని మాకుంది. ఎందుకో చెపితే నేగాని యివ్వవా?"

"అవి ఎలా యిచ్చేది? వారి ఉద్యోగానికి సంబంధించిన సమస్య. వాల్యుయేషన్ కి పంపిన పేపర్లు. వాటిని దిద్ది పంపించకపోతే వారి ఉద్యోగానికే ప్రమాదం!"

"వాటిని మా కివ్వకపోతే నీకూ మీ ఆయన ప్రాణాలకే ప్రమాదం! ఉద్యోగం ముఖ్యమా? భర్త ముఖ్యమా? అదేదో నువ్వే తేల్చుకొని మాకు పేపర్లివ్వు!" వామనరావు జేబులోంచి కత్తి తీసి సీరియస్ గా చెప్పాడు.

లలిత చిగురాకులా వణికిపోయింది.

'భగవాన్, ఏమిటీ పరీక్ష?' అనుకొంది. వాళ్ళ మొహాలు చూస్తూంటే, నిజంగానే వాళ్ళన్నంత పని చేసేలా వున్నారు. చూస్తూ చూస్తూ భర్త ఉద్యోగానికి

ముప్పు తెచ్చే పని చెయ్యలేరు. అలా అని ప్రాణాలు పోగొట్టుకోలేదు. తనేం చెయ్యాలి ఇప్పుడు?

"టైం చాలా అయింది. వెంటనే మేం చెప్పిన పని చేస్తావా, మా పని చేసుకోమంటావా?" పరాంకుశం అడిగాడు.

లలిత గబగబ బీరువా దగ్గరకి అడుగులు వేసింది. వణికే చేతులతో తాళాలు తెలిచి పేపర్లు బయటికి తీసింది.

పరాంకుశం అందుకొన్నాడు. "ఓ. కే. ఇదే మేం అడిగింది, వస్తాం!" అన్నాడు.

వామనరావు అతనితో కదిలాడు.

లలిత నిట్టూర్చింది. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

మళ్ళీ అంతలోనే పరాంకుశం లోనికొచ్చి, "ఈ పేపర్సు మాకు యిచ్చినట్టు మీ ఆయనతో చెప్తావా, జాగ్రత్త!" అన్నాడు బెదిరిస్తూ.

లలిత మంద స్వరంలో అంది. "మీరెవరో నాకు తెలీదుగా!"

"అసలు, యీ పేపర్సు ఎలా పోయాయో కూడా మీ ఆయనకు తెలీకూడదు. నీకేం తెలీనట్టే మెలగాలి. మేము వచ్చినట్టుగాని, ఇవి తీసుకు వెళ్ళినట్టుగాని, మా రూపు రేఖలు వర్ణించి మీ ఆయనకు చెప్పటంగాని చేశావో-మీ ఆయనమీద ఆశ వదులుకోవలసి వుంటుంది" అని పరాంకుశం చెపుతుండగానే బయటినుంచి వామనరావు అరిచాడు.

"పరాంకుశం, బయటికిరా వేగం!" అంటూ.

పరాంకుశం కంగారుగా బయటికొచ్చాడు.

సరిగ్గా అప్పుడే మాధవరావు స్కూటర్ యింటి

ముందాగింది.

పరాంకుశం, వామనరావు రెండంగల్లో గేటు బయటికి వచ్చేశారు. కాని, అప్పటికే ఆలస్యమయింది. మాధవరావు ఇద్దర్నీ చూసేశాడు. పరాంకుశం చేతిలోని ప్యాకెట్టు అతని కంటపడింది. వెంటనే పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు.

బయట ఆటో ఆగివుంది.

మాధవరావు, పరాంకుశాన్ని వెనకనించి గట్టిగా పట్టుకొని పేపర్సున్న ప్యాకెట్ లాక్కున్నాడు. అప్పటికే వామనరావు ఆటో ఎక్కేశాడు. పరాంకుశం వామనరావు పట్టు వదిలించుకొని ఒక్క అంగలో పోయి ఆటో ఎక్కేశాడు.

ఆటో వెంటనే బయల్దేరి శరవేగంతో దూసుకు పోయింది.

మాధవరావు తల పంకించి, ఇంట్లోకి వచ్చాడు.

లలిత కళ్ళప్పగించి వాకిట్లో నించుని ఇదంతా చూస్తోంది.

మాధవరావు లోనికొస్తూనే లలిత వంక తీక్షణంగా చూసి, "ఈ పేపర్సు వాళ్ళ చేతికెలా వచ్చాయి?" అన డిగాడు.

లలిత తడబడింది. ఆమె గొంతు పొడారిపోయింది. "నన్ను క్షమించండి, నేనే వాళ్ళకిచ్చాను" అంది.

"ఎందుకు చేశావీపని? ఇవి ఎంత ముఖ్యమైన పేపర్సో ఇవి పోతే నా ఉద్యోగం ఏమవుతుందో నీకు తెలీదా? సంఘంలో నా పరువు ప్రతిష్టలు మట్టి కొట్టుకుపోవటమే గాక, నామీద పోలీసు కేసు కూడా పెట్టివుండేవారు. ఇదంతా తెలిసే నువు ఆ దుర్మార్గులకి యివి ఇచ్చేశావా?"

మాధవరావు కళ్ళు ఎరుపుజీరకి తిరిగాయి.

"నన్ను అపార్థం చేసుకోకండి. వాళ్ళు ఓ గంట క్రితం వచ్చి, 'పరీక్ష పేపర్లు ఎక్కడ దాచారో నీకు తెలుసు, వాటిని మాకు వెంటనే స్వాధీనం చెయ్యకపోతే నిన్ను, మీ ఆయన్ను, పిల్లల్ని చంపుతాము' అంటూ బెదిరించారు. నాకు వాళ్ళెవరో తెలీదు. గత్యంతరంలేక మీరు బీరువాలో దాచిన యీ పరీక్ష పేపర్లు తెచ్చి ఇచ్చేశాను. మీ ప్రాణంకన్నా యీ పేపర్ల విలువ ఎక్కువేం కాదనిపించింది. నేను చేసింది క్షమించరాని పొరపాటు! నన్ను క్షమించండీ!" అన్నది దీనంగా లలిత.

"పిచ్చిదానా! నాకు తెలుసు ఇలా జరుగుతుందని! కాని, నువ్వు కంగారుపడ్డావు. వాళ్ళు బెదిరించినంత మాత్రాన భయపడి ఇచ్చేశావు. తెలివిగా తర్వాత రమ్మని పంపేసి నేనొచ్చాక నాతో చెపితే నేనే చూసుకొనేవాడినిగా. మన అదృష్టం బావుండి, పేపర్ను చెయ్యిదాటి పోకుండా దక్కించుకోగలిగాం. నేను సమయానికి రాకపోతే, ఇక ఇవి ఎప్పటికీ మనకి దొరక్క పోయేవి."

"అసలు పది నిమిషాలముందే వాళ్ళు వెళ్ళిపోయి వుండాల్సింది. అందులో ఒకడు గేటు దగ్గర్నుంచి మధ్య వెనక్కి వచ్చి, వాళ్ళ అనవాళ్ళుగాని, యిలా నేను వాళ్ళకివి ఇచ్చినట్టుగాని మీకు చెప్పకూడదని చెపితే మీకు ప్రమాదమని హెచ్చరించటానికి లోనికొచ్చాడు. ఇంతలో మీరు వచ్చేశారు."

"భగవంతుడు మనకి అన్యాయం చెయ్యడు. అధర్మం జయించదు."

"ఇంతకీ వాళ్ళు...."

"నా కొలీగ్స్. పరాంకుశం, వామనరావు వాళ్ళ పేర్లు. నాకు ప్రమోషన్ రావటం చూసి కన్నుకుట్టి ఇలా వంచనకు దిగారు. పరీక్ష పేపర్స్ పోయిన నేరానికి నన్ను సస్పెండ్ చేస్తారని, ప్రమోషన్ నాకివ్వరని, వాళ్ళలో ఒకరికి వస్తుందని ప్లాన్ వేశారు. నన్ను కేసులో ఇరికించవచ్చునని, నా బెడద వదిలించుకోవచ్చునని వృథా ప్రయాసపడ్డారు. రాస్కెల్స్, చేతికి దొరికినట్టే దొరికి తప్పించుకున్నారు, లేకుంటే సరాసరి పోలీసులకి అప్పగించి ఉండేవాణ్ని!"

"మీ ప్రమోషన్ వెనక ఇంత కుట్ర దాగివుందా? ప్రాణాలతో చెలగాటాలాడే యీ ప్రమోషన్ దేనికి? పోనీ ఆ వెధవలనే తీసుకోనివ్వండి ప్రమోషన్. వద్దని రాసిచ్చేయండి" అంది లలిత.

"లలితా! మనం భయపడేకొద్దీ భయపెడుతుందీ లోకం. వాళ్ళు ఏం చెయ్యలేరు. నిన్ను బాగా భయపెట్టారు. నాకేం ప్రమాదం లేదు, నువు నిశ్చింతగా వుండు."

## 4

"ఏం ప్లాను వేశావోయ్, అంతా బెడిసికొట్టింది." అన్నాడు వామనరావు, పరాంకుశం వంక గుర్రుగా చూస్తూ.

పరాంకుశం వంచిన తలెత్తలేదు.

"నేను మాత్రం ఇలా కథ అడ్డం తిరుగుతుందని కలగన్నానా?"

"అందుకే నేను ముందే మాస్టరు ప్లాను చెప్పాను. ఈసరికి మాధవరావు చీటీ చింపేసివుండేవాడు ఆ

కంట్రాక్టరు. నువ్వు యీ ప్లాన్ చెప్పావు. సరే. మనిషిని చంపకుండా మన పని జరిగిపోతే అంతకన్న కావలసిందే ముందని నీ ప్లాన్‌కి అంగీకరించి పేపర్లు తీసుకొని కాల్చేద్దా మనుకొని నీతో వాడింటికి వచ్చాను. తీసుకొని వెంటనే బయటపడకుండా వార్నింగివ్వటానికి మళ్ళీ లోపలికి వెళ్ళావు, కొంప తీశావు" విసుక్కున్నాడు వామనరావు.

"ఈసరికి విజయవంతంగా పేపర్లు బూడిద చేసి వుండే వాళ్ళం! మాధవరావు చరిత్ర మరో విధంగా ముగిసి పోయి వుండేది. కాని వాడు మనల్ని పట్టేశాడు. నయం, తప్పించుకువచ్చాం లేకుంటే దొంగతనం నేరం మీద మనల్ని పోలీసుల కప్పగించి వుండేవాడు. ఆత్మ హత్య చేసుకు నేవాళ్ళం."

"ఇప్పటికైనా నా ప్లాన్ అంగీకరిస్తావా? ఆ కంట్రాక్టర్ని అర్జంటుగా కలుసుకుందాం పద! రేపీ పాటికి ఆ మాధవరావుగాడి శవం కూడా దొరక్కుండా పని పూర్తిచేస్తాడు. ఎలాగూ వాడి కళ్ళలో పడిపోయాం. మనమీద మేనేజిమెంటుకి రిపోర్టివ్వక మానడు. మన పరిస్థితి మరింత దిగజారిపోతుంది. ఈ లోపలే వాడి చరిత్ర ముగిసిపోవాలి."

పరాంకుశం తలూపాడు.

## 5

రోడ్డుమీద రాళ్ళు పేర్చి వున్నాయి.

చటుక్కున బ్రేక్ వేసి స్కూటర్ ఆపాడు మాధవ రావు.

చీకటిపడి చాలా సేపయింది. ఊరికి దూరంగా నిర్మా నుష్యంగా వున్న ప్రదేశం! ఉదయం పనిమీద రాజ మండ్రి వెళ్ళి తిరిగొస్తున్నాడు. అలవాటుపడిన రూట్.

ఎంత రాత్రయినా ఫరవాలేదు. కాని, మొదటిసారిగా ఇలాంటి పరిస్థితి ఎదుర్కొంటున్నాడు.

చుట్టూ చూశాడు. ఎవడో కావాలని చేసిన పని! తనని అడ్డగించటానికి పన్నిన పన్నాగం!

మాధవరావు బుర్ర చురుగ్గా పనిచేసింది. స్కూటర్ వెంటనే స్టార్టు చేసి స్లోప్ లోకి దింపాడు. కాని అప్పటికే ఆలస్యమయిపోయింది.

ఓ గుంపు అతని స్కూటర్ని చుట్టుముట్టారు.

చీకట్లో కూడా అశోక్ని గుర్తుపట్టాడు మాధవరావు.

"నువ్వా?" అన్నాడు.

"అవును భే, నేనే! పెద్ద సిన్సియర్ ఫెలో లాగా నన్ను కాపీ పట్టుకొంటావా? నే నా రోజే చెప్పాను గుర్తుందా? ఇప్పుడు నీ నిజాయితీ, సిన్సియారిటీ నిన్ను రక్షించగలవా?"

"అశోక్, నీకు తెలిసిన దారిన నువ్వు నడుస్తున్నావ్! దారి కాచి, దండించి నన్ను లొంగదీసుకోలేవు. నా ఉద్యోగ ధర్మం నేను నిర్వర్తించాను. నీకు భయపడి ఆత్మ వంచన చేసుకొనేటంత అల్పుణ్ణి కాను."

"ఇలాంటి అమ్మమ్మ కబుర్లు చెప్పి నా జీవితం పాడు చేశావు. నన్ను కాలేజినించి డిబార్ చేస్తే నాకు భవిష్యత్తు ఏముంది?"

"అది నీ స్వయం కృతం. చదవకుండా డిగ్రీ సంపాదించాలనుకోవాలనుకోవటం దురాశే అవుతుంది. మీరు కాలేజీలకొచ్చేది చదువుకోవటానికిగాని, గ్రూప్స్ వెంట వేసుకొని గూండాయిజానికి దిగటానికి కాదు."

"నీలాంటి వాళ్ళకి బుద్ధి చెప్పటానికి నాలాంటివాళ్ళే సరయిన మందు! నువ్వు చేసినదానికి ఫలితం అనుభవించు.

చూస్తారేంరా, కానివ్వండి!" అన్నాడు అశోక్ తన వాళ్ళ నుద్దేశించి. ఒక్కొక్కడి చేతిలోను సైకిల్ చెయిన్స్, చిన్న కత్తులు వున్నాయి.

సరిగ్గా అదే సమయంలో ఓ బస్ వేగంగా పరుగెత్తు కొస్తోంది. హెడ్ లైట్సు ఫోకస్ అశోక్ వాళ్ళ బృందం మీద పడింది.

గుంపు చెదిరిపోయింది.

సరిగ్గా అదే అదనుగా మాధవరావు స్కూటర్ని స్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చాడు.

వెనకనించి అశోక్ అరిచాడు.

"ఇప్పుడు తప్పించుకొన్నా, నిన్ను నేను వదిలేదిలేదు. నీ అంతు చూసేవరకు నా పగ చల్లారదు."

మాధవరావు వెనక్కి తిరిగి చూశాడు. బస్ ఆగివుంది. డ్రైవరు కాబోలు వాళ్ళను పక్కకు తొలగిస్తున్నాడు.

స్కూటర్ వెనక్కి తిప్పి వెళ్ళి, తను అశోక్ కి అన్యాయం చెయ్యలేదని, పేపర్లు హేండోవర్ చేసేముందు అతను కాపీచేసిన స్లిప్పులు, రిపోర్టు తీసివేశానని అతని భవిష్యత్తుకేం బెంగలేదని అతనితో చెప్పాలనుకొన్నాడు మాధవరావు. కాని ఆ స్థితిలో ఆ మూర్ఖుడికేం చెప్పినా ప్రయోజనం లేదు. వినే స్థితిలో లేడు.

స్కూటర్ ముందుకే పోనిచ్చాడు.

## 6

శవం వంక పరీక్షగా చూశాడు డిటెక్టివ్ కిరణ్.

వెల్లకిలా పడివున్నది శవం.

ఒంటిమీద ఎక్కడా గాయాలు లేవు. కళ్ళు పత్తి కాయల్లా వున్నాయి. నాలుక వెళ్ళుకు వచ్చింది.

కిరణ్ దగ్గరగా గొంతు కూర్చుని చూశాడు. అతడికి

ముప్పైఅయిదు—నలభై మధ్య వుంటుంది వయసు. ఒడ్డూ పొడువుతో హుందాగల ఆకారం.

చుట్టూ పరికించి చూశాడు కిరణ్. అన్నీ పొలాలు. ఊరి పొలిమేరలు. పిఠాపురం 12 కి. మీ. అన్న సర్వే రాయి కనిపిస్తోంది నాలుగు గజాల దూరంలో.

ఫోటోగ్రాఫరు, వేలిముద్రల నిపుణులు తమ పనుల్లో నిమగ్నులయి ఉన్నారు. ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ వారికి ఆదేశాలిస్తున్నాడు.

ఫాథాలజిస్టు తన పరీక్ష ముగించి లేచాడు.

కిరణ్ ప్రశ్నార్థకంగా చూశాడాయన వంక.

"ఇది హత్య అనటానికి ఎలాంటి సందేహమూ లేదు. హత్యా సమయం యిదమిద్ధంగా చెప్పలేకపోతున్నాను. రిగర్ మార్టిస్ ప్రారంభమయి చాలా గంటలు అయింది. బహుశా రాత్రి తొమ్మిది—పదిగంటల మధ్య హత్య జరిగివుండాలి. అతడికి పీకవద్ద, ముక్కువద్ద గట్టిగా అదిమిపట్టి ఊపిరాడకుండా చేసి చంపేశారు. హంతకుడు ఒకడే అని చెప్పలేం, ఇద్దరుకన్న ఎక్కువే ఉండి వుండాలి. ఎందుకంటే ఒకడివల్ల ఇలాంటి హత్యచేయటం జరిగే పనికాదు. అతడు బలహీనుడేం కాదు. ఇద్దర్ని సునాయాసంగా ఎదిరించగల శక్తి ఉన్నవాడు" అన్నాడు డాక్టరు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు శ్రీనివాస్, కిరణ్ వంక చూస్తూ.

కిరణ్ దూరంగా రోడ్డుమీద నిలిపి వున్న స్కూటర్ వంక చూస్తూన్నాడు. ప్రియా స్కూటర్ — లేటెస్టు మోడల్. నీలిరంగుతో నిగనిగ మెరుస్తోంది.

"ఆ స్కూటర్ ఎవరిది?" అడిగాడు కిరణ్.

"అతడిదే అయివుండాలి. మేము వచ్చేసరికే వుంది."

"అతడి వివరాలు తెలిశాయా?"

స్కూటర్ వంక చూస్తూ అడిగాడు కిరణ్.

"లేదు. ఉదయమే ఆరున్నరకు ఫోన్ వచ్చింది. పిఠాపురం నుంచి కాకినాడకు పాల సైకిళ్ళవాళ్ళు ఉదయమే పాలు తెస్తూంటారు. వాళ్ళ కంటబడింది శవం! దగ్గర్లో వున్న ఎ.పి.ఎస్.పి. క్వార్టర్స్‌నించి మాకు ఫోన్ చేశారు వాళ్ళు. ఎక్కడ కేసులో యిరుక్కు-పోతామోనన్న భయంతో కాబోలు మేం వచ్చేసరికే వాళ్ళు వెళ్ళిపోయారు. స్పాట్‌లో ఎవరూ లేరు. పొలాల్లో పనిచేసుకొనేవాళ్ళు కాబోలు దూరంనించే చూసి బెదిరిపోయారు మమ్మల్ని చూసి" చెప్పాడు శ్రీనివాస్.

కిరణ్ ఈ లోపల స్కూటర్‌కున్న బేగ్‌నించి ఓ ఫైలు తీసి పరిశీలిస్తున్నాడు.

"హతుడి పేరు మాధవరావు. ఆర్.ఎస్. కాలేజీలో లెక్చరర్" చెప్పాడు డిటెక్టివ్ కిరణ్.

"బహుశా రాత్రి పొద్దుపోయాక పిఠాపురంనించి కాకినాడ స్కూటర్ మీద వస్తున్నాడన్నమాట!"

కిరణ్ సాలోచనగా తలూపాడు.

"నిన్న అతను ఏ సమయంలో వెళ్ళాడో తెలుసుకోవాలి. పిఠాపురంలో ఎవరెవర్ని కలుసుకొన్నాడో, అతడితో ఇంకా ఎవరయినా వెళ్ళారో లేదో, వచ్చేటప్పుడు అతన్ని చివరిసారిగా ఎవరు చూశారో మొదలైన వివరాలన్నీ తెలుసుకోవాలి ముందు."

శ్రీనివాస్ తలూపాడు.

బేగ్ జిప్ లాగి చూశాడు కిరణ్. ఓ కవర్లో రెండు

కేబినెట్ సైజు ఫోటోలున్నాయి. ఒకదానిలో ఓ జంట వున్నది. మరో ఫోటోలో జంటలోని అమ్మాయి ఒక్కతే వుంది.

"ఈ ఫైలు నీ దగ్గర వుంచు. ఈ ఫోటోల్లో వున్న దెవరో కనుక్కోవలసి వుంది. ఫోటోలు నా దగ్గర వుండనియ్యి" అన్నాడు కిరణ్ ఫైలు శ్రీనివాస్‌కి కందిస్తూ.

కిరణ్ మళ్ళీ శవం దగ్గరకొచ్చాడు.

శవం చెయ్యి సుద్ద అంటుకున్నట్టు తెల్లగా వుంది. పక్కలకు చూశాడు. ఓ పక్క సుద్దరాయి కనిపించింది. అస్పష్టంగా సుద్దతో గీసిన గీతలు కనిపించాయి. వాటి వంక పరీక్షగా చూశాడు కిరణ్.

మృతుడు ఎవరివో పేర్లు రాయటానికి ప్రయత్నించాడు. బహుశా హంతకుల గురించి వివరాలు అయివుండాలి. హంతకులు గమనించి చెరిపేశారు, కనిపించకుండా.

అక్షరాలు తెలుగులో నేరాసివుండాలి. అక్కడొకటి, అక్కడొకటి కనిపిస్తున్నాయి అస్పష్టంగా.

కిరణ్ పరిశీలనగా చూశాడు.

వా, పా, అ—అన్న మూడు అక్షరాలు కనిపించాయి అస్పష్టంగా.

కిరణ్ వాటిని నోట్ చేసుకున్నాడు.

"ఇంకా ఏమైనా పరిశీలించవలసి వుందా?" అడిగాడు శ్రీనివాస్.

కిరణ్ అడ్డంగా తలూపాడు.

శ్రీనివాస్ శవాన్ని మార్చురీకి తరలించటానికి ఆదేశాలిచ్చాడు.

"ఇక పోదామా?" అనడిగాడు శ్రీనివాస్.

"ఆఁ! ముందు ఆర్.ఎస్. కాలేజీకి వెళ్దాం" అన్నాడు కిరణ్.

"ప్రస్తుతం సమ్మర్ వెకేషన్ కదా, కాలేజి వుంటుందా."

"ప్రిన్సిపాల్, స్టాఫ్ వుంటారుకదా, వాళ్ళని ముందు కలుసుకుందాం. మేనేజిమెంటు మెంబరు రమణయ్య నాకు తెల్సు. జగన్నాధపురంలో ఉంటాడాయన. ఆయన్ని కూడా కలుద్దాం. ముందుగా సార్జంటు నెవ ర్నయినా మాధవరావింటికి పంపించి అతని మరణవార్త తెలియపర్చటం మీ పోలీసుల విధి! ఆ ఏర్పాటు చెయ్యి."

అంటూ రాజదూత్ వైపు నడిచాడు కిరణ్. శ్రీనివాస్ సార్జంటు నొకడ్ని మాధవరావు ఇంటికి పంపించాడు.

రాజదూత్ సిటీవైపుగా దూసుకు పోయింది.

## 7

ఆర్. ఎస్. కాలేజి ముందాగింది రాజదూత్.

కిరణ్ దిగి లోనికి నడిచాడు శ్రీనివాస్‌తో.

ప్రిన్సిపాల్‌ని కలిశారు.

పరిచయాలయ్యాక, "మీ కాలేజిలో పనిచేస్తున్న మాధవరావుగారు హత్య చేయబడ్డారు" అన్నాడు శ్రీనివాస్.

ప్రిన్సిపాల్ రంగనాధం ఆశ్చర్యంతో అవాక్కయి పోయాడు.

"వాట్ బేడ్ మార్నింగ్!...." అన్నాడాయన.

"మాకు యీ కేసు విషయంలో కొన్ని వివరాలు కావాలి."

"అడగండి సర్! మాధదవరావు యీ కాలేజికి ఓ పెద్ద ఎస్సెట్! అలాంటి వాడ్ని పోగొట్టుకోవటం

నిజంగా మా దురదృష్టం! చీమకైనా అపకారం చెయ్యని మంచి మనిషిని పొట్టనబెట్టుకొన్న దుర్మార్గుడ్ని చట్టానికి అప్పగించటంలో నాకేమాత్రం అవకాశమున్నా నే వదులుకోను" ఆవేశంగా అన్నాడు రంగనాథం.

"మాధవరావుగారు ఎన్నేళ్ళుగా పనిచేస్తున్నారిక్కడ?"

"ఆయన ఎప్పాయింట్ అయిందే ఇక్కడ. దాదాపు పదకొండేళ్ళు కావస్తోంది. జూనియర్ లెక్చరర్ నుండి లెక్చరర్ అయారు. యిప్పుడు ప్రమోషన్ లిస్టులో వున్నారు. జూన్‌లో ఆర్డర్సు యివ్వబోతున్నారు. ఇంతలోనే ఈ ఘోరం జరిగిపోయింది."

"ఆయన చాలా మంచి వ్యక్తి అని మీ మాటల్నిబట్టి గ్రహించాం. పిల్లలకి ఆయన టీచింగ్ పట్ల ఎలాంటి అభిప్రాయముంది?"

"స్టూడెంట్సులో మంచి పాప్యులారిటీ వుందాయనకు. లెస్సన్ ఎక్స్‌ప్లెయిన్ చెయ్యటంలో ఆయనకాయనే సాటి! అల్లరికి, ఆకతాయితనానికి పేరుబడ్డ కుర్రాళ్ళు కూడా ఆయన క్లాసు చెపుతున్నంతసేపు మంత్రముగ్ధుల్లా వింటారు. అందునా ఎకనామిక్సులాంటి ప్రధానమయిన సబ్జెక్టుని చాలా కొద్దిమంది మాత్రమే విడమరిచి చెప్పగలుగుతారు. అది మాధవరావుగారికి వెన్నతో పెట్టిన విద్య!"

"ఐ.సీ. అయితే స్టూడెంట్సులో ఆయనకు వ్యతిరేకులు ఎవరూ లేరనే విషయం నిర్వివాదాంశం, పోతే ఆయనకు పర్సనల్‌గా ఎవరితోనైనా శత్రుత్వం వుందా?"

"నో! ఆయనంటే స్టాఫంతా చాలా యిష్టం చూపిస్తారు. గత నెల స్టాఫ్ మీటింగ్‌లో ఆయనకు ప్రమోషన్ ఆర్డర్స్ రానున్న విషయం డిక్లేర్ చేసినపుడు స్టాఫంతా అతన్ని అభినందనలతో ముంచెత్తేశారు. అంతెందుకు, అతని సీనియర్స్ కూడా తమకి రావలసిన ప్రమోషన్ అతనికొచ్చినందుకు బాధపడకపోగా, ఆలింగనం చేసుకొని మరీ అభినందించారు."

"అంటే, సీనియర్స్‌ని కూడా ఓవర్ టేక్ చేసి మాధవరావుగార్ని ప్రమోషన్‌కి సెలక్టు చేశారా?" అడిగాడు కిరణ్.

"అవును సార్! ఆయనకన్న నాలుగేళ్ళ సీనియర్ లెక్చరర్ అయిన పరాంకుశంగార్ని, మూడున్నర సంవత్సరాలు సీనియర్ అయిన వామనరావుగార్ని కూడా కాదని మాధవరావుగారికే యీ అవకాశం యిచ్చారు మా మేనేజిమెంటు. ఇది గవర్నమెంటు రికాగ్నైజ్‌డ్ ఇన్స్టిట్యూట్ అయినా ఇక్కడ సీనియారిటీ కన్న ప్రతిభకే మొదట్నుంచీ గౌరవం, విలువ ఇవ్వటం జరిగింది. అదో సంప్రదాయంగా కొనసాగుతూ వస్తోంది."

"అలాగా! .... నిన్న మాధవరావుగారు కాలేజికి వచ్చారా?"

"వచ్చారు సార్! అతనికి కొన్ని పరీక్ష పేపర్లు వేల్యుయేషన్ కోసం పై కాలేజీల నుండి వచ్చాయి. వాటిని దిద్ది, సీలు చేసి కాలేజీకి హేండోవర్ చేశారు నిన్న. మధ్యాహ్నం మూడు గంటలవరకు ఇక్కడే ఉన్నారు. తర్వాత ఏదో పనిమీద పిఠాపురం వెళ్తున్నానని చెప్పి వెళ్ళిపోయారు. అదే నేను ఆయన్ని చివరిసారిగా చూడటం" రంగనాథం కళ్ళు చెమరించాయి. కళ్ళజోడు

తీసి పై పంచతో తుడిచి మళ్ళీ పెట్టుకున్నాడు.

"ఆయన పిఠాపురం వెళ్తున్న విషయం ఎవరకైనా తెలుసా?" అడిగాడు కిరణ్.

రంగనాథం రెండు నిమిషాలేదో గుర్తు చేసుకోవటానికి ప్రయత్నించి, "తెలుగు లెక్చరర్ అవధాని, స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్ దివాకర్ వున్నారు. అంతే, మేం నలుగురమే వున్నామా సమయంలో యీ గదిలో" అన్నాడు.

కిరణ్ రెండు నిమిషాలు మౌనం వహించాడు. తను మాధవరావు ఫైల్లో చూసిన మార్కుల లిస్టు మనసులో మెదిలింది. ఆ ఫైల్లో మాధవరావు తను వేల్యుయేషన్ చేసిన నెంబర్ల మార్కులు రాసుకొని కాపీ వుంచుకున్నాడు. బహుశా ఇట్నించి ఇటే పిఠాపురం వెళ్ళి వుంటాడు. అసలు పిఠాపురం ఎందుకు వెళ్ళాడో తెల్సుకోవాలి! అతని భార్యకి తెలిసి వుంటుంది.

కిరణ్ శ్రీనివాస్ వంక చూసి తల పంకించాడు.

"నమస్కారం సార్! చాలా ముఖ్యమైన విషయాలు చెప్పారు. అవసరమయితే మళ్ళీ కలుస్తాం" లేచాడు శ్రీనివాస్.

# 8

"ఇలాంటి విషాద పరిస్థితుల్లో భర్తపోయిన భార్యను ఇంటర్వ్యూ చేయటం నాకు చాలా బాధాకరంగా వుంటుంది" అన్నాడు కిరణ్ మాధవరావ్ యింటి ముందు రాజ్‌దూత్ నిలుపుతూ.

ఇంట్లో చాలామంది ఆడవాళ్ళు గుమిగూడి వున్నారు. కిరణ్‌ని, శ్రీనివాస్‌ని చూడగానే లేచి పక్కకు తప్పుకున్నారు.

వాళ్ళ మధ్య శోకదేవతలా వున్న స్త్రీని మాధవ రావు భార్యగా గుర్తుపట్టాడు కిరణ్. ఇంకా చిన్న వయసు! పక్కనే పదేళ్ళ కుర్రాడొకడు, ఎనిమిదేళ్ళ పాప వున్నారు. బహుశా మాధవరావు పిల్లలు కావచ్చు ననుకున్నాడు కిరణ్.

. "అమ్మా! మేము పోలీసు దర్యాప్తుచేస్తున్నాం. మీ భర్తగారి హత్య కేసు గురించిన వివరాలు కావాలి. మీరు అన్యథా భావించకపోతే, మాకు కొన్ని ప్రశ్నలకు జవాబులు కావాలి!" అన్నాడు కిరణ్.

లలిత గొంతు సవరించుకొని, "అడగండి!" అన్నది.

"మీ భర్తగారు నిన్న యింటినించి ఎన్ని గంటలకు బయటికి వెళ్లారు?"

"ఉదయం పదిన్నర గంటలకి. కాలేజి పనిరోజుల్లో తొమ్మిదిన్నరకే వెళ్తుంటారు. ఇప్పుడు వెకేషన్ కావటంవల్ల పదిన్నరకి వెళ్తున్నారు."

"మళ్ళీ ఎన్ని గంటలకు తిరిగొచ్చారు?" శ్రీనివాస్ అడిగాడు.

లలిత కంఠంనుండి పొంగిపొరలే దుఃఖాన్ని అదుపు చేసుకొని, "మళ్ళీ తిరిగిరాలేదు. అదే నేను చివరిసారిగా ఆయనను చూసినది!" అన్నది.

శ్రీనివాస్ నాలిక కరచుకున్నాడు.

"అంటే ఉదయం పదిన్నరకి కాలేజీకి వెళ్ళి అట్నించి అటే పిఠాపురం వెళ్ళిపోయారన్నమాట! మీ వారికి పిఠాపురం వెళ్ళాల్సిన పనేమయినా వుండిందా నిన్న?"

"నిన్న ఉదయం వెళ్ళేటప్పుడు సాయంత్రం పిఠాపురం వెళ్తానని నాతో అన్నారు. ఇంటికి వచ్చి వెళతానన్నారు. సాయంత్రం వరకు రాకపోవటంతో ఇక

కాలేజినుండి వెళ్ళిపోయి వుంటారనుకున్నాను. కాని యింత ఘోరం జరిగిపోతుందనుకోలేదు" దుఃఖాన్ని అణచుకోవటం యిక శక్యంకాలేదామెకు. తనివితీరా ఏడవనిచ్చారు. పిల్లలిద్దరూ బిక్కమొహాలతో గుడ్ల నీరు కుక్కుకుంటున్నారు.

"ఆయన పిఠాపురం ఎందుకు వెళ్ళారు?"

"ఆయన శిష్యుడొకడతను కొత్తగా పెళ్ళిచేసుకున్నాడు. ఆ కుర్రాడిది పిఠాపురం. పేరు రాఘవరావు. వర్ణాంతర వివాహం. అమ్మాయికూడా వారి శిష్యురాలే! పేరు జానకి. పెళ్ళి వారం రోజుల క్రితం యీయన ఆధ్వర్యంలోనే జరిగింది. వారం రోజులుగా వాళ్ళు రమ్మని కోరుతుంటే యిక తప్పనిసరిగా నిన్న వెళ్లారు. నన్ను పిల్లల్ని కూడా తీసుకువెళ్తానన్నారు. కాని ఎందుకో, మరోసారి తీసుకుపోతానని చెప్పి ఒక్కరే వెళ్ళివస్తానని వెళ్ళారు."

కిరణ్ జాలిగా చూశాడామెవంక.

"మీవారికి శత్రుత్వం వున్న వాళ్లెవరైనా మీకు తెలిసివుంటే చెప్పండి."

"మావారు ఎవరితోను గొడవపడే మనిషి కాదు. అందరితోను సర్దుబాటు చేసుకుని మసలగల వ్యక్తి. శత్రువులని చెప్పలేనుగాని ఆయన కొలీగ్స్ యిద్దరికి యీయన ఔన్నత్యం చూసి కన్నుకుట్టి, యీయనకు చెడ్డపేరు తేవాలని చూశారు" అని వామనరావు, పరాంకుశంల గురించి చెప్పింది.

"చాలా మంచి సంగతి తెలియచేశారమ్మా!" అని కిరణ్ కోటు జేబులోనుండి కేబినెట్ సైజు ఫోటోలు పైకి తీశాడు.

లలితకి చూపించి, "ఇందులో వున్న వాళ్ళెవరో గుర్తుపట్టగలరా?" అనడిగాడు.

లలిత ఆ ఫోటోలు చూస్తూనే, "ఆ ఫోటోలో వున్న జంటకే మావారు వివాహం జరిపించింది! నిన్న వాళ్ళని కలవటానికే వెళ్ళారు. మీకీ ఫోటోలు ఎలా వచ్చాయి?" అనడిగింది.

"మీవారి స్కూటర్ బేగ్‌లో వున్నాయి."

"ఆ అమ్మాయి చాలాసార్లు ఇక్కడికొచ్చింది. తన ఫోటో నాకు ఆల్బంలో పెట్టుకోవటానికి ప్రత్యేకం ఇస్తానంది. బహుశా యీ ఫోటోలు నిన్ననే ఇచ్చి వుంటారు వాళ్ళు" అన్నది లలిత.

కిరణ్‌కి మంచుతెర విడిపోయింది.

ఆమె వద్ద సెలవు తీసుకొని బయటకు నడిచారు.

వాళ్లు గుమ్మందాటుతుండగానే మళ్ళీ లలిత గుండెలు పగిలేలా ఏడవటం వినిపించింది.

కిరణ్ రాజ్‌దూత్ స్టార్టు చేయబోతూ ఆగి, "నువు కాలేజికి సార్జంటుని పంపి పరాంకుశం, వామనరావు అడ్రసులు సేకరించి వాళ్ళిద్దరినీ తీసుకురమ్మను. ఈ కేసులో ప్రస్తుతానికి వాళ్ళిద్దరు అనుమానితులుగా కనిపిస్తున్నారు" అన్నాడు.

శ్రీనివాస్ ఏదో స్ఫురించినట్టు, "మనకి స్పాట్‌లో కనిపించిన పొడి అక్షరాల్లో 'వా, ప' అన్న అక్షరాలు వీళ్ళ పేరులే నేమో!" అన్నాడు.

"అదీ తెలుస్తుంది. ముందు వాళ్ళని పిలిపించి, నాకు ఫోన్ చెయ్యి. నిన్ను పోలీస్ స్టేషన్ వద్ద దించి నేను ఇంటికి వెళ్తాను" అన్నాడు కిరణ్.

ఫోన్ గణగణ మోగింది.

"హల్లో!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ మాట్లాడాడు. "బ్రదర్, పరాంకుశం, వామనరావు యిద్దరు కూడా ఊళ్ళో లేరు. పరాంకుశం మూడురోజుల క్రితం వాళ్ళ తమ్ముడి ఊరు విజయవాడ వెళ్ళాడట. వామనరావు వాళ్ళ నేటివ్ ప్లేస్ కొత్తపేట వెళ్ళాడట. విజయవాడ, కొత్తపేట మనవాళ్ళని పంపించి దర్యాప్తు చేయించనా?"

"చేయించు. దానికన్న ముందు విజయవాడ క్రైం బ్రాంచ్‌కి, కొత్తపేట బ్రాంచ్‌కి ట్రంకాల్ చేసి వాళ్ళ వివరాలు సేకరించి నీకు చెప్పమను. తర్వాత అవసరాన్ని బట్టి మీ జనాన్ని అక్కడికి పంపించు" అన్నాడు కిరణ్.

"అలాగే! మరి ఆ వివరాలు తెలిసేలోపల మన తర్వాతి కార్యక్రమం ఏమిటి?"

"కేసు నేననుకొన్న మలుపులే తిరుగుతోంది. నా ఊహే నిజమయితే పరాంకుశానికి, వామనరావుకి కూడా తిరుగులేని ఎలిబీ వుంటుంది నిన్నటి రోజంతా. సరే నువ్వు వెంటనే బయల్దేరి మా యింటికి రా! మనిద్దరం పిఠాపురం వెళ్ళొద్దాం" అన్నాడు శ్రీనివాస్.

అన్నట్టుగానే శ్రీనివాస్ జీవ్ పదినిమిషాల్లో కిరణ్ యింటి ముందాగింది.

కిరణ్ జీప్ ఎక్కుతుండగా ఓ ఆటో వచ్చి ఆగింది. అందులోంచి ఓ యువకుడు ఆయాసపడుతూ దిగాడు.

కిరణ్ భ్రుకుటి ముడిపడింది. తాము పిఠాపురం వెళ్ళేది యితని కోసమే! ఫోటోలో వ్యక్తి. రాఘవరావు.

"సార్ ఇన్స్పెక్టర్ గారూ! మీతో మాట్లాడాలి" అన్నాడు అతను—రాఘవరావు, యిద్దరికీ నమస్కరించి.

కిరణ్ జీపు దిగాడు. శ్రీనివాస్ అతన్ని చూసి లోపలికి రమ్మని సైగ చేశాడు. కిరణ్ వెనుక యిద్దరు అతని డ్రాయింగ్ రూంలోకి నడిచారు.

"మీ కోసం యిప్పుడే స్టేషన్ కి వెళ్ళి వస్తున్నాను. మీరు డిటెక్టివ్ కిరణ్ గారింటికి యిప్పుడే వెళ్ళారని చెప్పారు. వెంటనే అదే ఆటోలో ఇక్కడికొచ్చాను" అన్నాడు రాఘవరావు.

"కూచోండి" అన్నాడు కిరణ్. ముగ్గురూ కూర్చున్నారు.

"ఇప్పుడు చెప్పండి."

"నా పేరు రాఘవరావు. బి.కామ్ ఫైనల్ పరీక్షలు యీ సంవత్సరమే రాశాను. మాది పిఠాపురం. మాధవరావుగారు మా గురువుగారు. ఈ రోజు మధ్యాహ్నమే ఆయన మరణవార్త నాకు తెలిసింది. వెంటనే మీదగ్గరకు బయల్దేరి వచ్చాను."

కిరణ్ తలూపాడు.

రాఘవ చెప్పుకుపోతున్నాడు. "మాధవరావుగారు దేవుడిలాంటివారు. నాకు ఎన్నో విధాల సహాయపడ్డారు. డబ్బు తీసుకోకుండా ట్యూషన్ చెప్పారు. నన్నో మనిషిని చేశారు. నాకిష్టమయిన అమ్మాయితో వివాహం జరగటానికి నాకు పెద్ద దిక్కుగా నిలబడి జరిపించారు. నిన్న సాయంత్రం మా ఇంట్లో మా ఆతిథ్యం స్వీకరించారు. ఇంతలోనే ఆయనకు నూరేళ్లు నిండిపోతాయనుకోలేదు" అతని కంఠం గాద్గదికమైంది.

శ్రీనివాస్ కల్పించుకొని, "ఈ హత్య విషయంలో

మీ కేమైనా వివరాలు తెలిస్తే చెప్పండి." అన్నాడు.

"ఈ హత్యతో అశోక్ అనే స్టూడెంటుకి సంబంధ ముందని నా అనుమానం సార్!"

"అశోకా? అతనెవరు?"

"అతను నా క్లాస్ మేట్ సార్! మొన్ననాలోనే పరీక్షలు రాశాడు కూడా. పరీక్షలో కాపీచేస్తోంటే మా సార్ పట్టుకున్నారు. అప్పట్నించి కక్షగట్టాడు. మొన్న ఓ రోజు సార్ని దారికాసి కొట్టబోయాడు కూడా. సార్ అదృష్టవశాత్తు తప్పించుకున్నాడు. కాని మళ్ళీ ఇంతలోనే మరోసారి ఆయనపై దాడిచేసి చంపేసి వుంటాడు."

"ఆయనమీద దాడిచేసినట్టు మీకెలా తెలుసు?"

"ఆ విషయం నిన్ననే మా సార్ మాటల సందర్భంలో చెప్పాడు. నేను, అశోక్, నా భార్య జానకి ఒకే క్లాస్. అంచేత ఆ విషయం ప్రసక్తికి వచ్చింది."

"ఐ.సీ. నిన్న మీ సార్ మీ ఇంట్లో ఎన్ని గంటల వరకు ఉన్నారు?"

"రాత్రి ఎనిమిదిన్నరవరకు. నేను ఆయన కాకినాడ రోడ్న స్కూటర్ మళ్ళేవరకు చూస్తూనే వున్నాను."

"ఈ ఫోటోలు మీవేనా?" ఫోటోలు చూపించి అడిగాడు కిరణ్.

"అవును సార్! నేనే నిన్న వీటిని సార్కిచ్చాను. ఈమె నా భార్య జానకి! విడిగా మా అమ్మగారికి తన ఫోటో యిమ్మని సార్కిచ్చింది. ఇది మా రేజ్ టైంలో దండలతో తీసుకున్న ఫోటో!"

"అశోక్ ఎక్కడుంటాడు?"

"కాకినాడే సార్ అతనిది. సూర్యనారాయణపురం.

ఇల్లు నాకు తెలుసు సార్!"

"ఓ.కే. మాతో రండి."

ముగ్గురు జీప్ ఎక్కారు.

దార్లో శ్రీనివాస్ అన్నాడు. "మనం చూసిన పొడి అక్షరాల్లో మూడోది అశోక్‌ని సూచిస్తున్నట్లు నాకనిపిస్తోంది."

"అశోక్ అనే ఎందుకనుకోవాలి? తెలుగు లెక్చరర్ అవధాని కాకూడదా?" నవ్వాడు మెల్లగా కిరణ్.

శ్రీనివాస్ మళ్ళీ మాట్లాడలేదు.

రాఘవరావు అశోక్ ఇంటి దగ్గర జీప్ ఆపించాడు.

పోలీస్ జీప్ చూసి ఓ యిరవైయేళ్ళ యువకుడు బయటికి తొంగిచూశాడు.

"అతనే అశోక్!" అన్నాడు రాఘవరావు.

ముగ్గురూ జీప్ దిగారు.

అశోక్ బయటికొచ్చాడు.

"మీరేనా అశోక్?" అడిగాడు శ్రీనివాస్ అధికార స్వరంతో.

"అవును సార్!"

"నిన్న రాత్రి తొమ్మిది—పదిగంటల మధ్య మీరెక్కడున్నారు?"

"మా స్నేహితుడు రాజు పెళ్ళికి అటెండయ్యాను సార్, రాత్రి పన్నెండు గంటలవరకు."

"ఎక్కడ?"

"జగన్నాథపురం."

"అంతకుముందు?"

"అంటే తొమ్మిది గంటలకి ముందా?"

"అవును."

"మా ఇంట్లోనే వున్నాను. ఎనిమిదిన్నరకు బయల్దేరి జగన్నాథపురం వెళ్ళాను."

"లెక్చరర్ మాధవరావుని ఎవరో హత్య చేశారు. హత్య రాత్రి తొమ్మిది గంటల తర్వాతనే జరిగింది."

అశోక్ అవాక్కయిపోయినట్లు కనిపించాడు.

"ఏమిటి సార్ మీ రంటున్నది? లెక్చరర్ మాధవరావుగార్ని హత్య చేశారా? ఎవడు సార్ ఆ రాక్షసుడు?"

"ఆ రాక్షసుడి వేటలోనే వున్నాం. మీరు కూడా అనుమానితుల లిస్టులో వున్నారు."

"ఏ ఆధారంతో నిర్ణయించారు?"

"మీరిదివరలో మాధవరావుగార్ని గూండాలతో కొట్టించే ప్రయత్నం చేశారు కదూ!"

అశోక్ తల వంచుకున్నాడు.

"ఓసారి ఆ ప్రయత్నం చేసినందుకు ఇప్పటికీ పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాను. నేను ఆయన్ని దారికాసి కొట్టబోయాను—నన్ను పరీక్షలో కాపీ పట్టుకున్నందుకు. కాని, ఆయన తప్పించుకుపోయారు.

ఆ మర్నాడు ఆయనే స్వయంగా మా ఇంటికొచ్చారు. నన్ను పక్కకు పిలిచి, నా కాపీ స్లిప్పులను, రిపోర్టును అధికారులకి పంపించలేదని, తీసివేశానని, నా చదువుకి ఆటంకం వుండబోదని, కాకపోతే మరోసారి పరీక్షకు కూచోమని, అందుకు తన శక్తివంచనలేకుండా నన్ను తయారుచేస్తానని చెప్పారు.

ఆయన మంచి మనసుకు నాకు కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. అనవసరంగా తొందరపాటులో ఆయనకు హాని తలపెట్టినందుకు క్షమాపణ కోరుకున్నాను. ఆ

తర్వాత ఆయన్ని మళ్ళీ నేను చూడలేదు" అన్నాడు.

"అయితే యీ హత్యతో నీకేం సంబంధం లేదంటావు!" రెట్టించాడు శ్రీనివాస్.

కిరణ్ సాలోచనగా అశోక్ వంక చూస్తూ "పోనీ, హత్యకు సంబంధించిన వాళ్ళెవరో చెప్పగలరా?" అనడిగాడు.

అశోక్ కొద్ది క్షణాలు మాట్లాడలేదు.

"వాళ్ళే చేసివుంటారని నేను చెప్పలేను గాని, నాకైతే ఇద్దరిమీద అనుమానం వుంది."

"ఎవరు వాళ్ళిద్దరు?"

"మా లెక్చరర్స్. వామనరావు, పరాంకుశంగార్లు."

"వాళ్ళమీద ఎందుకనుమానం వచ్చింది?"

"మాధవరావుగారితో ఓసారి వాళ్ళిద్దరు గొడవపడ్డారు. పైగా ఆయన వుంటే వాళ్ళకి అడ్డు! సీనియార్టీని కాదని ఆయనికి ప్రమోషన్ యిస్తానన్నారు మేనేజిమెంటు. ఎలాగైనా మాధవరావుగారి అడ్డు తొలగించుకోవాలని వాళ్ళిద్దరు నిశ్చయించుకొన్నారు. ఈ లోపల మాధవరావుగారు నా కాపీ పట్టుకోవటం నేను ఆయనకు విరోధికావటం జరిగింది. దాన్ని ఆసరాగా తీసుకొని మాధవరావుగారి మీదకు ఉసికొలిపింది కూడా వాళ్ళిద్దరే!

నా ప్రయత్నం ఫెయిల్ కావటం, మాధవరావుగారు నా కళ్ళు తెరిపించడం జరిగిన మర్నాడు మళ్ళీ నన్ను మాధవరావుగారిమీదకు ఉసిగొల్పబోయారు. నేను ఎదురుతిరిగి మాట్లాడగానే చల్లగా జారుకున్నారు.

అయితే నేను వాళ్ళిద్దర్నీ వదిలిపెట్టకుండా వెంటాడాను. కొత్తవీధిలో ఓ గూండా నాయకుడ్ని కలుసు

కున్నారు. వాడు పైకి పెద్ద మనిషిలా వ్యవహారిస్తూనే ఎన్నో ఘోరకృత్యాలు చేయిస్తుంటాడు. వాడిచేతిలో ఎందరో గూండాలు, హంతకులు, నరరూప రాక్షసులు వున్నారు.

వాడు ఖూనీ కేసుల్ని ఒప్పుకుని గుట్టుచప్పుడు కాకుండా పని పూర్తిచేయిస్తాడు. ముందుగానే దానికి 'రేటు' మాట్లాడుకుంటాడు. మా లెక్చరర్సు యిద్దరు వాడ్ని కలిసి మాట్లాడటం, వాడు వీళ్ళతో చేతులు కలపటం నేను కళ్ళారా చూశాను.

మా లెక్చరర్సు అక్కడ్నించి వెళ్ళిపోగానే నేను ఆ కాంట్రాక్టర్ని కలిశాను. వాళ్ళు చేయబోతున్న ఘోర కృత్యం వెనక వున్న స్వార్థాన్ని ఆ కాంట్రాక్టర్కి వివరించి చెప్పాను. వాడిలో కూడా కొంత మానవత్వం ఏ మూలనో వున్నట్టుంది. ఆ పని చెయ్యనని నాకు మాటిచ్చాడు. కావాలంటే మా లెక్చరర్సు యిస్తానన్న డబ్బుకన్న ఎక్కువిస్తాను, ఆ పని విరమించుకోమని కోరాను. డబ్బు అక్కర్లేదని మాధవరావుగారికి ఎలాంటి హానీ చెయ్యననీ మాటిచ్చాడు నాకు.

ఇది జరిగి మూడు రోజులయింది. ఇంతలోనే యిలా జరగటం నాకు ఆశ్చర్యంగావుంది. ఆ కాంట్రాక్టరుగాడు డబ్బు కక్కుర్తితో మాధవరావుగార్ని చంపడానికి మనుషుల్ని నియమించాడేమోనని అనుమానమొస్తోంది నాకు" అంటూ ముగించాడు అశోక్.

కిరణ్ అతను చెప్పిన విషయాల్ని జాగ్రత్తగా విన్నాడు. అశోక్ మాటల్లో నిజాయితీ ధ్వనించింది. అయినా, నిర్ధారణ చేసుకోవాలి కదా!

"ఊఁ! ఆ గూండా కంట్రాక్టరు పేరు, వివరాలు,

చిరునామా చెప్పాలి."

"అలాగే!" అన్నాడు అశోక్ అడ్రసు రాసిస్తూ.

కిరణ్ లేచాడు. శ్రీనివాస్ నుద్దేశించి "వెంటనే రాడీ కాంట్రాక్టర్ని స్టేషన్‌కి రప్పించి బాగా కోటా యివ్వు. అన్ని విషయాలు కక్కుతాడు" అన్నాడు.

"ఓ, అదెంత సేపు? వాడి పుట్టుపూర్వోత్తరాలు కూడా వాడి నోటిచేతనే చెప్పిస్తాను" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్, రాఘవరావు వంక తిరిగి, "మీ కేదైనా పని వుంటే, వెళ్ళండి. మీరీకేసు విషయంలో చాలా శ్రద్ధ తీసుకొని మంచి వివరాలు చెప్పారు. త్వరలోనే హంతకుల్ని పట్టి ఉరికంబం ఎక్కిస్తాను" అన్నాడు.

రాఘవరావు ఓ చిన్న కాగితంమీద తన చిరునామా రాసి యిచ్చి, "తమకు ఎప్పుడు నా అవసరంపడితే అప్పుడు కబురు పెట్టండి సార్! మీ ముందు వాలుతాను" అన్నాడు.

# 10

"వేలిముద్రల నిపుణుడు ఏమైనా ఆసక్తికరమైన విషయాలు చెప్పాడా?" అడిగాడు కిరణ్ వస్తూనే.

"ఆఁ! పీకవద్ద, గడ్డం కింద గోళ్ళరక్కులున్నాయట. హంతకుడి చేతిగోళ్ళలో హతుడి రక్తం, చర్మపు పోగులు దొరకవచ్చునని అభిప్రాయపడుతున్నాడు. బాటనవేలి ముద్రలు కూడా దొరికాయట. స్కూటర్ హేండిల్ మీద, హెడ్‌లైటు డోమ్‌మీద, మాధవరావువికాక మరో యిద్దరి వేలిముద్రలున్నాయట. బహుశా అవి కూడా హంతకుల్లో ఎవరివో కావచ్చునని చెప్పాడు" అన్నాడు ఇన్స్‌పెక్టర్ శ్రీనివాస్.

"గుడ్! కొత్తపేట, విజయవాడలనుండి యిన్ఫర్మేషన్ వచ్చిందా?"

"విజయవాడనించి మెసేజ్ వచ్చింది. పరాంకుశం మూడు రోజులుగా విజయవాడలోనే వున్నాడట. అతనికి చాలా బలమైన ఎలిబీ వుందని క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ ఫోన్ చేసి చెప్పారు" అన్నాడు.

"మరి కొత్తపేటనుంచి రాలేదా?"

"లేదు యింకా!"

"అదీ ఇలాగే వస్తుంది, అనుమానంలేదు. పరాంకుశం వామనరావు తమ చేతులకి మట్టి అంటుకోకుండా ఏర్పాటుచేసుకొని పోయారు. ఆ కంట్రాక్టరు పని జరిపిస్తాడని వాళ్ళ ప్రగాఢ విశ్వాసం! అందుకే స్ట్రాంగ్ ఎలిబీ కూడా కావాలని సృష్టించుకున్నాడు పరాంకుశం. వామనరావు కూడా అలాగే మంచి సాక్ష్యం సంపాదించుకుని సిద్ధంగా వుంటాడు. ముందుగా వాళ్ళమీదనే అనుమానం పోతుందని వాళ్ళకు తెలుసు. కంట్రాక్టరు వస్తే మన అనుమానాలు ఏమైనా వుంటే అవి కాస్తా క్లియర్ చేసేస్తాడు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ కిరణ్ వంక ఆసక్తిగా వంగి, "ఇంతకీ ఈ కేసుకి తలా తోకా అందటంలేదు నాకు. హత్యకు మోటివ్ ఏమిటో అంతుబట్టలేదు" అన్నాడు.

"మోటివ్ తర్వాత చెపుతానుగాని, హత్య చేసిన వ్యక్తులు మాధవరావుగారికి పేర్లతో సహా బాగా తెలుసు. కంట్రాక్టర్ కి యీ హత్యతో ఏమీ సంబంధం లేదు. కంట్రాక్టర్ మనుషులే హత్య చేసివుంటే మాధవరావుకి వాళ్ళెవరో తెలియకపోయి వుండేది. పేర్లు సుద్దతో రాసేవాడు కాదు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ కిరణ్ వంక ఆరాధనగా చూసి, "యస్ నువ్వు సెంట్ పర్సెంట్ కరెక్టు బ్రదర్! హంతకులు మాధవరావుగారికి బాగా తెలిసినవాళ్ళేనన్న విషయంలో అనుమానంలేదు" అన్నాడు.

ఇంతలో సార్జెంట్స్ ఓ భారీ వ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చారు. మనిషి చూడటానికి చాలా సౌమ్యంగా వున్నాడు. దేగ చూపులు, కోర మీసం, తెచ్చి పెట్టుకున్న వినయం—అతని వ్యక్తిత్వాన్ని చూపుల్తోనే అంచనావేశాడు కిరణ్.

పరాంకుశం, వామనరావు తనని కల్సుకోవటం, మాధవరావుని హత్య చేయటానికి రేటు ఫిక్సుచేసుకోవటం, తర్వాత అశోక్ అభ్యర్థనపై తను ఆ హత్యా ప్రయత్నం విరమించుకోటం అన్నీ అశోక్ చెప్పిన విధంగానే చెప్పాడు కంట్రాక్టరు.

"సో, వామనరావుని పరాంకుశాన్ని హత్యా ప్రయత్నానికి పాల్పడిన నేరంమీద నువ్వు అరెస్టు చేయవచ్చు. కానీ వాడ్ని వదిలెయ్యి" అన్నాడు కిరణ్. శ్రీనివాస్ సార్జెంటుకి సైగచేశాడు.

కంట్రాక్టరు పడేపడి దండాలుపెట్టాడు కిరణ్ కి, శ్రీనివాస్ కి.

"రేపు ఉదయం మనం పిఠాపురం వెళ్ళొద్దాం" అన్నాడు కిరణ్.

# 11

"రండి సార్! మీకింత త్వరలో నా అవసరంపడుతుందని ఊహించనేలేదు" అంటూ ఆహ్వానించాడు రాఘవరావు—కిరణ్ ని శ్రీనివాస్ ని.

"మిస్టర్ రాఘవరావ్! మీనుంచి మరో ముఖ్యమైన

యిన్ఫర్మేషన్ కావాలి."

"అడగండి సార్!"

"మీ భార్య జానకి, మీరు క్లాస్ మెట్సు కదూ!"

"అవును సార్!"

"ఆమెని ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. అవునా?"

"అవును."

"మీ ప్రేమ వివాహం మీ తల్లిదండ్రులకు గాని, వాళ్ళ తల్లిదండ్రులకిగాని కష్టం కలిగించిందా?"

"లేదు సార్! మా తల్లిదండ్రులకి యిష్టమే. ఆమెకు తండ్రిలేడు. తల్లిమాత్రం వుంది. ఆమె మొదట్లో మా వివాహానికి సుముఖత చూపించలేదుగాని, తర్వాత ఒప్పుకుంది."

"అయితే మీ వివాహం యిరుపక్షాలకు అంగీకారమే నన్నమాట! ...మీకు కొంచెం కష్టం కలిగించే విషయమైనా అడగక తప్పదు. మిసెస్ జానకిని యిదివరకు యెవరైనా ప్రేమించటం జరిగిందా? ఆమె మిమ్మల్ని ప్రేమించటంవల్ల మీకెవరైనా శత్రువులు ఏర్పడ్డారా? గుర్తుచేసుకు చెప్పండి."

రాఘవరావు రెండు నిమిషాల అనంతరం అన్నాడు.

"మీ ఊహ నిజమే సార్! నాతో క్లోజ్‌గా తిరిగే నా స్నేహితుడు దివాకర్ జానకిని ప్రేమించాడు. ఓసారి తనే బయటపడిపోయాడు. అయితే అప్పటికి నాదీ జానకిది మూగ ప్రేమ! ఒకరిమీద ఒకరికున్న ప్రేమను మనసులో దాచుకున్నామేగాని బయటపడలేదు. ఒకసారి అనుకోకుండా ఏకాంతంగా దొరికిన అవకాశంలో జానకి తన మనసు వెల్లడించింది. నేనూ నా

మనసునా మెకు తెలియచేశాను.

మేము చనువుగా తిరగటం దివాకర్ చూశాడు. తను జానకిని ప్రేమిస్తున్న విషయం నాతో చెప్పాక నే నేను దుర్బుద్ధితో జానకికి వల విసిరి వశపరచుకున్నానని నన్ను నిందించాడు. నాతో పెద్ద గొడవపెట్టుకున్నాడు. ఎంతో గాఢంగా అభిమానించుకున్న మా స్నేహితు లిద్దరం బద్ధ శత్రువులయ్యాం.

నా పెళ్ళి జరక్కుండా చాలా అడ్డంకు లు కల్పించాడు. అయినా మాధవరావుగారు మూల స్తంభంలా నిల్చుని దివాకర్ కల్పించిన అడ్డంకులను దూది పింజెల్లా ఎగరగొట్టేసి మా పెళ్ళి జరిపించారు. దివాకర్ ఎంత నీచానికి తలపడ్డాడంటే, జానకి చెడిపోయిందని మా అమ్మనాన్నలతో స్వయంగా చెప్పాడట కూడా. కాని మా వాళ్ళు నా నిర్ణయానికే విలువనిచ్చారు. పెళ్ళి జరిగిపోయింది."

ఇంతలో లోనుండి కాఫీలు తీసుకొని ఓ పద్దెనిమిది—యిరవయ్యేళ్ళ అమ్మాయి వారిముందుకొచ్చి నమస్కరిం చింది.

"ఈమె నా భార్య జానకి. వీరు ఇన్స్పెక్టర్ శ్రీనివాస్, వారు ప్రఖ్యాత డిటెక్టివ్ కిరణ్" అని పరిచయం చేశాడు రాఘవరావు.

జానకి చాలా అందగత్తె. సందేహంలేదు.

"దివాకర్ మీ పెళ్ళయ్యాక ఎప్పుడైనా తారస పడ్డాడా?"

"లేదు సార్. మా పెళ్ళయి యివాల్టికి వార మయింది. పరీక్షలు రాసేశాం కదా! మళ్ళీ కాలేజికి పోలేదు. అయితే పెళ్ళికి క్లాస్ మేట్స్ చాలా మంది

హాజరయ్యారు. దివాకర్ కి కూడా యిన్విటేషన్ పంపించాం. కాని అతను రాలేదు. అయితే మా స్నేహితుల దగ్గర మాధవరావుగారి గురించి చాలా పరుషంగా మాట్లాడాడట. ఎందుకో అర్థంకాదు" అన్నాడు రాఘవరావు.

జానకి ముందుకొచ్చి, "అసలు కారణం నే చెపుతాను సార్? ఓసారి దివాకర్ నన్ను ఒంటరిగా పట్టుకొని అల్లరి చెయ్యబోయాడు. అతనితోబాటు అబ్దుల్లా అనే మరో స్నేహితుడు కూడా వున్నాడు. ఇద్దరూ నామీద పడి బలవంతం చేయబోయారు. సమయానికి దేవుడిలా అదే దారిన వెళ్తున్న మాధవరావుగారు అడ్డుపడ్డారు. దివాకర్, అబ్దుల్లా పారిపోయారు. అప్పటికే మా ఇరువురి పెళ్ళి ముహూర్తం కూడా నిర్ణయమైపోయింది. అందుకే బహుశా దివాకర్ మాధవరావుగార్ని అందరిదగ్గర తిడుతుండేవాడనుకుంటాను" అన్నది.

కిరణ్ మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి.

"చాలా థేంక్సమ్మా! అతి ముఖ్యమైన సమాచారం ఇచ్చావు. నేనిక్కడికి వచ్చిన పని నెరవేరింది. నా ఊహ నిజమయింది. హత్యకు మోటివ్ ఒకోసారి చాలా చిన్నదే కావచ్చుగాని, అదే చాలా ముఖ్యమైనదవుతుంటుంది.... ఓ.కే. మిస్టర్ రాఘవరావు, మరొక్క ఇన్ఫర్మేషన్ కావాలి."

"అడగండి సార్!"

"దివాకర్ కి సన్నిహితమైన మిత్రుల పేర్లు కొన్ని చెప్పండి."

"రామారావు, వెంకటేశం, అబ్దుల్లా, పర్వతరావు వీళ్ళు అయిదుగురు ఒక గ్రూపు సార్. అంతా ఎక్కడికి

పోయినా కలిసేపోతుంటారు" చెప్పాడు రాఘవరావు.

"థాంక్యూ వెరీమచ్. వస్తాం, మిస్టర్ రాఘవరావ్, దివాకర్ అడ్రసు తెలుసా మీకు?"

"తెలుసు సార్! స్టూడెంట్సు యూనియన్ ప్రెసిడెంటాయె అతన్నెరగని వాళ్ళెవరు? అందునా నాకు బెస్టు ఫ్రెండు కూడాను" అంటూ రాఘవరావు దివాకర్ అడ్రసు రాసియిచ్చాడు.

గుమ్మం దిగేవరకు వారిని సాగనంపి, "అయితే సార్ దివాకర్ ...." అని అర్థోక్తిలోనే ఆగిపోయాడు రాఘవరావు.

కిరణ్ మందహాసం చేశాడు.

# 12

దివాకర్ యింటిముందాగింది జీపు.

శ్రీనివాస్, కిరణ్ ఇద్దరు సార్జెంట్సు దిగారు.

పెద్ద మేడ. చాలా అందమైన డిజైను. దివాకర్ తండ్రి సిటిలో ఓ పెద్ద హోటల్ నడుపుతున్నాడు. ఇలాంటి మేడలు ఎన్నయినా కడతాడు అనుకున్నాడు శ్రీనివాస్ కసిగా.

"ఎవరు కావాలి బాబూ?" నమ్రతగా అడిగాడు నౌఖరు కాబోలు!

"దివాకర్" అన్నాడు శ్రీనివాస్.

"కూచోండి బాబూ, పిలుస్తాను" అంటూ నౌఖరు లోపలికి వెళ్ళాడు.

ఓ అయిదు నిమిషాల తర్వాత ఓ యిరవై రెండేళ్ళ యువకుడు బయటికి వచ్చాడు.

"మీరేనా దివాకర్?" అడిగాడు శ్రీనివాస్.

"ఎస్. మీకేం కావాలి?" హుందాగా అడిగాడు.

"మీ రే!" అన్నాడు శ్రీనివాస్ వెంటనే.

"వాట్? ఏమిటి వేళాకోళం."

"వేళాకోళం కాదు మిష్టర్! మాధవరావుని హత్య చేసిన నేరానికి నిన్ను అరెస్టుచేస్తున్నాం, ఇన్స్పెక్టర్! అరెస్టు హిమ్" అన్నాడు కిరణ్.

"ఏమిటి, ఏమిటి మీరంటున్నది? మాధవరావేమిటి? హత్యేమిటి?" అరిచాడు దివాకర్.

"బుకాయించి లాభంలేదు మిష్టర్ దివాకర్! అబ్దుల్లా పర్వతరావు తమ నేరాలు ఒప్పుకున్నారు."

"అబ్దుల్లా మీకెక్కడ దొరికాడు? పర్వతరావు నాతో యిప్పటివరకు యిక్కడే వున్నాడు" అన్నాడు దివాకర్ అనాలోచితంగా.

"సో, నీ నేరం కూడా నువు ఒప్పుకున్నట్టే! అబ్దుల్లా, పర్వతరావు నిజానికి మాకు తెలీనే తెలీదు. వాళ్ళు నీకు హత్యలో సాయంచేసి వుంటారని వూహించాను. నా ఊహ నిజమయింది."

"మోసం, మోసం" అరిచాడు దివాకర్.

"ఏమిటి మోసం, ఎవరిది మోసం? దేవుడిలాంటి మాధవరావుగార్ని ముగ్గురు కలిసి అమానుషంగా చంపటం న్యాయమా? నువు ప్రేమించిన జానకిని మాధవరావు నీ బారినుంచి రక్షించాడని, ఆమెకు రాఘవ రావుతో పెళ్ళి జరిపించాడని ఆయనపై పగబట్టావు. నీకు సాయంగా అబ్దుల్లాని, పర్వతరావుని ఎన్నుకున్నావు. అవకాశం కోసం చూస్తున్నావు.

హత్య జరిగిన రోజున మాధవరావు ప్రిన్సిపాల్ రూం కొచ్చినపుడు నువు అక్కడే వున్నావు. మాధవరావు పిఠాపురం వెళుతున్నట్టు ప్రిన్సిపాల్తో చెప్పటం నువు

విన్నావు. వల పన్నావు. అబ్దుల్లా పర్వతరావులతో దారి కాశావు. రాత్రి తొమ్మిది గంటలకి పిఠాపురంనుంచి స్కూటర్ మీద తిరిగొస్తున్న మాధవరావుని ఆపి, ముగ్గురు కలిసి అతనికి ఊపిరాడకుండా పీకమీద, ముఖం మీద ఒత్తిడి తెచ్చి చంపేశారు.

అయితే చచ్చిపోతూ కూడా మాధవరావు అక్కడ పడివున్న సుద్దరాయితో మీ ముగ్గురి పేర్లు రాసేశాడు. కాని అది మీలో ఎవరో గమనించి గబగబ చెరిపేశారు. కానీ మీ పేర్లలో కొన్ని అక్షరాలు మిగిలిపోయాయి. 'వా' అన్న అక్షరం నీ పేరులో రెండో అక్షరాన్ని 'అ' అబ్దుల్లాని, 'ప' పర్వతరావుని సూచించాయి.

"అంతే కాదు, మాధవరావు స్కూటర్ మీద, అతని మెడమీద మీ వేలిముద్రలు పడ్డాయి. ఈ ఆధారాలు చాలు, మిమ్మల్ని ఉరికంబం ఎక్కించటానికి!" అన్నాడు డిటెక్టివ్ కిరణ్, దివాకర్ వంక నిప్పులు రాలుస్తున్న చూపుల్తో అసహ్యంగా చూస్తూ.

—:ఐ పో యిం ది:—

# నగ్న పురుషులు

ఎమ్.వి.వి. సత్యనారాయణ

హోటల్ నయగరా ముందు టాక్సీ ఆగింది.

టాక్సీలోంచి అతడు దిగాడు. హోల్డాల్ చేత్తో పట్టుకున్నాడు. టాక్సీని పంపేసి హోటల్‌లోకి నడిచాడు. క్రాపు సర్దుకున్నాడు.

"ఏం కావాలి సార్?" అడిగాడు కౌంటర్‌లోని మేనేజర్.

"రూం."

"మేనేజర్ చకచక రిజిష్టర్ తెరిచాడు. తాళం బోర్డులోంచి ఒక తాళంచెవి తీసి అందించాడు.

"రూం నెంబర్ డెబ్బయ్!" పైకి చదివాడు అతడు.

మేనేజర్ నవ్వి, రిజిష్టర్ అతడివైపు త్రిప్పాడు.

అతడు పేరు రాసి చిరునామా రాశాడు. ఊరు వచ్చిన వివరం రాసేచోట "ఆకాశవాణి కార్యక్రమం కోసం!" అని రాసి సంతకం చేశాడు.

వెయిటర్‌ని పిలిచాడు మేనేజర్. అడ్వాన్సు అడిగి

పుచ్చుకున్నాడు.

మూడో అంతస్తులో రూం నెంబర్ డెబ్బయ్ ముందు ఆగాడు అతడు.

తాళం తీశాక హోల్డాల్ లోపల పెట్టి వెళ్ళిపోయాడు వెయిటర్.

అతడు తాళంచెవిని బల్లమీద వుంచాడు. తలుపులు దగ్గరగా వేశాడు. బోల్టు పెట్టాడు. బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు.

బట్టలు విడిచి స్నానం చేశాడు. అద్దం ముందు నిలబడి గంటసేపు మేకప్ చేసుకున్నాడు. కాలింగ్ బజర్ నొక్కాడు. వెయిటర్ వచ్చాడు.

తలుపులు తెరిచి అతడు టిఫిన్‌కీ, కాఫీకీ ఆర్డరిచ్చాడు.

వెయిటర్ వెళ్ళిపోగానే, టెలిఫోన్ వున్న టీపాయ్‌ను సమీపించాడు. రిసీవర్ ఎత్తి 'సివిల్ కాల్' అన్నాడు.

అయిదు నిమిషాల్లో కనెక్షన్ లభించింది.

"హాలో.... రాధా హియర్!" అందొక తియ్యటి గొంతు.

అతడు పరవశంగా చూశాడు. క్రాఫు సర్దుకున్నాడు.

"రాధగారూ!" అన్నాడు అతడు.

"మీరెవరు?"

"శ్రీపతిని!"

"శ్రీపతా!"

"నాకు ఈ మధ్య కాంట్రాక్టు అందింది. మంచి పంట పండించడం ఎలా? సంభాషణకి."

"ఓహోఁ! పల్లెసీమలు కార్యక్రమానికా?"

"అవును."

"అయితే నాకు ఎందుకు ఫోన్ చేయడం?"

"మీరు పరిచయం చేస్తే నాకూ ఇష్టం!"

"మన ఇష్టాయిష్టాలేమీ వుండవు. ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ యిష్టం!"

"మీరు చెబితే కాదనరు!"

"నేనెందుకు చెబుతాను?"

"నేను ఆసక్తి చూపుతోన్నట్టు చెప్పి ఒప్పించండి!"

"మిష్టర్! మీరు ఎవరో నాకు తెలియదు! నాకూ ఆ కార్యక్రమానికీ సంబంధం లేదు. నేను రేడియోలో కేవలం అనౌన్సర్‌ను. అంతే!"

"కావచ్చును. మీ గొంతుకూ గొంతులోని మాధుర్యానికీ నేను దాసుడిని. కేవలం ఒక అభిమానిగా కోరుతున్నాను. ప్లీజ్ ...."

"మీ వాదన విడ్డూరంగా వుంది. ఆకాశవాణి సంస్థ మీకు కాంట్రాక్టు యిచ్చింది. రికార్డింగ్ చేయించుకొని ప్రసారం చేయవలసిన బాధ్యత సంస్థదే!"

"ఒప్పుకుంటాను!"

అవతల రాధ ఫోన్ పెట్టేసినట్టు 'క్లిక్'మన్నది.

వెయిటర్ టిఫిన్ తెచ్చి, బల్లమీద పెట్టాడు.

రిసీవర్‌ను క్రెడిల్ చేసి అతడు టిఫిన్ తినడం మొదలుపెట్టాడు.

ఆటో మాట్లాడుకొని ఆకాశవాణి కేంద్రంవద్ద దిగాడు శ్రీపతి.

"ఎవరు కావాలండి?" అడిగాడు వాచ్‌మాన్.

అతడికి కాంట్రాక్టు చూపించి లోపలకు నడిచాడు.

'పల్లెసీమలు' కార్యక్రమానికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అతడిని రిసీవ్ చేసుకున్నాడు.

ఇద్దరూ రికార్డింగ్ రూంలోకి నడిచారు.

"సార్! ఒక రిక్వెస్టు!" అన్నాడు అతడు.

"చెప్పండి శ్రీపతిగారూ!" తలుపు మూశాడు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్.

"నన్ను పరిచయం చేసేది ఎవరు?"

"ఏం?" అన్నాడు ఆఫీసర్ ఎవరయితే ఏం అన్నట్టు.

"రాధాదేవిగారితో పరిచయం చేయించండి!"

"ఆమె మీకు తెలుసా?"

"ఆమె గొంతు నాకు పదేళ్ళయి తెలుసు!"

"ఆమెతో పరిచయం కుదరదనుకుంటాను!"

"సారీ సర్! రాధగారు లేకపోతే నాకు ఈ పరిచయం వద్దు!"

ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్ విడ్డూరంగా చూశాడు.

"మీ నిర్ణయం అదేనా?"

"ప్లీజ్.... రేపటివరకూ వెయిట్ చేస్తాను! రాధాదేవి గారిని కార్యక్రమం కోసం ఏర్పాటు చేయించండి. రిక్వెస్టు!"

తలుపు తెరుచుకున్న చప్పుడయింది.

గుమ్మంలో రాధాదేవి.

"రాధాదేవి అంటున్నారు! మీరు శ్రీపతిగారు కాదు కదా!"

శ్రీపతి మొహం వికసించింది.

"మీరు రాధగారేనా?"

"అవును బాబూ! ఈమె కోసమే మీరు కలవరించారు" అని ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, రాధవైపు తిరిగి "అమ్మా! మీరు ఈయనను పల్లెసీమలలో పరిచయం చేయగలరా?" అన్నాడు.

రాధ మొహం ఎర్రగా అయింది.

"నేను రికార్డింగ్ చేయగలను!" అంది.

ఎగ్జిక్యూటివ్ ఆమెనీ, శ్రీపతినీ మార్చి మార్చి చూశాడు. రాధ చేతిలో కాగితం పెట్టి బయటకు కదిలాడు.

## 2

గౌరి కూనిరాగం తీస్తూ బట్టల బీరువా దగ్గర ఆగింది. బీరువాకి అమర్చిన నిలువుటద్దంలో తనని తాను చూసుకుంది. ఆడవాళ్ళలో తాను ఎత్తయిన మనిషి క్రిందే జమ!

గులాబీ రంగూ, నొక్కుల జుత్తూ, చిన్న నుదురూ, చేపల్లాంటి కళ్ళూ, సన్నగా పొడవుపాటి ముక్కూ, తడితో వుండే ఎర్రటి పెదిమలూ, కొనదేరిన గడ్డమూ అరటి మొవ్వులాంటి కంఠమూ, చిలక పచ్చరంగు షిఫాన్ చీరలో మాచ్ అయే బ్లవుజూ, పల్చటి చీరలోంచి కనిపిస్తోన్న పొట్టా, చీరకూ బ్లవుజుకూ మధ్య కొట్టొచ్చినట్టు కనిపించే నడుమూ, కాళ్ళకు ఎత్తు మడమల శాన్డూవర్ చెప్పులూ, మెడలోంచి వ్రేలాడే ముత్యాల దండా తనని చూసి చూపు తిప్పుకోలేరు.

గౌరి గర్వంగా చూసింది.

అద్దంలో దంతపు బొమ్మలాగా మెరుస్తోంది తాను. తనకు పెళ్ళయి నాలుగేళ్ళయింది. సంసార జీవితంలో తన వొంటి జిగి పెరిగిందే తప్ప తరగలేదు. తనని ప్రేమగా చూసే భర్తా, తన వెనక లక్షల ధనమూ మంచి ఆదాయం వచ్చే ఫరం....తనకింకా ఏం కావాలి?

వాత్సవ ఊళ్ళో లేడు. విశాఖపట్నం వెళ్ళాడు. ఏదో ఫరం పనిమీద వెళ్ళాడు. ఈ రాత్రికో, రేపటికో వచ్చేస్తాడు. తనను విడిచిపెట్టి అతడు ఉండలేడు. రాత్రులయితే మరీనూ.

మెయిన్ హాలులో టెలిఫోన్ గణగణలాడింది.

గౌరి కిటికీవద్దకు నడిచింది. కిటికీలోంచి మెయిన్ హాలు కనిపిస్తోంది. పనిమనిషి టెలిఫోన్ వైపు పరుగెత్తుతోంది.

రిసీవర్ ఎత్తి, "ఎవరు కావాలండీ?" అంది పనిమనిషి.

అవతల చెప్పింది విని, గౌరి వున్న గదివైపు చూసింది.

"కనెక్షన్ యివ్వు. దిగను!" అంది గౌరి.

పనిమనిషి ఆమె గదికి ఫోన్ కనెక్షన్ యిచ్చింది. గౌరి గదిలోని ఫోన్ మ్రోగింది. గౌరి రిసీవరెత్తింది.

"హలో.... గౌరిని మాట్లాడుతున్నాను."

"గౌరీ! నేను శ్రీపతిని."

"శ్రీపతా? ఎవరు?"

"నీ కాలేజీ రోజుల్లో శ్రీపతి పేరు వినలేదా?"

"ఓ శ్రీపతా? నువ్వు....పట్నంలోనే వున్నావా?"

"ఏం? వుండకూడదా?"

"అబ్బే! వుండకూడదనికాదు. చాల కాలమై పట్నం వదిలిపెట్టి వెళ్ళిపోయావు."

"అంటే నా గురించి దర్యాప్తు చేయించావన్నమాట!"

"దర్యాప్తా? ఎందుకు చేస్తాను?"

"నిన్ను ప్రేమించి విఫలమయాను కాబట్టి."

"ప్రేమ రెండు ప్రక్కలా వుండాలి."

"అంటే....?"

"నువు ప్రేమించినంతమాత్రాన ఆ ఆడదీ నిన్ను ప్రేమించాలని లేదు."

"విషయం తెలియకముందు. తెలిశాక కూడా

రోగమా?"

"అప్పటికే ఆమె మనసులో ఎవరైనా వుండివుంటే?"

"అంటే నువ్వు వాత్సవను అప్పటికే ప్రేమించావా?"

"వాత్సవ మా నాన్నగారి దృష్టిలో నాకు తగిన వరుడు. ఆయన మాట తీసెయ్యలేకపోయాను."

"తర్వాత చింతించి వుంటావు."

"ఆ ఖర్మ నాకు లేదు."

"ఏం?"

"వాత్సవతో నా జీవితం హాయిగా వుంది."

"ఒక మాట చెబుతాను వింటావా?"

"గతం గురించి చెప్పక! ఇప్పుడేం చేస్తున్నావు?"

"చెప్పనా?"

"ఊఁ!"

"ఇంకా నీ కోసం వెయిట్ చేస్తున్నాను."

గౌరి రిసీవర్‌లోకి కోపంగా చూసింది. చటుక్కున క్రెడిల్ చేసింది.

ఈ మగాళ్ళకి బుద్ధివుండదు. తనకి పెళ్ళయి నాలు గేళ్ళయింది. ఏనాడో తనని కాలేజీలో చూసి మోజు పడ్డాడు శ్రీపతి. ఇంకా తనకోసం కాచుకున్నాడట.

గౌరి టవల్‌తో సుతారంగా మొహం అద్దుకుంది. హాండ్‌బాగ్ తీసుకుంది. డబ్బు లెక్క చూసుకుంది. దగ్గరగా లాగింది తలుపులు.

నడవాలోంచి కదిలి మెట్లు దిగుతోంది.

గుమ్మంలోకి చూసి తెల్లబోయింది.

హాలు గుమ్మంలో అతడు నిలబడివున్నాడు. ఫుల్ సూట్‌లో వున్నాడు. నెత్తిమీద ఫెల్టు హాట్. చిరు గాలికి మెడలోని టై వూగుతోంది. లేత నీలిరంగు

కళ్ళద్దాలు పెట్టుకున్నాడు.

"శ్రీపతీ!" గొణిగింది గౌరి. నిర్వేరపాటును అణచుకుంటూ గుమ్మంవైపు నడిచింది.

శ్రీపతి దరహాసం చేస్తున్నాడు.

"లోపలకు రావచ్చునా!" అన్నాడు శ్రీపతి.

చేసేదిలేక గౌరి వెనక్కి తిరిగింది. శ్రీపతి ఆమె ప్రక్క నడవసాగాడు.

ఇద్దరూ గౌరి గదిలో ప్రవేశించారు.

శ్రీపతి చొరవగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు. గౌరి కార్పెట్ మీద అటూ యిటూ తిరుగుతోంది.

"తిన్నగా యింటికే వచ్చానని కోపమా?" నవ్వాడు శ్రీపతి.

గౌరి చురచుర చూసింది.

"నీ గొంతు ఫోన్‌లో విన్నాను. నిన్ను చూడకుండా వుండలేను. తప్పయిపోయింది."

"పెళ్ళయిన ఆడదాన్ని వెంటాడటం తప్పని తెలుసన్నమాట!"

"కాని మనసు కోతిలాంటిది!"

"చూశావుగదా! వెళ్ళు!"

"గౌరీ నిన్ను మనస్ఫూర్తిగా ఈ నాటికీ ప్రేమిస్తోన్నాను."

"ప్రేమించు. నాకు చెప్పక!"

"నువు అవకాశం యిస్తే పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను."

"డామ్ నాన్సెన్స్! బయటకు నడువ్."

"ప్రేమ కాదంటే, పగ రుచి చూస్తావ్!"

"బెదిరిస్తున్నావా?"

"లేదు. జరగబోయేది హెచ్చరిస్తున్నాను."

"పగ తీర్చుకో!"

"అప్పుడు వాత్సవ నీతో సంసారం చేయడు!"

"శ్రీపతీ నీకు ప్రేమతో మతి పోయింది! అట్టే వాగక!"

శ్రీపతి కుటిలంగా నవ్వాడు. కోటు జేబులో చెయ్యి పెట్టి ఓ కవరు తీశాడు. కవర్‌లోంచి ఫోటోలుతీసి ఆమెకు చూపించాడు.

గౌరి కళ్ళు చెదిరిపోయాయి. రంగుల ఫోటోలు! వాటిలో గౌరి వివిధ భంగిమలలో పండుకుని వుంది. ఆమె దుస్తులు అస్తవ్యస్తంగా చెదిరిపోయాయి. ఆమె ప్రక్కనే ముగ్గురు పురుషులు బట్టలు లేకుండా వున్నారు. ఆమె కళ్ళు మత్తుగా సోలివున్నాయి. గౌరి కేకలు పెట్టబోయి ఆగింది.

"ఏమిటివి? ఎలా తీశావు? అంతమంచి ముగాళ్ళతో... ఛీ....ఛీ....అలాంటి స్థితిలో ఎవర్నీ వూహించుకోను కూడా వూహించుకోలేను" గౌరి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

శ్రీపతి ట్రిక్ ఫోటోగ్రఫీ తీశాడు. కాని ఫోటోలు అచ్చమైన సహజ వాతావరణంలో తీసినట్టున్నాయి.

గౌరి మూగగా చూస్తోంది.

"గౌరీ! నీ గురించి నాకు తెలుసు. వాత్సవకూ తెలుసు. కాని ఈ ఫోటోలు చూస్తే వాత్సవకాదు— మీ నాన్న పరంధామయ్య కూడా నమ్మడు" ఫోటోలు కవర్‌లో పెట్టి కోటుజేబులో పెట్టుకున్నాడు శ్రీపతి.

"అవి ట్రిక్ ఫోటోలు! నేను నీకేం అపకారం చేశాను?"

"నా ప్రేమను తిరస్కరించావు!"

"ప్రేమ కుండవలసిన లక్షణం పగ సాధించడం కాదు!"

"నువు నాకు పాఠాలు చెప్పక!" శ్రీపతి చేతిలో పిస్తోలు మెరిసింది.

గౌరి విస్తుబోయింది.

"ఏమిటిది? నన్ను కాల్చి చంపుతావా?"

శ్రీపతి నవ్వి పిస్తోలు ఆమెకు అందించాడు.

"నాతో వచ్చెయ్యి! లేకపోతే నన్ను కాల్చెయ్యి! నీ అందమైన చేతులలో హాయిగా మరణిస్తాను!"

గౌరి తన చేతులలో మొహం కప్పుకున్నది.

"నువు నన్ను చంపలేకపోతే నేను ఈ ఫొటోలు వాత్సవకి అందించవలసి వస్తుంది!"

గౌరి ఏడుస్తోంది.

"ఫొటోలు చూపించక! ఎలాంటి నమ్మకస్తుడయినా ఈ నకిలీ ఫొటోలుతో మనసు విరచుకుంటాడు!"

"అందుకే నన్ను కాల్చి చంపెయ్!"

"ప్లీజ్! మరల నన్ను అలా కోరక!"

"అయితే మూడో పద్ధతి నువ్వు ఆలోచించు."

"నాకు తెలుయదు!"

"తొందరలేదు. మరల సాయంకాలం కలుసు కుందాం!"

"శ్రీపతి! నన్ను క్షమించి వదిలిపెట్టు! ప్లీజ్...."

"వదలను. పోనీ ఒక పని చెయ్యి!" పిస్తోలు అటూ యిటూ ఆడించాడు.

"ఏం చేయను?"

"రఘును చంపెయ్."

గౌరి పిడుగుపడినట్టు చూసింది.

"రఘునా? ఎందుకు?"

"నిన్ను రేప్ చేయాలని ప్రయత్నించినందుకు!"

"నీకు ఇంకా ఆ విషయం గుర్తుందా? నాలుగేళ్ళ నాటి మాట!"

"నువ్వు నన్ను ప్రేమించు. మాను. రఘును మాత్రం చంపు!"

"నామీద అతడు అఘాయిత్యం చేశాడు. అందుకు అప్పట్లో శిక్ష అనుభవించాడు."

"న్యాయమైన శిక్ష కాదు! మీ నాన్న కొరడా పెట్టి కొట్టాడు. అదేనా శిక్ష?"

"అతడు నా కాళ్ళమీద పడ్డాడు. క్షమాపణ కోరాడు. చాలు!"

"కాని నీ ప్రేమికుడిగా అది చాలదు నాకు!"

"శ్రీపతీ! పగ మర్చిపోవాలి. అప్పుడే జీవితాలు సుఖమయం!"

"నువు రఘు జీవిత విషయం ఆలోచించక! వాడికి చావే తగిన శిక్ష!"

"రఘూ నువ్వూ ఏం చేస్తారో చేసుకుంటారో నాకు అనవసరం!"

"నువు రఘును చంపకపోతే నేను ఈ ఫోటోలు వాత్సవికీ, పత్రికలకూ పంపించవలసి వస్తుంది!"

గౌరి తల బాదుకుంటోంది. "నీకు దయ లేదు!"

"అవును" శ్రీపతి వికటంగా నవ్వాడు.

"నన్ను నేను కాల్చుకు చచ్చిపోతాను."

"అప్పుడు కూడా ఈ ఫోటోలు అందవలసిన వాళ్ళకి

అందుతాయి. వాళ్ళకు నీ ఆత్మహత్యకి కారణం తెలుస్తుంది!"

గౌరి ఆలోచనలో పడింది.

శ్రీపతి పిస్తోలు తెరిచాడు. బుల్లెట్స్ ఫిట్ చేయసాగాడు.

# 3

"వెయిటర్!" పిలిచాడు రఘు.

వెయిటర్ వచ్చాడు.

"విస్కీ, కట్‌లెట్స్, డబుల్ ఆమ్లెట్స్ చెప్పు!" అన్నాడు శ్రీపతి సిగరెట్టు ముట్టించి.

విన్నావు కదా అన్నట్టు రఘు తలూపాడు. వెయిటర్ వెళ్ళిపోయాడు.

"ఇపుడు చెప్పు! నన్ను ఎందుకు కలుసుకోవాలనుకున్నావు?" అడిగాడు రఘు.

"నీతో పని పడింది."

వెయిటర్ విస్కీ సీసా, కట్‌లెట్స్, ఆమ్లెట్స్ సర్వ్ చేశాడు. గ్లాసులు సర్దాడు. రఘు సీసా తెరచి ద్రవం గ్లాసులలో ఒంపాడు.

ఇద్దరూ ఛీర్స్ చెప్పుకుని తాగడం మొదలుపెట్టారు.

"ఏమిటా పని?" అడిగాడు రఘు.

"నువు పరంధామయ్యను చంపాలి!"

"ముసలాడు వాడిగోల నీకెందుకు?"

ఇద్దరూ పదార్థాలమీద దాడి ప్రారంభించారు.

"వాడు నిన్ను హంటర్‌తో కొట్టాడు!"

"శ్రీపతీ! అది నాలుగేళ్ళనాటి మాట!"

"ఈ నాలుగేళ్ళూ పూరుకోవడం నీ పొరపాటు! నీకు పౌరుషంలేదు."

"నా న్సెన్స్.... శ్రీపతీ! నీకు ఈ రోజు ఏమయిందీ?"

"నీమీద పరంధామయ్య కసితీర్చుకున్నాడు."

"మంచిదే అయింది!"

"ఏమిటా మంచి?" శ్రీపతి గ్లాసులు నింపాడు.

"నేను గౌరిని ప్రేమించాను. ఆమెమీద అఘాయిత్యం చేశాను. ఆమె తిరస్కరించింది. అప్పుడే నేను బుద్ధి తెచ్చుకోవలసింది. ఆమె తండ్రి నన్ను కొరడాతో చితకబాదాడు. లేకపోతే...."

"రఘూ నువ్వేనా ఈ మాటలంటోంది!"

"అవును. లేకపోతే నేను రేపిస్టుగా మిగిలపోయేవాడిని."

"కాదు పరంధామయ్యను అప్పట్లో చంపివుండవలసింది. గౌరి నీ సొంతమయేది."

"గౌరిని ప్రేమతో జయించాలి. అంతే కాని, ఆమె తండ్రిని చంపికాదు."

"నీకు యింకా గౌరిమీద ప్రేమ చావలేదు."

"శ్రీపతీ! గౌరి తన భర్తతో సంసారం చేసుకుంటోంది. ఆమె ప్రేమ అతడికే పరిమితం! నేనూ ప్రేమిస్తాను ఆమెను. కాని ఒక ప్రేమకురాలిగా కాదు. ఒక మంచి గృహిణిగా."

ఇద్దరూ గ్లాసులు ఖాళీచేశారు. పదార్థాలు ఖాళీ అయాయి. వెయిటర్ మరల ఆమ్లెటు తెచ్చిపెట్టాడు. రఘు మత్తుగా చూశాడు.

శ్రీపతి కోటుజేబులోంచి కవర్ తీశాడు. రఘుకు ఫోటోలు అందించాడు.

రఘు ఫోటోలు చూశాడు. మత్తు దిగిపోయింది.

"శ్రీపతీ! నీకు సిగ్గులేదూ!" అరిచాడు రఘు.

"అరవక. గౌరి పరువు బజారున పడుతుంది."

"నీకు గౌరి ఏం అపకారం చేసింది?"

"అదంతా నీకు అనవసరం!"

"నిన్ను చంపుతాను శ్రీపతీ! పరంధామయ్యను కాదు!"

"నన్ను చంపు! ఆ తర్వాత ఈ ఫోటోల నెగటివ్స్ పోలీసులకు అందుతాయి."

"అందితే?"

"పిచ్చివాడా? గౌరి ప్రక్క నగ్న పురుషులలో నువ్వూ వున్నావు."

"ఆఁ!"

"సరిగ్గా చూడు. నగ్నంగా ఉండటంమూలాన నిన్ను నువే గుర్తుపట్టలేకపోయావు."

"శ్రీపతీ!"

శ్రీపతి పకపక నవ్వి, "మత్తు దిగిపోయిందా?" అన్నాడు.

"అవును. దిగింది!"

"పద! నా రూంకి వెళ్ళి మాట్లాడుకుందాం!"

రఘు కదిలాడు. బిల్లు చెల్లించి టాక్సీలో బయలు దేరారు. నేతాజీ వీధిలో 201 నెంబర్ యింటి ముందు టాక్సీ ఆగింది.

ఇద్దరూ రఘు గదిలో కూర్చున్నారు.

"నువు పరంధామయ్యను చంపు. నీ కసి తీర్చుకో."

"లేకపోతే?" అడిగాడు రఘు.

"ఈ ఫోటోలు వాత్సవకూ, పత్రికలకూ, పోలీసులకూ అందుతాయి. గౌరి సంసారం బజారుపాలవు తుంది."

"తండ్రి చచ్చిపోతే గౌరి ఏడుస్తుంది!"

"ఈ వయసులో ఆమెకు కావలసింది వాత్సల్యం."

"పరంధామయ్య మీద నీకు కోపం దేనికి?"

"నిన్ను కొరడాతో కొట్టాడు. అందుకే!"

"అబద్ధం చెబుతున్నావు!"

శ్రీపతి కత్తి తీశాడు. "ఈ కత్తితో నన్ను చంపెయ్."

"నిన్నా? చంపను?"

"అయితే పరంధామయ్యను చంపు."

## 4

బల్లమీద టెలిఫోన్ గణగణలాడింది.

శ్రీపతి సిగరెట్టును యాష్ట్రేలో కుక్కాడు. ఫోన్ అందుకున్నాడు.

అవతల గౌరి మాట్లాడుతోంది.

"శ్రీపతీ! నువ్వు నన్ను ఇరకాటంలో పడేశావు."

"లేదు గౌరీ! నువ్వు రైఫిల్ షూటింగ్ ట్రయినింగ్ అయ్యావు. నీ శిక్షణకో సార్ధకత లభించబోతోంది!"

"పాపం రఘు!"

"దుర్మార్గులు ఈ ప్రపంచంలో బతకగూడదు."

"శిక్షించడానికి మనం ఎవరము?"

"బాధలను అనుభవించినవాళ్ళకు శిక్షించే హక్కు వుంది!"

"......... ....."

"గౌరీ! దుర్మార్గుడు ఒక్కరికే అపకారంచేసి వూరుకోడు."

"ఆల్‌రైట్! రఘును షూట్ చేస్తాను."

"బుద్ధిమంతురాలివి!"

"కాని నాదో అనుమానం!"

"ఏమిటిది?"

"నేను రఘుని షూట్ చేసేటప్పుడు నువు ఫోటోలు తీస్తావు. అసభ్య చిత్రాలూ, వాటి నెగెటివ్స్ ఇస్తావు. కాని ఈ తాజా ఫోటోలతో మరల నన్ను కీలుబొమ్మను చేసుకుంటావు."

"గౌరీ! నువు నన్ను అనుమానిస్తోన్నావా?"

"ఏం అనుమానించ కూడదా!"

"గౌరీ! నువ్వే నా ప్రాణం!"

"గౌరి నీవు వూహించినంత వెర్రిబాగులది కాదు!"

"దటీజ్ నైస్!"

"రఘు దినచర్య ఏమిటి?"

"ఈ రోజు రాత్రి 9-45కి అతడు రూంకి వస్తాడు. అతడిని అతడి గదిలో వుండగానే షూట్ చేయాలి. రాత్రి 10 గంటలు లోపున కర్మకాండ ముగిసిపోవాలి."

"అడ్రసు చెప్పు!"

"201, నేతాజీ వీథి."

"ఇల్లు సులువుగా దొరుకుతుందా?"

"అవును. సరిగ్గా ఎలక్ట్రిసిటీ ఆఫీసు వెనక వీధిలో."

"రైట్!"

"నాకు 10-30కి ఫోన్ చేయి!"

"పని ముగించినట్టు చేస్తాను!"

శ్రీపతి రిసీవర్ ముద్దు పెట్టుకున్నాడు. క్రెడిల్ చేశాడు. టెలిఫోన్ మరల గణగణలాడింది.

"రఘు!" గొణిగాడు శ్రీపతి రిసీవరందుకుంటూ.

"ఎస్" అన్నాడు శ్రీపతి!

"రఘూ స్పీకింగ్."

"చెప్పు. నేను శ్రీపతిని!"

"నాకు పని ఒప్పచెప్పావు. పని చేయడం తప్పదా?"

"నీ ప్రియురాలు సుఖపడాలంటే!"

"శ్రీపతీ! నువు నన్ను గొప్ప సంకటంలో పెట్టావు!"

"ప్రేమంటే అంతేరా పిచ్చివాడా!"

"నేను గౌరికి ప్రాణం పెడతానని నీకు తెలియడం ప్రమాదమయింది!"

శ్రీపతి నవ్వి, "రాత్రి 9 గంటలకు అతడు యింటికి వస్తాడు. ఇంట్లోనే పని ముగించు!" అన్నాడు.

"ఆల్ రైట్! తొమ్మిది గంటలకు పరంధామయ్య బతికి వుండడు. నీకు తొమ్మిదీ ముప్ఫయికి ఫోన్ చేస్తాను."

"గుడ్ బాయ్!"

"శ్రీపతీ! మరల దీంట్లో కూడా డబుల్ క్రాస్ చేశావంటే తర్వాత వొంతు నీది!"

"తప్పకుండా! నేను ముందే నీకు ఆఫర్ యిచ్చాను!"

అవతల క్లిక్ మన్నది. శ్రీపతి పకపక నవ్వుకున్నాడు.

"ఈ రాత్రి కాళ రాత్రి!" పకపక నవ్వాడు.

శ్రీపతి గదికి తాళం పెట్టి బయటకు నడిచాడు. మోటారుసైకిలు ఎక్కాడు. విల్లు విడిచిన బాణంలాగా వాహనం దూకింది.

పరంధామయ్య యింటిముందు వాహనం ఆపాడు.

పరంధామయ్య సిటింగ్ రూంలో కూర్చున్నాడు.

శ్రీపతిని నవ్వుతూ చూశాడు.

"చాల కాలమయింది శ్రీపతీ! మనం ఆటవేసి!" అన్నాడు పరంధామయ్య.

శ్రీపతి కుర్చీలో కూలబడి, "బల్లా, పావులూ తీయండి మామయ్యా!" అన్నాడు.

పరంధామయ్య చదరంగం బల్ల తీసి పావులు దానిమీద ఒంపాడు. తెల్ల పావులూ నల్ల పావులూ.

శ్రీపతి తెల్ల పావులు తనవైపు సర్దుకున్నాడు.

ఆట రంజాగా సాగుతోంది. గంటన్నర గడిచింది.

పరంధామయ్య బలగం ఒక్కొక్కటీ బుట్టలోకి వెళ్తోంది.

"చెక్!" అన్నాడు శ్రీపతి.

పరంధామయ్య కలవరపడ్డాడు.

మరో రెండు ఎత్తులు వేసే అవకాశం వుంటే తన శకటం బతుకుతుంది. తన రాజుకు అతడి గుర్రమూ, ఏనుగూ వలవేశాయి. తాను అతడి బంటును కొట్టాలి. బంటును కొడితే రాజు బలవుతాడు.

ఇరకాటం!

తెల్ల బంటు చచ్చాడు. నల్ల రాజు పడిపోయాడు.

"భలే ఆట!" మెచ్చుకున్నాడు పరంధామయ్య.

గుమ్మంలో అలికిడయింది. గౌరి తెల్లబోయి ఇద్దరినీ చూస్తోంది.

"రా తల్లీ! నిలబడిపోయావేం?" ఆదరంగా లేచాడు పరంధామయ్య.

గౌరి రాతిబొమ్మలాగా చూస్తోంది. శ్రీపతి అమాయకంగా పావులు సర్దుతున్నాడు.

గౌరి వెనక్కు పరుగెత్తింది.

పరంధామయ్య ఆమెను పిలిచేలోపున కారు డ్రయివ్ చేసుకుంటూ వెళ్ళిపోయింది.

"అదేమిటి? గౌరి ఎందుకు పారిపోయింది?" తనలో తానే మాట్లాడుకున్నాడు పరంధామయ్య.

"ఈమేనా మీ అమ్మాయి!"

"అవును శ్రీపతీ!"

"ఇదే చూడటం ఈమెను!"

"నీకు పరిచయం చేయాలనుకున్నాను!"

"అక్కరలేదు మామయ్యా! ఈమెను యింతకుముందే కొన్ని ఫోటోలలో చూశాను."

"ఆమె పెళ్ళి ఫోటోలేమో! వాత్సవ తెలుసుగదా నీకు!"

"తెలియదు. ఆమె పెళ్ళిఫోటోలు నేను చూడలేదు."

"అయితే ఎక్కడ చూశావు?"

"శేషగిరి చూపించాడు."

పరంధామయ్య నుదురు చిట్లించాడు.

"శేషగిరి నీకు తెలుసా?"

"బార్ నడుపుతాడూ—ఆ శేషగిరేనా?"

"అవును."

"నాకు అమ్మాయి కావాలన్నాను. ఫోటోలు చూపించాడు."

"బ్రోకర్ వెధవ! నన్ను మోసంచేసింది చాలదూ!"

"మోసమా?"

"ఇద్దరమూ కలసి బార్ పెట్టాం. మూడేళ్ళు బ్రహ్మాండంగా నడిచింది. అటు తర్వాత నష్టాలు చూపించాడు. ఎక్కడెక్కడో సంతకాలు పెట్టించాడు. చివరకు బార్ అతడి పరమయింది."

"నమ్మకద్రోహం!"

"ఈ రోజుల్లో ఎవరినీ నమ్మకూడదు!"

"నాకులాగా దురలావాట్లు బయటపెట్టుకునేవాడిని తప్పా?"

"ఆ వెధవకు గారి ఫోటో ఎలా వచ్చింది?"

"అతడి వ్యాపార రహస్యం ఎలా చెబుతాడు?"

"ఫోటో వుందా నీ దగ్గర?"

శ్రీపతి సంశయంగా చూశాడు. "వుందికాని పెద్ద వారు...."

"వాడు నా పెద్దరికం ఏమైనా వుంచాడా? ఫరవా లేదు."

ఇక తప్పదన్నట్టుగా శ్రీపతి కవర్‌లోంచి ఫోటో తీశాడు. కలర్ ఫోటో. గౌరి అస్తవ్యస్తంగా వున్న దుస్తులతో పండుకుంది. ఆమె ప్రక్క నగ్న పురుషులు!

పరంధామయ్య వెర్రెత్తిపోయాడు.

"రాస్కెల్! వాడిని చంపుతాను" అరిచాడు.

"నాకే చంపాలనిపిస్తోంది. కన్న తండ్రి మీకు ఎలా ఉంటుందో...."

"నేనే చంపాలి! నా చేతులతో...."

"మామయ్యా! కంగారు పడకండి! మీ చేతులకు మట్టి అంటుకోకూడదు."

పరంధామయ్య పళ్ళు పటపట నూరాడు.

"ఎలా చంపాలి?"

"మీరు అతడిని ఐదు గంటలకు బార్‌లో వున్నట్లు నిర్ధారించుకోనండి."

"బార్‌లోనా? అంత బహిరంగంగానా?"

"కాదు. అతడు బార్‌లో వుంటే మీరు అక్కడికే వెళ్ళండి!"

శ్రీపతి వివరించి చెప్పసాగాడు.

"ఈ పద్ధతి మీకు పూర్తిగా అంగీకారమయితేనే."

"అంగీకారమే. కాని ఇంట్లో అందరూ నన్ను చూస్తారు."

"అతడి యింట్లో అతడి వాళ్లు ఈ రోజు బయటకు వెళ్ళారు."

"ఎక్కడికి వెళ్ళారు?"

"బంధువుల యింట్లో ఏదో శుభకార్యం వున్నది!"

"వెరీగుడ్! నువ్వు మంచి సమాచారం సేకరించావు."

"మామయ్యా! అవమానం మీకయినా నాకయినా ఒక్కటే!"

"కాని....అతడిని చంపడానికి మార్గం?"

"కత్తులూ, పిస్తోళ్ళూ వద్దు. నా దగ్గరో యంత్రం వుంది!"

"ఏమిటీ మనుషులను చంపే యంత్రమా?"

"అవును. విపరీతమైన శబ్దాలను పుట్టిస్తుంది. మెదడులోని నరాలు చిట్లి హేమరేజ్ తో చస్తాడు ఆ శబ్దాలు వింటే!"

"చావకపోతే?"

"విషం పనిచేయకపోవచ్చు. కత్తి వంకరపోవచ్చు. పిస్తోలు గురి తప్పవచ్చు. యంత్రం చంపితీరుతుంది!"

"యంత్రాన్ని అతిడి గదిలో ఫిక్స్ చేసి వస్తే చాలునా?"

"అవును. శేషగిరి ఆ గదిని సౌండ్ ప్రూఫ్ చేసుకున్నాడు. గుమ్మం ప్రక్కనే గదిలో టేబులు వుంటుంది. శేషగిరి తన గదిలో టేబులు లైటునే వెలిగిస్తాడు. టేబులు లైటు అమరిక టేబులులో వుంటుంది. ఎలక్ట్రిసిటీని తాత్కాలికంగా ఆపి...." శ్రీపతి అభినయంతో వివరించి చెబుతోన్నాడు.

పరంధామయ్య సస్పెన్స్ చిత్రం చూసినట్టు ముందుకి వాలి చెవులూ కళ్ళూ అతడికి ఒప్పగించేశాడు.

# 5

నాలుగు రోడ్ల కూడాలి.

గడియార స్తంభం ఏడుగంటలు కొట్టింది. రోడ్లమీద దీపాలు దేదీప్యమానంగా వెలుగుతోన్నాయి. జనం పల్చబడ్డారు. వాహనాలు అటూ యిటూ తిరుగుతోన్నాయి.

పరంధామయ్య రోడ్డుమీద ఆగాడు. గడియార స్తంభం నీడలోకి నడిచాడు. రోడ్డుకి అవతల బార్ కలకలలాడుతోంది.

శేషగిరి కౌంటర్‌లో కూర్చున్నాడు.

పరంధామయ్య కీనీడలో తనని తాను ఒకసారి చూసుకున్నాడు.

లూజ్ పైజామా మీద మోకాళ్ళు దాటిన లూజ్ షర్టూ, పల్చగా పెరిగిన ముసలి గడ్డమూ, సున్నగా గీసిన మీసమూ, కాళ్ళకు చడావులూ, నెత్తిమీద నల్ల టోపీ, తృప్తికరంగా వుంది మారువేషం.

పరంధామయ్య రోడ్డు దాటాడు. బార్‌లో ప్రవేశించి శేషగిరి ముందు నిలబడ్డాడు.

గొంతు సవరించుకొని, "మీతో ఒక్క అయిదు నిమిషాలు!" అన్నాడు హిందీ యాసతో.

శేషగిరి ఆశ్చర్యంగా చూసి, "బిజినెస్సా?" అన్నాడు.

"అమ్మాయిలు! దిగుమతి!"

శేషగిరి దిగ్గున లేచాడు. "రండి! లోపల కూర్చుందాం!" అన్నాడు. కౌంటర్ వెనుక చిన్న గదిలోకి నడిచారు యిద్దరూ.

శేషగిరి బాటిలు అందుకొని బల్లమీద పెట్టాడు.

బల్లకి అటూ యిటూ యిద్దరు కూర్చున్నారు. శేషగిరి బాటిలు విప్పాడు.

రెండు గ్లాసులలో ద్రవాన్ని నింపాడు.

"ఐస్ క్యూబ్స్!" అన్నాడు పరంధామయ్య.

శేషగిరి బయటకు నడిచాడు.

పరంధామయ్య ఒక గ్లాసులో మాత్ర వేశాడు. రిలాక్సింగ్ గా వెనక్కి వాలాడు.

ఐస్ క్యూబ్స్ తో శేషగిరి వచ్చాడు. గ్లాసులలో వేశాడు.

ఇద్దరూ తాగారు.

శేషగిరి కుర్చీలో ముందుకు వాలాడు. బల్లమీద తల పెట్టాడు. మరుక్షణంలో గురక పెట్టి నిద్రపోతోన్నాడు.

పరంధామయ్య లేచాడు. శేషగిరి జేబులోంచి తాళం చెవులగుత్తి తీశాడు. జేబులోంచి మైనపు పలక తీశాడు.

ఇంటి తాళం గుర్తుపట్టాడు. తాళంచెవుల అచ్చులు పలకమీద తీశాడు. యథాప్రకారంగా తాళంచెవుల గుత్తిని శేషగిరి చేతులో వుంచి బార్ లోంచి బయట పడ్డాడు. అచ్చు ప్రకారంగా అరగంటలో తాళంచెవులు కట్ చేయించాడు.

టాక్సీలో శేషగిరి యింటివద్ద దిగాడు.

ఇంటికి తాళం పెట్టివుంది. పరంధామయ్య తాళం తెరిచాడు. శేషగిరి ఉపయోగించే గదిలోకి నడిచాడు. జేబులోంచి చిన్న ట్రాన్సిస్టర్ లాంటి పరికరం తీశాడు.

గదిలో లైటు వెలిగించాడు.

టేబులు వద్ద ఆగి పరికరాన్ని దాని మీద వుంచాడు.

వీధిలో కారు ఆగిన చప్పుడయింది.

పరంధామయ్యకు గుండెలు దడదడ లాడాయి.

వరండాలోకి పరుగెత్తి చూశాడు.

శ్రీపతి! కారులోంచి తల బయటపెట్టి చూస్తున్నాడు.

"వ్రేలిముద్రల విషయం జాగ్రత్త!" అన్నాడు శ్రీపతి.

పరంధామయ్య తలూపి లోపలకు నడిచాడు.

కారు బయలుదేరిన శబ్దం వింటూ నిట్టూర్చాడు.

# 6

కత్తిని కాగితానికి చుట్టి పాంటులోకి దోపాడు రఘు. వాచీ చూసుకున్నాడు. రాత్రి 8-45 అయింది. గదికి తాళంపెట్టాడు.

ఆటోమొబైలు షాపులోకి నడిచాడు.

షాపు అతడు రఘును పలకరించాడు.

"తాళంచెవులియ్యి. స్కూటర్ వేసుకు వెళ్ళాలి!" అన్నాడు రఘు.

షాపు అతడు తాళంచెవులు యిచ్చాడు.

రఘు స్కూటర్ పోనిచ్చాడు.

పరంధామయ్య యింట్లో దీపాలు వెలుగుతోన్నాయి.

రఘు స్కూటర్‌ను రోడ్డు ప్రక్క పార్కు చేసి ఇంటివైపు నడిచాడు.

పరంధామయ్య ఈజీఛెయిర్‌లో కూర్చున్నాడు.

ప్రహారీ గోడవద్ద ఆగాడు రఘు. వరండాలో దీపం వెలుగుతోంది. వెలుగు వాకిట్లో పడుతోంది. పరంధామయ్యను సమీపించాలంటే వెలుగులోంచి నడవాలి. ఇంట్లో వంటవాడూ, పనిమనిషీ ఉంటారు. వాళ్ళు ఉన్నారో వెళ్ళిపోయారో.

రాత్రిళ్ళు పరంధామయ్య ఒంటరిగా వుంటాడు.

రఘు ప్రహరీ గోడమీద చేతులాన్చి అవతలకు గెంతాడు.

మొక్కల చాటున ఆగాడు. వ రం డా లో పరంధామయ్య తల వొంచుకొని, మొహం అరచేతులతో కప్పుకున్నాడు.

రఘు ఒక్క పరుగున వరండాలోకి పరుగెత్తాడు. ఒక్క ఉదటున కత్తిలాగి పట్టుకున్నాడు. పరంధామయ్య ఉలిక్కిపడ్డాడు తలెత్తబోయాడు.

రఘు అతడిమీదకు దూకాడు.

పరంధామయ్య గింజుకోబోయాడు. అప్పటికే ఆలస్యమయింది.

## 7

గౌరి బల్లసొరుగు తెరచింది. నల్లటి పిస్తోలు నిగనిగలాడుతోంది. గౌరి పిస్తోలు అందుకుంది. హాండ్ బాగ్ లో సర్ది బాగ్ భుజానికి తగిలించుకుంది. వాచీ చూసుకుంది. 9-30 అయింది.

శ్రీపతి ఫోన్ చేసింది. అవతల రెస్పాన్స్ లేదు.

గౌరి కారులో బయలుదేరింది. రోడ్లన్నీ జనంతో రద్దీగా వున్నాయి. మొదటి ఆట సినిమా వదిలిపెట్టినట్టున్నారు.

కారు నేతాజీ వీధిలో పరుగెత్తుతోంది. ఎలక్ట్రిసిటీ ఆఫీసు వెనక రోడ్డుమీద ఆగింది కారు. వెలుగు ఉండగానే తాను నెం. 201 యిల్లు గుర్తుపట్టుకోవడం మంచిదయింది. రోడ్డుమీద దీపాల కాంతిలో ఇండ్ల నెంబర్లు కనిపించాయ్.

ఇంటి నెం. 201 నిశ్శబ్దంగా వుంది. కిటికీలోంచి జీరోబల్బ్ వెలుగు కనిపిస్తోంది. కారు ముందుకు పోనిచ్చి ప్రక్క సందులో ఆపింది గౌరి. కారు దిగింది. హాండ్

బాగ్ భుజానికి తగిలించుకొని ఇంటి నెం. 201 వైపు నడిచింది.

దూరంనుండి స్కూటర్ వస్తోన్న చప్పుడయింది.

గౌరి చప్పున డస్టుబిన్ చాటున దాక్కుంది.

స్కూటర్ నెం. 201 యింటిముందు ఆగింది.

రఘు హుషారుగా స్కూటర్ దిగాడు. ఇంటి మెట్లు ఎక్కాడు.

తాళంచెవులు ఆడించి తలుపు తెరిచాడు.

తలుపు దగ్గరగావేసి లైటు వేశాడు. కిటికీలోంచి వెలుగు పడుతోంది. గౌరి పిస్తోలు బయటికి తీసింది. సేఫ్టీ కాచ్ తప్పించింది. తలుపులు సమీపించి బయట గొళ్ళెం పెట్టింది.

"ఎవరు?" అడిగాడు రఘు.

కిటికీలో నీడపడింది. గౌరి అదిరే గుండెలను అదుపులో పెట్టుకుంది.

కిటికీవైపు చూసి పిస్తోలు పేల్చింది.

రఘు అరిచాడు. గౌరి మరల పేల్చింది.

రఘు తలుపులు తెరవడానికి ప్రయత్నించాడు. గౌరి గుండెలలో రాయి పడింది. బుల్లెట్లు రఘుకు తగలలేదు. గౌరి రోడ్డుమీదకు పరుగెత్తింది. కాళ్లకు చీర అడ్డుపడు తోంది. చీర ఎత్తిపట్టి పరుగెత్తి కారులో కూర్చుంది. మరుక్షణంలో కారు రోడ్డుమీదకు దూకింది.

ఇంటి నెం. 201 తలుపులు తెరచుకోవడం తెలు స్తోంది. రఘు ఇంటి వెనకనుండి తిరిగివచ్చి తలుపులు తెరచివుంటాడు.

గౌరి వెనక్కి చూడదల్చుకోలేదు.

రఘు రోడ్డుమీదకు వచ్చాడు. కారు రోడ్డు మలుపు తిరుగుతోంది. స్కూటర్ స్టార్టు చేశాడు. ఇంటికి తాళం పెట్టాలని కూడా అతడికి తోచలేదు. స్కూటర్ పరుగెత్తుతోంది.

ఎర్రటి లైట్లు చీకట్లో మెరుస్తున్నాయి.

కారు అకస్మాత్తుగా మలుపు తిరిగింది. రఘు కళ్ళు చించుకు చూశాడు. గడియారస్తంభంవద్ద రోడ్డు నాలుగు దిశలుగా చీలిపోయింది.

కారు ఏ రోడ్డున వెళ్ళిందో అయోమయమైపోయింది.

రఘు పళ్ళు పటపట కొరికాడు. తనను శ్రీపతే పరంధామయ్య హత్య కోసం నియోగించాడు. తిరిగి తనను కాల్చి చంపమని ఎవరినో నియోగించాడు. లేక తనే కాల్చి చంపాలని ప్రయత్నించాడా?

శ్రీపతి మానసికంగా దెబ్బ తినలేదు కదా! తాను అతడి మాటలు నమ్మి పరంధామయ్యను చంపేశాడు. కత్తిమీద తను వ్రేలిముద్రలు చెరిపేశాడు. అదృష్టం! తను చంపినట్లు శ్రీపతి కూడా ఋజువు చేయలేడు.

'రాస్కెల్!' తిట్టుకున్నాడు రఘు.

శ్రీపతి ఇంటిముందు స్కూటర్ ఆపాడు. రఘు స్కూటర్ దిగాడు.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. తలుపులకు తాళం పెట్టి వుంది. రఘు తన స్కూటర్‌ను చీకట్లోకి నడిపాడు. ఇంటిముందు నిఘావుంచి కూర్చున్నాడు.

శ్రీపతి తన కళ్ళు కప్పలేడు. ఇప్పటికే తానో హత్య చేశాడు. శ్రీపతిగాడిని చంపాలి.

రఘు పళ్ళు పటపట నూరసాగాడు.

# 8

శేషగిరి ఉలిక్కిపడి నిద్రలేచాడు. బార్ నిశ్శబ్దంగా వుంది. శేషగిరి వాచీ చూసుకున్నాడు. రాత్రి పదిగంట లయింది. జరిగింది గుర్తుకు తెచ్చుకోవడం మొదలు పెట్టాడు.

ఏడు గంటలు దాటాక ఎవరో పఠాన్‌లాగా వున్న వ్యక్తి వచ్చాడు. తిన్నగా కౌంటర్ ముందు నిలబడి 'అమ్మాయిలు! దిగుమతి!' అన్నాడు. తాను అతడిని ఈ గదికి తీసుకు వచ్చాడు. ఐస్‌క్యూబ్ కోసం తాను వెళ్ళినప్పుడు పఠాన్ గ్లాసులోని ద్రవంలో ఏదో మత్తుమందు కలిపాడు. తనవలన అతడికి ఏం కావాలి?

ఎవరతను? తాను మత్తులో పడ్డాక అతడు వెళ్ళిపోయాడా?

శేషగిరి గదిలోంచి బయటపడ్డాడు.

వర్కర్స్ తనని అయోమయంగా చూస్తోన్నారు.

వాళ్లలో ఒకడు కౌంటర్‌లో కూర్చున్నాడు. శేషగిరికి సిగ్గుగా తోచింది. తాను ఎవరో అపరిచితుడివద్ద మోసపోయాడు.

బార్ మూయించి శేషగిరి ఇంటికి బయలుదేరాడు. శేషగిరి భార్యాపిల్లలూ బంధువుల ఇంటినుండి అప్పటికే తిరిగివచ్చారు.

"మీరు రాలేదని మీ చిన్నత్తగారు చాలా బాధపడింది!" అంది శేషగిరి భార్య.

శేషగిరి తలూపి భోజనం ముగించుకున్నాడు.

పఠాన్ చేతిలో తాను మోసపోయాడు. అతడు ఎవరు? ఎందుకు వచ్చాడు? విషయాలు తెలిస్తే తనకు ఈ మనక్షోభ వుండదు.

శేషగిరి తన గది తలుపు తెరిచాడు. లోపలకు నడిచి తలుపు దగ్గరగా తోసి తాళం నొక్కాడు.

ఇక తనన తెల్లారేవరకూ డిస్టర్బ్ చేసేవాళ్ళుండరు.

చేబులు తడిమి స్విచ్ నొక్కాడు. లైటు వెలగ లేదు. సన్నగా చప్పుడు వస్తోంది. ఏమిటా చప్పుడు. వీణ మీద ఒక తీగెను వాయించినట్టు సన్నటి శబ్దం. రాను రాను శబ్దం తీవ్రత పెరుగుతోంది. శబ్దం గది అంతా పరచుకుంటోంది. శబ్దానికి అటూ ఇటూ ప్రకంపనాలు మొదలయ్యాయి.

చెవులు హోరెత్తిపోతూన్నాయి. శబ్దం వింటూంటే ఏమీ తోచడంలేదు. మస్తిష్కంలో శబ్దం హోరు తప్ప ఏమీ లేదు.

శేషగిరి చెవులలో వేళ్ళు జొనిపాడు. అయినా శబ్దం హోరెత్తిపోతూ చెవుల్లో చొరబడుతోంది. చెవి పొరలు డబడబలాడుతోన్నాయి. కణతలమీద నరాలు పొంగుతోన్నాయి. శబ్దాల మధ్య సన్నపాటి ఈల!

శేషగిరి జుత్తు పీక్కుంటున్నాడు. తాళం తెరచి తలుపు తీయాలన్న ఆలోచనే రావడంలేదు.

శబ్దం! చెవులు గింగుర్లెత్తేలాగా వలయాలు వల యాలుగా గదిలో పరుచుకుంటోంది. సైరన్ కూస్తున్నట్టూ రైలు యింజన్ బయలుదేరుతోన్నట్టూ, విమానం ప్రొపెల్లర్స్ హోరెత్తి తిరుగుతోన్నట్టూ, బండలు దొర్లుతున్నట్టూ, వందలవేల జలపాతాలు ఒకేసారి ఉరుకుతోన్నట్టూ, సన్నటి దారిలోంచి ఎక్కువ శబ్ద తరంగాలు దూసుకువస్తోన్నట్టూ భయంకరమైన ఈలా, శేషగిరి భరించలేకపోతున్నాడు.

కణతలు పగిలిపోతున్నాయి. శేషగిరి బోర్లాపడ్డాడు. తలకు దెబ్బ తగిలింది.

## 9

కారు గేటుముందు ఆగింది. గౌరి పిచ్చిగా హారన్ కొడుతోంది. ఇంట్లో, పోర్టికోలో దీపాలు వెలుగుతోన్నాయి. ప ని మ ని షి పరుగెత్తుకు వచ్చి గేటు తెరచింది.

కారును లోపలికి పోనిచ్చింది గౌరి.

గేటు మూసి పోర్టికోలోకి వచ్చింది పనిమనిషి.

"అయ్యగారు వచ్చారమ్మా!" అంది పనిమనిషి.

గౌరి ఉలిక్కిపడింది. వాత్సర అప్పుడే వచ్చేశాడా? రేపు ఉదయమే వస్తాడని తాను ఆశించింది. రఘును చంపలేకపోయింది తాను. శ్రీపతికి ఆ విషయం తెలుస్తుంది. తన గురించిన అసభ్య చిత్రాలు తన భర్తకు చూపిస్తాడు శ్రీపతి. తన బతుకులో నిప్పులు కురుస్తాయి.

ఛీ....ఎంత పని జరిగింది.

పిస్తోలు గురి తప్పడం ఏమిటి? తాను మూడు తూటాలు కాల్చింది.

"గౌరీ!" గుమ్మంలో భర్త.

గౌరి గాభరాగా ఇగ్నీషన్‌కీ తీసుకుంది. మనసు నిగ్రహించుకుంది. డోర్ మూసి భర్తవైపు నడిచింది.

"మీరు ఎప్పుడు వచ్చారు?"

"ఇప్పుడే. అరగంట అవుతుంది. నువ్వెటయినా వెళ్ళి వుంటావని పనిమనిషిని పిలిచాను. ఇంతలో నువ్వే వచ్చావు" అన్నాడు వాత్సర.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ మేడమెట్లు ఎక్కారు. పనిమనిషి మెయిన్ హాలులో కూర్చుండిపోయింది.

అద్దాల కిటికీలోంచి పోర్టికో, తోట కనిపిస్తోన్నాయి.

పనిమనిషి ఉలిక్కిపడింది. పోర్టికోలో నీడ కదులుతోంది. పనిమనిషి మెల్లగా లేచింది. కిటికీవద్దకు నడిచింది. పోర్టికోలో నిజంగానే ఎవరో వున్నారు. మొక్కల చాటున దాక్కున్నాడు. అతడి వీపు స్పష్టంగా కనిపిస్తోంది.

పనిమనిషి, "ఎవరది?" అంది వణుకుతూ.

అతడు మెల్లగా లేచాడు. వెలుగు మొహంమీద పడుతోంది.

పనిమనిషి గుర్తుపట్టింది. శ్రీపతి బాబుగారు!

"బాబుగారూ! మీరా?" అంది పనిమనిషి.

శ్రీపతి ఆమెను గుర్తుపట్టి 'హుష్!' అన్నాడు.

అదే సమయంలో మెయిన్ హాలులో ఫోన్ గణగణలాడింది.

"వెళ్ళు. ఫోన్ చూడు!" అన్నాడు శ్రీపతి.

పనిమనిషి తెలివితెచ్చుకున్నది. ఫోన్ వున్న బల్లవైపు తరుగెత్తింది.

శ్రీపతి నిట్టూర్చాడు.

గౌరి పదిన్నరకు తనకు ఫోన్ చేస్తానన్నది. ఇప్పుడు 10-35 అయింది. ఆమె ఇంట్లో ఫోన్ చేస్తోండగా తాను ఇక్కడ వుండాలనుకున్నాడు.

తన పథకం ప్రకారంగా వాత్సవ వచ్చేశాడు.

వాత్సవ ఆమె మాటలు వినాలి. ఆమెను గద్దించాలి. ఆమెను సున్నితమైన ఇరకాటంలో పెట్టాలి.

పనిమనిషి ఫోన్ కాల్ మేడమీదకు అందిస్తోంది.

మేడమీద గదిలోంచి గౌరి మాట్లాడుతోంది. మరుక్షణంలో ఆమె చేతిలోంచి రిసీవర్ జారిపడిన చప్పుడు.

శ్రీపతి నవ్వుతున్నాడు. పరంధామయ్య చనిపోయిన వార్త వచ్చి ఉండాలి. వరండాలోనే వుంది శవం. తాను శవాన్ని చూసి లైటు ఆర్పి వచ్చాడు. పరంధామయ్య చచ్చిపోయినట్టు ఎవరు చెప్పారు?

గౌరి గద్గదంగా ఏడుస్తోంది. మెట్లు దిగుతున్నారు భార్యాభర్తలు.

పనిమనిషి వాళ్ళను ఆశ్చర్యంగా చూస్తోంది. భార్యాభర్తలు ఆమె ఉనికిని కనిపెట్టనట్టు బయటకు నడిచారు. పనిమనిషి పరుగెత్తింది. గేటు తెరిచింది.

వాత్సవ కారు నడుపుతోన్నాడు. కారు గేటు దాటింది.

శ్రీపతి మొక్కల చాటునుండి ఆ పనిమనిషిని పలకరించాడు.

"ఏమిటి? ఏమయింది?" అడిగాడు శ్రీపతి.

పనిమనిషి తల అడ్డంగా త్రిప్పింది.

"పరంధామయ్యను ఎవరో చంపేశారు. వాత్సవకు చెబుదామని రహస్యంగా వచ్చాను. అప్పటికే గౌరి వచ్చింది. ఆమె తట్టుకుంటుందో లేదో .... పాపం!" నిట్టూర్చాడు శ్రీపతి.

శ్రీపతి రోడ్డుమీదకు వచ్చాడు. మోటార్ సైకిలు డస్టుబిన్ చాటున పెట్టి వచ్చాడు తాను. శ్రీపతి అటు నడిచాడు. మోటార్ సైకిలు స్టార్టు చేశాడు.

నేతాజీ వీధి నెంబర్ 201 ఇంటిముందు ఆపాడు మోటార్ సైకిల్. రఘు ఇల్లు తెరచివుంది. ఇంట్లో దీపాలు వెలుగుతున్నాయి. ఇంటిముందు స్కూటర్ లేదు. హడావుడి లేదు. రఘు శవంవుంటే హడావుడి వుండదా? లేక రఘును ఈపాటికే మార్చురీకి తీసుకుపోయారా?

పోలీసులకు అపాటి చురుకుతనమా! ఆశ్చర్యం! లేదు! ఎక్కడో తప్పింది.

శ్రీపతి మోటార్ సైకిలును వెనక్కి తిప్పాడు. వెనక ఎక్కడో పోలీస్ సైరన్ వినిపిస్తోంది. పోలీస్ వానూ, కారూ వస్తోన్నాయి.

శ్రీపతి మోటార్ సైకిలును పోనిచ్చాడు.

పోలీస్ వ్యాన్ లైట్లు అతడిమీద పడ్డాయి. శ్రీపతి ప్రక్క రోడ్‌లోంచి తన ఇంటికి చేరుకున్నాడు.

మోటారుసైకిలుకు స్టాండువేసి లోపలకు నడవ బోయాడు. అతడి భుజంమీద చెయ్యి పడింది.

శ్రీపతి పరిహాసంగా నవ్వి, "రఘూ!" అన్నాడు.

## 10

పోలీస్ ఇన్స్‌పెక్టర్ విచిత్రంగా చూశాడు. కోపంతో అతడి కళ్లు ఎర్రబడ్డాయి. ఎలక్ట్రిక్ లైట్ల కాంతిలో అత్యవసర సమావేశం అది.

"ఒకే రాత్రి రెండు హత్యలు!" అరిచాడు ఇన్స్‌పెక్టర్.

సబ్ ఇన్స్‌పెక్టర్, హెడ్ కానిస్టేబులూ, సార్జంటూ, ఇతర కానిస్టేబుల్స్ సమావేశమయారు.

"సార్!" వినయంగా అన్నాడు సబ్ ఇన్స్‌పెక్టర్.

"వాట్!" కోపంతో వూగిపోయాడు ఇన్స్‌పెక్టర్.

"పరంధామయ్యను ఎవరో కత్తితో పొడిచిచంపారు. అది హత్యే! కాని శేషగిరిని ఎవరు చంపారో, ఎలా చంపారో ..."

"ఎలా చంపారు? అతడిని బార్‌లో కలిసిన పఠాన్ ఎవరు?"

"సార్! బార్‌లో వర్కర్స్ చెప్పింవాన్ని బట్టి

పఠాన్ పోలికలు పరంధామయ్యలో వున్నాయి."

"అయితే?"

"పరంధామయ్యా, అతడూ ఒకప్పుడు పార్టనర్స్. ఇద్దరూ తాగారు పైగా...." సబ్ ఇన్స్‌పెక్టర్ వ్రేలి ముద్రల నిపుణుడివైపు చూశాడు.

"బార్‌లో గాజు గ్లాసు మీద వ్రేలిముద్రలతో పరంధామయ్య చేతి వ్రేలిముద్రలు సరిపోల్చాం సార్. ఒక గ్లాసుమీద పరంధామయ్య వ్రేలిముద్రలున్నాయి" అన్నాడు నిపుణుడు.

"కాని పరంధామయ్య తొమ్మిది గంటలకు చని పోయాడు. శేషగిరి పదకొండు గంటలకు సెరిబ్రల్ హెమరేజ్‌తో చచ్చిపోయాడు. పరంధామయ్యను ఎవరు హత్య చేశారు?"

"పరంధామయ్య శేషగిరిని హత్య చేశాడేమో!"

"ఎలా? రెండు గంటల తర్వాత శేషగిరి చని పోయేటట్టు ఎలా చేయగలిగాడు?"

అందరూ ఆలోచనల్లో పడ్డారు.

"శేషగిరి గది సౌండ్ ప్రూఫ్ రూం. ఆ గదిలోనే ఏదో మర్మం వుంది. పరంధామయ్యకు ఆ గది మర్మం తెలిసివుండాలి. లేదా ఆ గదిలో శేషగిరి చనిపోయే లాగా...." ఆగాడు ఇన్స్‌పెక్టర్.

అతడి తలలో దీపం వెలిగింది.

శేషగిరి గదిలో బల్లకి తీగలు పీకివున్నాయి. తీగలు బల్లవద్ద పీకివుండటానికి కారణం ఏమిటి?

## 11

"శ్రీపతీ!" కోపంతో వణకుతున్నాడు రఘు.

"రా! ఇంట్లో కూర్చుని మాట్లాడుకుందాం!" అన్నాడు

శ్రీపతి.

"ఇంట్లోకి ఎందుకు? నన్ను లోపల చంపడానికా!"

"వెర్రివాడా! చంపాలంటే ఇక్కడే చంపగలను!"

"అవును. నువ్వెంత మొనగాడివే!"

శ్రీపతి అతడి చేతిని పట్టుకుని లోపలకు తీసుకు వెళ్ళాడు.

"ఏమైనా తాగుతావా?" అడిగాడు శ్రీపతి.

"విషం కలిపిందా?"

"కాదు. నేను త్రాగాకనే త్రాగు. ప్లీజ్.... కంపెనీ కోసం!"

"శ్రీపతీ! నువు మేకవన్నె పులివి! నన్ను తుపాకీతో కాల్చి చంపాలని ప్రయత్నించావు!"

"నేను కాదు! వాత్సవ!"

రఘు నిర్ఘాంతపోయాడు. "వాత్సవ! నేను అతడికి ఏం అపకారం చేశాను?"

"అతడి భార్య గౌరిమీద నువు నాలుగు సంవత్సరాల క్రితం అత్యాచారం చేశావు. పగతీర్చుకోవడానికి!"

"అయితే వాత్సవకు ఆ విషయం చెప్పి నువ్వే అతడిని పురికొల్పి నామీదకు పంపావు!"

"అవును. నిజం చెప్పడం తప్పా?" సీసాలోని ద్రవం గ్లాసులలోకి ఒంపాడు శ్రీపతి.

"నిజం! ఏమిటా నిజం! నాలుగేళ్ళ తర్వాత నిజాలు చెప్పి కాపురాలు నాశనం చేయడమా?"

"నిజం నిప్పులాంటిది! దాచరాదు!"

"నువు అబద్ధం ఫోటోలు పెట్టుకుని ఒకనాటి నిజాలతో నాటకమాడావు!"

"అరవక! నువ్వే పరంధామయ్యను చంపావు!"

"నువ్వే నన్ను రెచ్చగొట్టి చంపించావు!"

"సాక్ష్యం లేదు!"

"నువ్వు ఈ పట్టణంలోనే వున్నావు. నన్నూ వాత్సవనూ రెచ్చగొట్టావు. నేను పరంధామయ్యను చంపాలి. వాత్సవ నన్ను చంపాలి. వాత్సవను...."

"వాత్సవకు గౌరిని గురించిన నిజం తెలిసింది. ఆత్మహత్య చేసుకుంటాడు."

"గౌరి ఏమవుతుంది?"

"లక్షల ఆస్తితో నా పరమవుతుంది."

రఘు ఎగిరి అతడి గొంతు పట్టుకున్నాడు. శ్రీపతి గింజుకున్నాడు. రఘును విసిరికొట్టాడు శ్రీపతి. రఘు తుళ్ళి బల్లమీదపడ్డాడు. పెదిమ చిట్లింది. రక్తం ఉప్పగా తగిలింది. రఘు రెచ్చిపోయాడు. విసురుగా లేచాడు. శ్రీపతిని సమీపించాడు.

ఇద్దరూ ముష్టి యుద్ధం మొదలుపెట్టారు.

రఘు పిడికిళ్ళతో కొట్టసాగాడు.

శ్రీపతి తల పట్టుకున్నాడు. రఘు పిడికిలి బిగించి శ్రీపతి కడుపులో గుద్దాడు. శ్రీపతి వెనక్కి వంగి అతడి పిడికిలి పట్టుకుని ముందుకు లాగాడు. రఘు బోర్లగిల పడబోయాడు. శ్రీపతి అతడిని డొక్కలో తన్నాడు. రఘు నేలమీద పడిపోయాడు.

శ్రీపతి అతడిని కాలర్ పట్టి ఎత్తాడు.

రఘు చెయ్యి విసిరాడు. శ్రీపతికి దంతాలు కదిలినట్టయింది. శ్రీపతి అతడి మెడ పట్టుకోబోయాడు. శ్రీపతిని నడుంమీద తన్నాడు రఘు. గుమ్మంలో అలికిడి కావడం అతడికి తెలియదు. అతడి మెడను ఎవరో పట్టుకున్నారు. రఘు ఆశ్చర్యంలోంచి తేరుకునేలోగా అతడి

కంఠం నరాలు నలిగిపోతున్నాయి.

గాజులు గలగలలాడటం రఘుకు వినిపిస్తోంది.

తనను పట్టుకున్నది ఆడదా?

శ్రీపతి సోఫాలో పడ్డాడు. బలంగా వూపిరి పీల్చుకున్నాడు. రఘును ఎవరో ఆడది పట్టుకుంది. ఆమెను పరకాయించి చూశాడు.

అతడి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయాయి. ఆమె గౌరి. ఇక్కడికి ఎలా వచ్చింది?

రఘు ఆమెను బలంగా విసిరికొట్టాడు. ఆమె సోఫా మీద పడింది. కూర్చుండే రొప్పుతోంది.

"మీ ఇద్దరూ ఎందుకు కొట్టుకున్నారు?" అడిగింది గౌరి.

రఘూ శ్రీపతీ మొహాలు చూసుకున్నారు.

ఆమెకు ఏమిటి బదులివ్వడం?

"రఘూ! నువ్వు కానీ శ్రీపతి కానీ మా నాన్నను చంపారు. అవునా?" అరుస్తోంది గౌరి.

శ్రీపతి వ్యంగ్యంగా నవ్వి "రఘు చంపాడు. అతడికి మీ నాన్నమీద కోపం!" అన్నాడు.

గౌరి కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. "ఆ కోపం నువ్వు రేకెత్తించావు" అంది.

"అవును."

"తొమ్మిది గంటలకు రఘు మా నాన్నను చంపాలి. పదిగంటలకు నేను రఘును చంపాలి. కాని పదిగంటల తర్వాత శేషగిరి ఎలా చనిపోయాడు?"

"ఆ రహస్యం ఎవరికీ తెలియదు."

గౌరి పళ్ళు బిగించి, "పోలీసులకు అనుమానం వచ్చింది. మరల శేషగిరి గదిలోకి వెళ్ళారు" అంది.

"వెళ్ళనివ్వూ. శేషగిరిని చంపిన శబ్దాల యంత్రం పరంధామయ్యని. అతడే శేషగిరి గదిలో ఆ యంత్రాన్ని అమర్చాడు."

"రాస్కెల్! ఇంతా చేసి చనిపోయిన మా నాన్న మీదకు త్రిప్పావన్నమాట!"

"అవును."

"నువ్వు....నువ్వు ...." గౌరి వణుకుతోంది "నీకు మేము అపకారం చేయలేదు. మామీద ఎందుకు పగబట్టావు?"

"నీ అందం నా సొంతం కావాలి. నీ ఆస్తికి హక్కుదారు నేనే కావాలి!"

"కాని నువ్వు నన్నూ, రఘునూ, మా నాన్ననూ హత్యలకు పురికొల్పావు. ఈ విషయాలు పోలీసులకు చెబుతాను."

"నేను రాత్రి తొమ్మిది గంటలవరకూ విజయవాడలో వున్నాను. ఆకాశవాణిలో నా కార్యక్రమం రికార్డింగ్ లో వున్నాను. బలమైన ఎలిబీ వుంది. స్టేషన్ ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, అనౌన్సరూ సాక్ష్యం చెబుతారు!"

"ఏమని?"

"శ్రీపతి అనే పెద్దమనిషి తను కోరుకున్నట్టుగా తన పరిచయాన్ని రికార్డింగ్ చేయించుకున్నాడని."

"అంటే..శ్రీపతి పేరున ఎవరినో పంపావన్నమాట?"

"అవును. ఫోటోలోని మరో నగ్న పురుషుడిని బెదిరించి పంపాను."

రఘు ఇద్దరినీ గ్రుడ్లప్పగించి చూస్తోన్నాడు. శ్రీపతి చెబుతోంటే ఒక్కో విషయమూ మెదడుకు సుత్తిపోటు లాగా తగులుతోంది. శ్రీపతిలాంటి స్వార్థపరుడి చేతిలో తాను ఎలా నలిగాడో తలుచుకుంటే ఆశ్చర్యంగావుంది.

గౌరి వున్నట్టుండి పకపక నవ్వింది. బ్లవుజ్ లోంచి మినీ టేప్ రికార్డర్ తీసింది. అప్పటివరకు బయట కాచుకొని వున్న పోలీసులు లోపలకు జొరబడ్డారు. క్షణాలలో శ్రీపతి, రఘు ఇద్దరి చేతులకు బేడీలుపడ్డాయి.

గౌరి టేప్ రికార్డర్ను ఇన్స్పెక్టర్కు అందించి భారంగా బయటకు నడిచింది.

—:ఐ పో యిం ది:—

# బ్రతకాలంటే పారిపో!

## సికిందర్

రాణిగంజ్ లోని అరంత స్తుల నందా బిల్డింగ్ పార్కింగ్ స్పేస్ లో నా మోటార్ సైకిల్ నిలిపి, పరుగులాంటి నడకతో వెళ్ళి లిఫ్ట్ లో నాల్గో అంత స్తు చేరుకున్నాను. టైము చూసుకొని, మరింత వేగంగా నడుస్తూ కారిడార్ లో ఓ గది ముందాగి, డోర్ ప్రక్కనున్న నేమ్ బోర్డుని చూశాను భ క్తిగా, ప్రేమగా.

M. J. M. Rao,
Investigator—in—chief,
DECCAN DETECTIVE AGENCY

వెండిరంగు బ్యాక్ గ్రాండ్ తో, బంగారు రంగు అక్షరాలతో, ఆకర్షణీయంగా మెరిసే నేమ్ ప్లేట్ ని చూ సే ముద్దు పెట్టుకోవాలనిపిస్తోంది నాకు. బాస్ డిగ్నిటీకి ప్రాధాన్యమిస్తాడు. అలాటి బాస్ దగ్గర పని చెయ్యడం నాకు గర్వంగానే వుంటుంది.

వెయిటింగ్ రూంలో అడుగుపెట్టి అప్పటికే హాజరై

వున్న ఓ అరడజనుమంది క్లయింట్స్‌ని చూశాను, ఎడమ వైపు సోఫాలో, ఉద్రిక్తంగా కూర్చుని బాస్ పిలుపు కోసం ఎదురుచూస్తూ.

కుడివైపు, కౌంటరు వెనుక, సీరియస్‌గా ఏదో వ్రాసు కుంటున్న రిసెప్షనిస్టుని చూశాను. ఆమె పేరు రమణి. హాట్ కేక్ కల్పనా అయ్యర్‌లా వుంటుంది. అసలే మతి పోగొట్టే అందం. దానికి తోడు రెచ్చగొట్టేలా దుస్తులు కట్టుకుంటుంది. అలంకరించుకుంటుంది. కాని రెచ్చిపోవ డానికి నేను మామూలు సితిలో లేను. రమణి కాదు గదా, రంభ దిగి వచ్చినా నన్నేం చేయలేదు—ఇష్టపడితే తప్ప. అలా ఇష్టపడే మూడ్—ఆలోచనలు కూడా నాకిప్పుడు లేవు.

ఆమె తలెత్తి నన్ను చూసింది, నిర్లక్ష్యంగా "వెళ్ళండి, బాస్ మీ కోసం ఎదురు చూస్తున్నారు!"

అందగత్తె అన్న అహంకారమేమో ముక్తసరిగా మాట్లాడుతుంది. ఆఫీసులో నాతోటివాళ్ళు ఆమె దగ్గర వేషాలు వేసివేసి, ఇక లాభంలేదని తెలుసుకొని సగం పిచ్చివాళ్ళయి, జుట్టు పీక్కుంటున్నారు.

వాళ్ళని చూస్తే నాకు జాలి.

డోర్ తీసుకొని బాస్ గదిలోకి వెళ్ళిన వెంటనే కనిపించిన దృశ్యం: పాడ్ మీద ఏదో వేగంగా వ్రాస్తున్న బాస్, అతని ప్రక్కన స్టూలుమీద ఫైల్లో కాగితాలు చకచక తిరగేస్తున్న సెక్రటరీ సుమిత్ర.

సుమిత్ర నయం. రమణిలా టెక్కు చూపించదు. చక్కగా మాట్లాడుతుంది. దుస్తులు చక్కగా కట్టు కుంటుంది. ఆమె జయసుధలా వుంటుంది. జయబాధురిలా నవ్వుతుంది.

ఇక బాస్ ఎంత సీరియస్‌గా ఉంటాడో, ఒక్కోసారి అంత సరదాగానూ వుంటాడు. అతనికి 45 ఏళ్ళుంటాయి, పెళ్ళి చేసుకోలేదు. పూర్తిగా ఈ డిటెక్టివ్ వృత్తికే అంకితమైపోయాడు. సిటీలో అతని ఈ ఏజెన్సీకి తిరుగులేని ఖ్యాతి వుంది. డజనుమంది ఆపరేటర్స్‌తో, వేగవంతమైన పని సామర్థ్యంతో, విజయవంతమైన ఫలితాలతో, విశ్వాసనీయమైన సంస్థగా తీర్చిదిద్దాడు ఎనిమిదేళ్ళ కృషితో, ఈ ఏజెన్సీని.

అతను తలెత్తి చూసి, "కమాన్ సిడవున్, ఇంత ఆలస్యం అయిందేమిటి?" అన్నాడు కొంచెం కోపంగా.

నేను కూర్చుని టైము చూశాను. పదకొండు కావస్తోంది.

"రాత్రి నిద్ర కాచాను సర్, భోయారామ్ ఫటాఫట్ కేసులో. ఆ చూస్కో ముఠావాళ్ళు ఎక్కడా కనిపించలేదు, సర్...." అన్నాను.

బాస్ అన్నాడు అసహనంగా. "ఓహ్, ఫటాఫట్! అతనికి అదొకటే సర్వస్వం కాదు, వదిలెయ్!"

"కానీ అతని భార్య వదలదు సర్, అతన్ని."

"ఎవడు కట్టుకోమన్నాడు భార్యని? కట్టుకున్నా అర్థరాత్రి వెంటేసుకు ఊరేగమన్నదెవడు? ఈ రోజుల్లో భార్యతో బైటికి వెళ్లాలంటే గట్స్ ఉండాలి ముందు, గట్స్! లేకపోతే ఈ చూస్కో ముఠాలాంటి వాళ్ళు.... డామిట్, వదిలెయ్! ఇప్పుడొక కొత్త కేసు వచ్చింది. అందుకే నిన్ను పిలిపించాను అర్జంటుగా."

"ఏమిటది, సర్?" అన్నాను ఆసక్తిగా.

"దొంగతనం కేసు. ప్రతాపరావని ఒక బిజినెస్ మాగ్నెట్ ఇంట్లో."

"చెప్పండి సర్, ఏం జరిగింది?"

"జరగవల్సింది జరగలేదు. అతనిందాకవచ్చి వెళ్లాడు. ఇవాళ మధ్యాహ్నం అత్యవసరంగా బొంబాయి వెళుతున్నాడట నాలుగు రోజులుదాకా రాడు" క్షణం ఆగి తిరిగి అన్నాడు బాస్, "కమల్, అతని బంగళా బంజారా హిల్స్‌లో వుంది. ఈ నాలుగు రోజుల్లోను దొంగ రెండుసార్లు వచ్చాడట ఇంటికి. మొన్న ఆదివారం మొదటిసారి. నిన్న మంగళవారం రెండోసారి. రెండు సార్లూ తప్పించుకు పారిపోయాడు. వాడు నీలిరంగు డ్రస్సులో, నల్లటి ముసుగు వేసుకొని వున్నాడట. ఆ రెండుసార్లూ వాళ్ళ బెడ్‌రూమ్‌కి ఎడమవైపు గదిలో ప్రవేశించడానికి విఫలయత్నం చేశాడట. వీళ్ళు చప్పుళ్ళకి మేల్కొని వెళ్ళేలోపు కిందకి దూకి పారిపోతున్నాడట.

"గేటు దగ్గర గూర్ఖా ఉన్నాడు. కానీ ఆ రెండు సార్లూ దొంగను గమనించక పోవడంతో అతన్ని పని లోంచి తీసేశారు. ప్రస్తుతానికి ఎవరూ లేరు. ఇంట్లో ప్రతాపరావు భార్య, వాళ్ళ ఏడేళ్ళ కుమారుడు, ఒక వంట మనిషి, ఒక పనివాడు ఉంటున్నారు. రావ్‌కి యాభైపైన ఉంటుంది వయసు - అరవైకి దగ్గర్లో. ఇవాళ అర్జంటుగా బొంబాయి వెళుతున్నాడట. అందుకని ఇంట్లో రక్షణ కావాలని మనల్ని కోరాడు-"

"పోలీసు రిపోర్టివ్వలేదా, సార్?"

"లేదు. అతను వూళ్ళో ఉండని ఈ నాలుగు రోజులూ ఇంటికి రక్షణ కల్పించమన్నాడు. ఆ దొంగ మళ్ళీ రావచ్చని అతడి అనుమానం. రాత్రులు గట్టి నిఘా వేసి వాడ్ని పట్టుకోమన్నాడు."

"దొంగ దేనికోసం వస్తున్నాడు, సర్?"

"వాడు వెళ్ళాలని ప్రయత్నిస్తున్న గదిలో సేఫ్ ఉంది, కమల్. ఆ సేఫ్‌లో నగలున్నాయి. లక్షలు విలువ జేసే నగలు."

ఉలిక్కిపడ్డాను. "నగలా?"

"అవును, నగలు. ఈ కేసు నేనంగీకరించాను. ఇందులో నిన్నూ దిలీప్‌నీ నియమిస్తున్నాను. రావ్ ఊళ్ళో లేడని తెలిస్తే దొంగ ఇవాళ కూడా ప్రయత్నించవచ్చు. ఇవాళ గాకపోతే రేపు. ఈ నాలుగు రోజులూ జాగ్రత్తగా కాపలా వుండాలి. సాయంత్రం ఆరునుంచి రాత్రి పన్నెండు వరకు డ్యూటీ నీకు వేస్తున్నాను. పన్నెండు నుంచీ తెల్లారేవరకూ దిలీప్. ఓ. కే?"

"కానీ సర్, ఈ నిఘా కేసులంటే నాకు పరమ బోరు——"

"నిఘా ఒక్కటే కాదు, దొంగొస్తే పట్టుకోవాలి! తప్పించుకోవచ్చు, వెంట తరమాలి. ఛేజింగ్‌లో నీ నేర్పరితనం నాకు తెలుసు. దిలీప్ కూడా నీకేమీ తీసిపోడు. అందుకే మీ ఇద్దర్నీ నియమిస్తున్నాను....నా గెటవుట్!"

"మరి ఫటాఫట్ కేసు? పాపం అతని భార్య...."

"ఆ ఫటాఫట్‌ని అతని భార్య ఎడాపెడా తిట్టాలి! ఇంకెప్పుడూ అలా పిరికిగా ప్రవర్తించడు!"

సుమిత్ర నవ్వింది. నేనూ నవ్వాను బలహీనంగా.

"ఆల్‌రైట్, సర్. సాయంత్రం నేను మరొక ప్రయత్నం చేస్తాను. చూస్కో ముత్తావాళ్ళ సెంటర్ ఆలోక్ థియేటర్ దగ్గర చూశాను, ఫస్టు షోకి అక్కడ

తయారవుతారేమో. అక్కడ్నుంచి ఆరుగంటలకి రావ్ ఇంటికి డ్యూటీకెళ్తాను."

బాస్ అన్నాడు. "వాళ్ళు ఈ రెండు రోజులూ ఎక్కడా కనిపించలేదంటే ఈ ట్విన్ సిటీస్‌లో లేరని అర్థం. పట్టి జేబులు కత్తిరించే బాస్టర్డ్స్, అంత విలువైన సొమ్ము ఎన్నడూ చిక్కివుండదు. సిటీ వదలి చెక్కేశారు దాంతో. నేనీ కేసును సాయంత్రం సుమన్‌కు ట్రాన్స్‌ఫర్ చేస్తాను."

నేను లేచి, సుమిత్ర అందించిన ప్రతాపరావు అడ్రసు తీసుకొని కదిలాను.

ఆ మధ్యాహ్నమంతా పెండింగ్‌లో వున్న రేడియం డ్రగ్స్‌వారి ఇమిటేషన్ కేసులో నాలుగుచోట్లా తిరిగి, సాయంత్రం అయిదున్నరకల్లా అలోక్ థియేటర్ ముందున్నాను, గన్ ఫౌండ్రీలో.

ఫస్టు షో టైము అవుతోంది .... మాట్నీ ఇంకా వదల్లేదు. జనం చిన్నగా గుమిగూడుతున్నారు. చూస్తూ ముఠావాళ్ళు కొందరు నాకు తెలుసు. ఫటాఫట్ ఇచ్చిన వర్ణనతో వాళ్ళని పోల్చుకున్నాను. మొన్నరాత్రి భోయారామ్ ఫటాఫట్ దంపతులు డింపుల్ హోటల్‌లో ఏదో మ్యారేజి రిసెప్షన్‌కు హాజరై వస్తోంటే, ప్రక్క సందులో అచ్చం సినిమాలోలాగే చూస్తూ ముఠావాళ్ళు కత్తులతో అటకాయించి, ఇల్లాలి మెడలో హారం ఇచ్చేమన్నారు ముక్తసరిగా. వాళ్ళు మితభాషులు.

ఆ ఇల్లాలు అదిరిపోయి ప్రాణాలెగిరిపోయేలా కేకలు వేస్తే ఇళ్ళల్లో జనం ఎవరూ రాలేదు. వీధిలోనూ ఎవరూ లేరు. బాగయింది! ఆ హారంతో నేకమా ఆమె

ఫంక్షన్‌లో అతి బడాయిగా ప్రవర్తించింది? ఆ మెకు అది శిక్ష! కత్తులు తళుక్కుమన్పిస్తూ చూస్కో వీరులు పరిమళాలు వెదజల్లే ఇల్లాలి పసిమిఛాయంటిమీద మురికి చేతులు వేయబోతే, ప్రక్కనున్న ఫటాపట్ వెంటనే ఉబలాట పడిపోయి, తనే స్వయంగా తన ఇల్లాలి మెడలోంచి లక్షరూపాయల హారాన్ని దించి దానంచేసేశాడు, అన వసరంగా నవ్వేస్తూ.

ఆ తర్వాత రాత్రంతా భద్రకాళి అవతార మెత్తిన ఆ మహా ఇల్లాలి అతిశ్రావ్యమైన తిట్లూ, మధురాతిమధుర మైన శాపనారాలతో పులకించిపోయి, తెల్లారి లేచి చక్కా మా దగ్గరకొచ్చేశాడు. న్యాయంగా పోలీసుల దగ్గరికి పోతే వాటాలు పంచుకుంటారని అతని భయం. మా ఏజెన్సీ మీద మంచి నమ్మకముందట. రాత్రి జరిగిం దంతా అతను చాలా నాటకీయంగా చెప్పుకొచ్చాడు.

కానీ నిన్నట్నుంచీ ఎంత వెతికినా, ఎక్కడ గాలించినా ఆ చూస్కో ముఠావాళ్ళు అయిపూ జాడా లేరు. వాళ్ళ నాయకుడు బి.పి. చూస్కో ఎల్లప్పుడూ దమ్ము తీసుకోకుండా మందుకొడుతూ పడుకునే అతి రహస్య స్థావరంలో పిల్లులు ఆడుకొంటున్నారు ప్రస్తుతం. ఇక అతని చెంచాగాళ్ళ ఇళ్ళల్లో తల్లులూ పెళ్ళాలూ దిగులుపట్టుకొని మంచా లెక్కి ఉన్నారు.

బహుశ ఆ లక్షరూపాయల నగ కళ్ళచూడగానే కైపంతా ఎగిరిపోయి బి.పి. చూస్కో ముఠాతో సహా లేచిపోయుంటాడు, బాస్ అన్నట్లు మరో నగరానికి. చూస్కో-గారి సోదరుడు మూస్కో కూడా కనిపించుట లేదు.

అందుకే జంట నగరాలిలా కళావిహీనంగా

ఉన్నాయి. ఈ థియేటర్ ఆవరణలో వాళ్ళు లేనిలోటు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. పావుగంటసేపు క్యాంటీన్ చాటునవుండి గమనించాను. వాళ్ళెవరూ రాలేదు. ఇహ వచ్చే నమ్మకంలేదు.

గేటులోంచి బైటికొచ్చి పేవ్‌మెంట్ మీద నిలబడి ట్రాఫిక్‌నీ, షాపుల్లో సందడినీ చూడసాగాను సిగరెట్ తాగుతూ. అలా ట్రాఫిక్‌ని తిలకించడం సరదాగానే ఉంటుంది. అదీ సాయంత్రంవేళల్లో. ఈ హైద్రాబాదు కొచ్చిన కొత్తలో అబిడ్స్‌లోని ఒక చాకబారు లాడ్జి చివరి అంతస్తులో కూర్చుని అదేపనిగా చూసేవాడిని ట్రాఫిక్‌ని, భవిష్యత్తు ఆలోచించుకుంటూ.

ఈనాడు ఉద్యోగంలో అలా గడిపే వీలు చిక్కడం లేదు. సిగరెట్ తాగుతూ హఠాత్తుగా గతం గుర్తుకు రావడంతో పరాకుగా వచ్చేపోయే వాహనాల్ని చూడసాగాను. అప్పుడే నా దృష్టి ఒక ఫియట్ కారు మీద పడింది. అది ఎదురుగా చెల్లారామ్స్ షోరూమ్‌ముందు ఆగివుంది. నా భవిష్యత్తు నేనూహించుకున్న విధంగా రూపొందివుంటే, అలాంటి కారు నా స్వంతమైవుండే దీనాడు.

అసంతృప్తిగా సిగరెట్‌ని సగంలో పారేసి, హఠాత్తుగా కారువద్ద ప్రత్యక్షమైన ఆకారాన్ని చూశాను. ఆమె షోరూంలోంచి వచ్చింది. చేతిలో రెండుమూడు ప్యాకెట్లున్నాయి. ఆమె ముఖం స్పష్టంగా కన్పించడంలేదు. పెద్ద పెద్ద గాగుల్స్ పెట్టుకుంది కళ్ళకి. కానీ నడక—ఆ నడక నా కెందుకో పరిచితమనిపించింది. ఆ రంగు, పాతికేళ్ళు దాటని వయసు, ఆ పెదవులతీరు - గాభరాగా పారేశాను సిగరెట్‌ని. ఆమె—ఆమె లీల

కదూ? అవును, లీల! ఆమె లీల.

ఆమె కారెక్కి స్టార్టు చేసుకుని వెళ్ళిపోతోంది....

నేనలాగే చూస్తున్నాను కళ్లప్పగించి నిశ్చేష్టుడయిపోయి, గుండె భరించలేనంత వేగంగా కొట్టుకుంటోంటే.

హఠాత్తుగా తేరుకొని మోటార్ బైక్ మీదికి దూకి స్టార్టు చేశాను. ట్రాఫిక్‌ని ఎలా తప్పించుకుని అవతల పడ్డానో తెలీదు, నిమిషంలో ఆ కారు వెనుక ఉన్నాను వెంటాడుతూ. ఆ కారు ఎటు వెళుతోందో తెలీదు. ఉద్రేకంతో నా రక్తం మరుగుతోంటే, వళ్ళు కంపిస్తోంటే, గొంతు తడారిపోతోంటే, గుడ్డిగా దాన్ని అనుసరిస్తున్నాను. ఎంతసేపు అలా వెళ్ళానో తెలీదు. హఠాత్తుగా తేరుకొని గమనిస్తే ఇరవై గజాల దూరంలో ఆ కారు ఒక పెద్ద బంగళాలోకి తిరుగుతోంది....

అది అదృశ్యమైయ్యాక ఉద్రేకాన్ని అణచుకుంటూ, ఆ బంగళాని సమీపించి నెంబరు చూశాను. బాంబులు పడ్డాయి నా నెత్తిమీద!

బంజారా హిల్స్! ఇది ప్రతాపరావు బంగళా!

# 2

పనివాడు పరుగెత్తుకొని వచ్చాడు గేటు దగ్గర నన్ను చూసి.

వాడికి ముప్ఫై ఏళ్ళుంటాయి. నల్లగా, బలిష్టంగా ఉన్నాడు.

"ఎవరు కావాలి, సార్?" అడిగాడతను.

"నేను డిటెక్టివ్‌ని, ఈ ఇంటికి కాపలాకొచ్చానీ రాత్రి" అన్నాను.

"మీరేనా? అయ్యగారు చెప్పారు, అవునవును! మీ

పేరు?"

"కమలాకర్. అమ్మగారికి తెలుసా?"

"తెలుసు. చెప్పివస్తానుండండి!" అతడు పరుగు తీశాడు.

చీకటిపడుతోంది అప్పుడే. లోపల లాన్స్‌లో కేరింతలుకొడుతూ ఒంటరిగా ఫుట్ బాల్ ఆడుకుంటూ కన్పించాడొక ఏడెనిమిదేళ్ళ కుర్రాడు. మిగతా బంగళా అంతా నిశ్శబ్దంగా వుంది. అసలీ ప్రాంతాల ఇలాగే ఉంటుంది. పనివాడు వెళ్ళిన నిమిషానికి మేడమీద ఒక గది కిటికీ తెర చటుక్కున సగం తొలగడం, వెంటనే తిరిగి మూసుకోవడం నా కంటపడింది. గదిలో లైటు వెలుగుతోంది. తెరమీద అవతల మనిషి నీడ స్పష్టంగా పడుతోంది. దాన్ని చూడగానే నా రక్తం పొంగింది ఉద్రేకంతో. చేతివేళ్ళు బిగుసుకున్నాయి జేబులో రివాల్వర్ చుట్టూ.

పనివాడు తిరిగివచ్చి గేటు తీశాడు. "రండి సార్, మిమ్మల్ని రమ్మన్నారు అమ్మగారు."

తేరుకొని బైక్‌ని లోపలికి పోనిచ్చి ఓ ప్రక్కగా ఆపాను. పనివాడు నన్ను తీసుకొని బయల్దేరాడు. "నీ పేరు?" అడిగాను.

"రాజు" అన్నాడతను.

బాల్ ఆడుతున్న కుర్రాడు నా ముందుకొచ్చి, "ఏయ్, ఎవరు మీరు?" అని దబాయించాడు. మామూలుగానైతే అతని ముఖం చూసి నవ్వేవాడిని. కానీ నా కిప్పుడా సహనం లేకపోయింది. ముందుకు సాగిపోయాను. రాజు నన్ను ఇంట్లోకి తీసుకెళ్ళి హాలు ప్రక్కగానున్న మెట్లగుండా పైకి దారితీశాడు.

"అమ్మగారు బెడ్‌రూంలో ఉన్నారు సార్" అన్నాడతను.

నేను బెడ్‌రూంలోకి వెళ్ళగానే, రాజు వెనుతిరిగి పరుగెత్తాడు అక్కడ్నుంచి అకస్మాత్తుగా.

గదిలో ఆమె నన్ను భయపడుతూ చూసింది. ఆమె ముఖం పాలిపోయి వుంది. కళ్ళు బెదురుతున్నాయి. చేతులు విపరీతంగా నలుపుకుంటోంది కొయ్యబొమ్మలా నిలబడి.

నేనామెని సమీపించగానే శ్వాస బిగబట్టింది. ఆమె కళ్లలోకి తీక్షణంగా చూడగానే నోరు తెరచి కెవ్వున అరవబోయింది. చటుక్కున ఆమె నోరుమూసి బెడ్ మీదికి తోశాను విసురుగా. వెళ్ళి వెల్లికిలా పడ్డంతో, వేగంగా సమీపించి కాలెత్తి బెడ్ మీదవుంచి, ఆమె ముఖంలోకి చూశాను వంగి కర్కశంగా. ఆమె మళ్ళీ అరవబోయింది — కానీ నేను చెయ్యెత్తడంతో ఆగిపోయింది.

"అరవకు, చిట్టీ! నువ్వు అరిచి ఏమీ లాభంలేదు" అన్నాను.

"నువ్వు — నువ్విక్కడకెలా వచ్చావ్?" గొంతు పెగల్చుకొని అందామె.

"నేనిలాగాకపోయినా ఎలాగూ వచ్చేవాడినే! ముందు నిన్ను చూసి ఇల్లు చూశాను. లేకపోతే ఇల్లు చూసి నిన్ను చూసేడివాని .... వాటె కోఇన్సిడెన్స్! నువ్విక్కడే ఉంటావని వూహించానా! నీ మొగుడ్ని అభినందించాలి. అతడికి నేనెంతో ఋణపడివుంటాను—"

"నన్నొదులు! వెళ్ళిపో ఇక్కడ్నుంచి! నాకు పెళ్లయింది! నీతో నాకు సంబంధంలేదు!"

ఒక్క ఉదుటున లేచి ఆమె, నన్ను పక్కకు నెట్టేస్తూ పరుగుదీసింది తలుపు దగ్గరికి. అక్కడాగిపోయి మళ్ళీ అరిచింది ఉద్రేకంగా.

"మర్యాదగా వెళ్ళిపో! లేకపోతే రాజుతో గెంటిం చేస్తాను!"

ఆమె రాజుని కేకేయబోయింది వెనుతిరిగి.

"వన్ మినిట్, చిట్టీ!" అన్నాను బెడ్ మీదనుంచి లేస్తూ, "నన్ను గెంటించేసి కారణం ఏం చెబుతావు నీ మొగుడికి, నా బాప్ కి? నేను అల్లరిపెట్టాననంటావా? ఓ.కే, అలా గే చెయ్. నేనప్పుడా ఉత్తరాలన్నీ పట్టుకొచ్చి అందులో నువ్వెంత ప్రేమ ఒలకబోసిందీ చదివి వినిపించి ఇది నా మాజీ ప్రియురాలూ, నన్ను మోసంచేసి పారిపోయిందీ అంటాను. నువ్వేమంటావప్పుడు?"

ఆమె బెదురుగా చూసింది. గబుక్కున దగ్గరికొచ్చి అరిచింది.

"నీకేం కావాలి ఇప్పుడు?"

"నీ దగ్గర ఏం మిగిలిందిప్పుడు?"

"డబ్బిస్తాను. ఎంతకావాలి నీకు? తీసుకొని నీ ముఖం చూపించకు దుర్మార్గుడా!"

"ఆగు, చిట్టీ!" అన్నాను అడ్డం తగిలి, "నన్ను దుర్మార్గుడు అంటున్నావా? నాకు డబ్బిస్తానంటున్నావా? డబ్బు కోసం దిగజారింది నువ్వు! నువ్వెప్పుడు కని పిస్తావా, నీ అంతు ఎప్పుడు చూస్తానా అని ఎదురు చూశాను ఇంతకాలం.." అంటూ జేబులోంచి రివాల్వర్ తీసి పట్టుకున్నాను.

ఆమె శ్వాస బిగబట్టి చూసింది. "చంపుతావా నన్ను?"

"అదేగా నా ధ్యేయం? జీవితాశయం? నాకు నీ ప్రాణాలు కావాలి. అదేగా నీ దగ్గరిప్పుడు మిగిలింది? నిన్ను చంపుతాను చిట్టీ. కానీ మధ్యలో నీ ముసలి మొగుడు దాపురించాడు మా క్లయంట్ రూపంలో! మాకు కొన్ని బాధ్యతలు అప్పగించి వెళ్ళాడు. అవి పూర్తి చేయాలి. అతనికి న్యాయం చేకూర్చడం మా ధర్మం. అదయ్యాకే నీతో నా ప్రైవేటు వ్యవహారాన్ని సెటిల్ చేసుకుంటాను. నువ్వెక్కడికి పోతావిప్పుడు?"

"పిచ్చిగా వాగుతున్నావు! పోలీసుల్ని పిలిచి నిన్ను అరెస్టు చేయిస్తానిప్పుడే?"

నవ్వాను. "పోలీసులా! నువ్వెల్లరిపడకుండా నన్ను లోపల మూయించలేవు చిట్టీ, గ్రహించుకో! ఎంతకాలం లోపలుంటాను? తిరిగివచ్చి నిశ్చయంగా నీ అంతు చూస్తాను. అప్పుడు తిన్నగా నేనే వెళ్ళి జైల్లో కూర్చుంటాను నిశ్చింతగా, సంతృప్తిగా. నా జీవితాశయం నెరవేరుతుంది."

"నేను నిన్ను మోసం చేయలేదు, నన్నెందుకు నిందిస్తావు? నిన్ను చేసుకోవడం నాకిష్టంలేదసలు! అందుకే నిన్ను విడిచి వెళ్ళిపోయాను. నా పెళ్ళి నా ఇష్టం. నువ్వెవరు నన్ను బలవంతంగా—"

"ఓహ్, నీ కిష్టంలేకపోతే బలవంతాన చేసుకుంటానా? ఇష్టంలేని పెళ్ళాంతో కాపురంచేసే సహనం వుందా నాలో! నరికి పోగులేస్తాను. నాకు దక్కనిది మరెవరికి దక్కడానికి వీల్లేదు. అసలు నీ కెందుకయింది అయిష్టం మధ్యలో హఠాత్తుగా? నా దగ్గర డబ్బులేదని, నీ కోర్కెలు తీర్చలేనని, అంతేకదూ? నీకు డబ్బూ సుఖాల రాకుమారి మీద అంతులేని మోజు—నీ తండ్రి ఆరొందల

జీతగాడైనా.

కానీ ఒక్క రెండేళ్ళు ఓపిక పట్టివుంటే ఇవాళ నిన్ను విదేశాల్లో తిప్పుతుండేవాడ్ని! నీ కోరికలన్నీ తీర్చేవాడ్ని! ఈ ప్రపంచంలో నాకో మనిషంటూ నువ్వున్నావనే తలంపుకే ఇంకా ఇంకా గడిస్తూ నిన్ను మహారాణిని చేసేవాడిని, తెలుసా?

కానీ నీలో ఆ ఓపిక లేకపోయింది. అందుకే ఆ గొప్పింటి లుచ్చాగాడితో పారిపోయొచ్చావు! నీకు మనిషికంటే డబ్బు ముఖ్యం కదూ, డబ్బు! వాడే మయ్యాడు ఇంతకీ? శుభ్రంగా పీల్చేసి వదిలేశావా, లేక వాడే నీనుంచి జారుకున్నాడా మొహంమొత్తి? ఈ ముసలాడెక్కడ తగిలాడు మరి? వాడికీ వీడికీ మధ్య ఎందరయ్యారు?

"చిట్టీ, నువ్వు బాగానే నేర్చావు వెలయాలి కిటుకులు! ఈ ముసలాడ్ని బాగానే వేసుకున్నావులే నీ బుట్టలో! నీకిక్కడ పర్మనెంటు సీటు రెండో పెళ్ళాంగా కదూ—"

ఆవేశంగా ఆమె నా షర్టు పట్టుకుని కొట్టబోయింది. ఆమె చేతులు రెండూ నా ఒక్క చేతిలో దొరికించుకుని ఆమెని బెడ్ మీదకు తోశాను మళ్ళీ—

"ఓహ్, నిన్నెలా వూహించుకున్నాను! నీతో జీవితాన్నెలా కలలుగన్నాను! నా భవిష్యత్తు ఎలా వుంటుందనుకున్నాను! చివరికేమైంది! ఎవరు ఎందుకు పుడతారో తెలీదు. నేను నిన్ను చంపడానికే, హంతకుడు కావడానికే పుట్టానని పిస్తోంది! నేనూహించుకున్న బంగారు జీవితమిలా ముగియబోతుందన్న మాట జైల్లో! విధి ఎంత అనూహ్యమైనది! నిన్ను నమ్మినందుకు నన్ను

సర్వనాశనం చేశావు, యూ డర్టీ —"

"నోర్మూయ్! వెళ్ళిపో ఇక్కడుంచి! వెళ్ళిపో! లేదా! —"

"సరే! సరే, చిట్టీ!" ఆవేశం అణచుకున్నాను. "అందుకు సమయముంది. అన్నీ చక్కబెట్టుకొని నీ సంగతి చూస్తాను. నువ్వెక్కడికి పోతావిప్పుడు? లే, బిజినెస్ మాట్లాడుకుందాం. నేనెందుకొచ్చానో నీకు తెలుసా?"

"తెలుసు! కానీ నువ్వు వచ్చిన పని మాని ఇతర విషయాలు వాగావంటే —"

"వాగుతాను. ఆ హక్కు నాకుంది. ఉదయం నీ మొగుడు వచ్చి మొత్తుకొని వెళ్ళాడు. దొంగ వస్తున్నాడట మీ కొంపకి....?"

"అవును. కానీ ఆయన్ని అలా పిలవకు నువ్వు!"

"పిలుస్తాను. ఈ మోజులు చావని ముసలి మొగుళ్ళంటే నా కసహ్యం! దొంగ ఎన్నిసార్లు వచ్చాడు?"

"రెండుసార్లు. మొన్న ఆదివారం రాత్రి. మళ్ళీ నిన్న మంగళవారం రాత్రి."

"వాడ్ని చూశావా నువ్వు?"

"చూశాను."

"ఎలా ఉన్నాడు?"

ఆమె అంది అలసటగా, "వాడు నల్లటి ముసుగు వేసుకొని వస్తున్నాడు. బక్కగా పొడుగ్గా ఉన్నాడు. మొదటిసారి వచ్చినపుడు అద్దం పగిలిన శబ్దమైతే లేచి వెళ్ళి చూశాం. అప్పటికే తోటలోంచి పారిపోతున్నాడు. వాడ్ని గూర్ఖా చూశ్ళేదు.

"నిన్న రాత్రి కూడా ఏదో చప్పుడైతే వెళ్ళి చూశాం. అప్పుడు వాడు గోడదూకి పారిపోతున్నాడు.

గూర్ఖా వాణ్ని గమనించలేదు. దాంతో మా వారికి కోపమొచ్చి వాడ్ని తీసేశారు ఈ ఉదయం. నేను పోలీసు రిపోర్టివ్వమన్నాను. కానీ ఆయన వినలేదు. ఇవాళ బొంబే వెళ్తూ మీ డిటెక్టివ్ ఏజెన్సీని కన్సల్టు చేస్తానన్నారు. ఆయన నాలుగు రోజులుదాకా రారు. ఈ నాల్గు రోజులూ ఇద్దరు డిటెక్టివ్‌లు రాత్రులు కాపలా వుంటారన్నారు—"

"నీకు మొగుడంటే ప్రేమేనా నిజంగా?"

"అంటే?"

"నీ మొగుడు నిన్ను బాగా ప్రేమిస్తాడా?"

"నువ్వు....మళ్ళీ ఏమిటా ప్రశ్నలు?"

"ఏమీ లేదు. డబ్బున్నచోట ప్రేమ ఉండదు. ప్రేమ ఉన్నచోట డబ్బు ఉండదు. నీకిక్కడ డబ్బు దాహం బాగానే తీరుతోంది. ప్రేమను బయట ఎక్కడ సంపాదించుకొంటున్నావోనని—"

"మర్యాదగా మాట్లాడకపోతే గెంటేస్తాన్నన్నవత లకి! నువ్వొచ్చిన పనేమిటి? ఏం వాగుతున్నావు? నన్నేమ రనుకున్నావు? ధనవంతుడి భార్యను! నాకు హోదా వుంది, గౌరవముంది!"

"పొరపాటు, చిట్టీ! నా దృష్టిలో నీకవేవీ లేవు. యూ ఆర్ చీప్ ఉమన్, అంతే. కాకపోతే కనపడవు. హై క్లాస్ బిచ్‌వి. నీకంటే ఆ కూటి కోసం కాళ్ళు జాపేవాళ్ళే నయం. వాళ్ళలో నిజాయితీ ఉంటుంది. నువ్వు నీ మొగుడితో నిజాయితీగా ఉంటున్నావా, చెప్పు?"

"నీకెంత ధైర్యం ఇలా మాట్లాడ్డానికి!"

"మనం ఇప్పుడు సేఫ్‌ని చూద్దాం...." అంటూ

బయటికి నడిచాను.

ఆమె నా వెంట వచ్చింది ఆవేశంగా. ఎడమవేపు రెండో గదిలోకి తీసుకెళ్ళి చూపించింది సేఫ్‌ని.

"ఇందులో ఏమేం వున్నాయి, చిట్టీ?" అన్నాను దాన్ని తట్టిచూస్తూ.

"నగలు—అన్నీ నగలే."

"ఎంత విలువ చేస్తాయి?"

"ఏమో, నాకు తెలీదు. అయిదు లక్ష లంటున్నారు కనీసం."

"నువ్వు చూడలేదా వాటిని?"

"అదెప్పుడూ తెరువరు?"

"నీకు చెందవా అవి?"

"తెలీదు. అవి కూతురు పెళ్ళికి చేయించారు."

"కూతురేమైంది మరి?"

"కుసుమ చచ్చిపోయింది."

"పెళ్ళి కాకుండానే?"

"అవును."

"అదేమిటి పాపం?"

"యాక్సిడెంట్ జరిగింది మూడేళ్ళక్రితం — కారు యాక్సిడెంట్."

"బాడ్‌లక్! అప్పుడే పోయిందా తల్లి కూడా?"

"తల్లి విక్కీ పుట్టినప్పుడు పోయింది."

"ఓహ్, ఆ కుర్రాడా? వాడ్నెలా చూసుకొంటున్నావు?"

"బాగానే చూసుకొంటున్నాను...."

"సవతి ప్రేమ నాకు తెలుసులే. గొప్పగా వుంటుంది!"

"మధ్యలో నీకీ విషయాలెందుకు! నువ్వొచ్చిన—"

"ఓ.కే. చిట్టి ఓ.కే...."

"అలా పిలవకు నన్ను!"

"చెడ్డగా తిడతాను లేకపోతే. దొంగకు ఈ నగల గురించి ఎలా తెలిసింది?"

"నాకు తెలీదు."

"రాజు ఎలాటివాడు?"

"వాణ్ణి అనుమానించకు. వాడు నాకంటే ముందు నుంచీ ఇక్కడ వుంటున్నాడు. మంటమనిషి వాడి భార్య. వాళ్ళిద్దరూ అవుట్ హౌస్‌లో వుంటున్నారు."

"నువ్విక్కడకొచ్చి ఎన్నాళ్ళయింది?"

"రెండేళ్ళయింది."

"అంతకుముందు వాలు గేళ్ళు?"

"ఎక్కడెక్కడో తిరిగాను...."

"గుడ్! బరితెగించినదానివి."

"నువ్వు—నీది నోరు కాదు!"

"నువ్వు మనిషివి కాదు!"

"ఓహ్, ఏమంటావు ఇంతకీ?"

"ఇంకెవరొస్తుంటారు కొంపకి?"

"ఎవరూ రారు. ఆయన అందర్నీ ఆఫీసులోనే కలుసుకుంటారు."

"ఆఫీసులో ఉద్యోగులు...."

"వాళ్ళని అనుమానించనవసరం లేదు."

"మొగుడు ఊళ్ళో లేడు, ఆఫీసులో ఎవరు చూస్తారు?"

"శివకుమార్, ఆయన సెక్రటరీ."

"సెక్రటరీ....అతను ఇంటికొస్తాడా ఎప్పుడైనా?"

"ఆయన పిలుస్తేనే వస్తాడు."

"అప్పుడు నువ్వతని కంటపడతావా కావాలని?"
"నోర్ముయ్, నన్నవమానిస్తున్నావు!"
"నీకు మానం వుంటేకదా!" నవ్వాను గట్టిగా, "ఆల్ రైట్, అర్ధరాత్రి వరకు నేనిక్కడే వుంటాను. దొంగ ఏ సమయంలో వస్తున్నాడు?"
"పదకొండూ పన్నెండు మధ్య."
"తలుపులన్నీ జాగ్రత్తగా వేసుకో. నేను బైట ఉంటాను. ఈసారి వస్తే వాడు నాకు చిక్కకుండా పోడు—"
ఆమె మాట్లాడలేదు.

# 3

అమావాస్య రాత్రి. కటిక చీకటిగా వుంది బయట. చేతిగడియారం తొమ్మిది చూపిస్తోంది సమయం. ఒకసారి బంగళా అంతా చుట్టి వచ్చి, అన్నీ సరిచూసుకొని, లాన్‌లో గార్డెన్ చెయిర్ వేసుకొని కూర్చున్నాను.
దొంగకు రావడానికి వెనుక దారిలేదు. వెనుక పెరటి గోడ నానుకొని అవతల మరో బంగళా వుంది. దొంగ వస్తే ముందునుంచే రావాలి గోడదూకి. అలా వస్తే పూలమొక్కల చాటున నేను కనిపించను, కానీ నాకు వాడు కనిపిస్తాడు.
సిగరెట్ వెలిగించుకుని వెనక్కి వాలాను అలసటగా. ఆకాశంలో నక్షత్రాలు కనిపించాయి. గాలి మంద్రంగా వీస్తూ, తోటలో మొక్కల్ని వొయ్యారంగా పిల్ల అలల చందాన వూపుతూ, నిశ్శబ్దంగా సాగిపోయింది పడమర వేపు—
అలా మెరిసే నక్షత్రాల్ని చూడటం నాకేమీ ఆహ్లాదకరంగాలేదు. పావుగంట క్రితం జరిగిన ఘర్షణా,

ఆ రేళ్ళ క్రితం పడ్డ ఆవేదనా ఎంత వద్దనుకున్నా జ్ఞాపకం రాక మానడంలేదు....

లీలావతిని ఆరేళ్ళక్రితం ప్రేమించాను.

ప్రేమించానంటే ఏకపక్ష ప్రేమ కాదు. ఆమే ప్రేమించింది నన్నంతగా. పరస్పరం ప్రేమించు కున్నాం గాఢంగా. కలిసి కలలుగన్నాం జీవితాన్ని. కలిసి నిర్ణయించుకున్నాం భవిష్యత్తుని. కలసి గడిపాం ఎన్నో సాయంవేళలు ఆరుబయట, చేసుకున్నాం బాస లెన్నో ప్రకృతి సాక్షిగా.

ఆ రోజుల్లో నేను ఖమ్మంలో చదువు వెలగబెడు తూండేవాడిని. వాళ్ళ నాన్నకు ఆ వూరు ట్రాన్స్‌ఫరై వచ్చి మా ఎదిరింట్లో దిగారు కుటుంబం మొత్తం. ఆమెకు తల్లి దండ్రులతోపాటు ఇద్దరు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు ఉన్నారు. కాలేజీలో నేను చివరి సంవత్స రంలో వుండగా ఆమె మొదటి సంవత్సరంలో వచ్చి చేరింది. ఎదురెదురిళ్ళే గాబట్టి పరస్పర రాకపోకలతో ప్రారంభమైంది మా పరిచయం. అది కొన్నాళ్ళకే వేగంగా అభివృద్ధి చెంది ప్రేమగా మారింది. మా స్నేహం, సాన్నిహిత్యమూ మా ఇంట్లోనూ, అవతల వాళ్ళింట్లోనూ ఎవరికీ అభ్యంతరముండేది కాదు.

అయితే ఆమె అంతరంగం చిత్రంగా ఉండేది. అది అప్పుడప్పుడు బయటపడుతుండేది. కొద్ది కాలంలోనే నేను ఆమె ఏమిటో తెలుసుకోగలిగాను.

ఆమె కోరికలు గుర్రాలు వంటివి. ఆలోచనలు ఆకా శంలో విహరిస్తుండేవి. ఊర్లోని కార్లని చూసి అలాంటి దొకటి వుండాలంటుంది. మేడలు చూసి వాటిలో

జీవితం అద్భుతమంటుంది. ఖరీదైన వస్త్రాలు చూసి వాటిలో తనని వూహించుకుని మురిసిపోతుంది.

వాస్తవ పరిస్థితుల్ని అసలు గ్రహించదు. అసలు దాని ఉనికిని గుర్తించదు. ఎప్పుడూ స్వప్న లోకాల్లోనే! అలా వెళ్ళకుండా నేను మందలిస్తుండేవాడిని. అప్పుడామె హఠాత్తుగా రెచ్చిపోయేది. అవును, అలాంటి జీవితం మనమెందుకు పొందకూడదు? అందరిలా ఈ మధ్య తరగతి కూపంలోనే ఎందుకు కొట్టుకు చావాలి? నాకా జీవితమే కావాలి! సర్వ భోగాలూ అనుభవించాలి! నాకా సుఖాలు ఇవ్వలేవా? నా ఈ కోరికలు తీర్చలేవా?

ఇలాగే విసురుతుండేది సవాళ్ళు. ఆమెకు ఎలా నచ్చ జెప్పినా వినేదికాదు. అది అసాధ్యమనేవాడిని. అందుకు చాలా కృషి చేయాలనేవాడిని. ఆ కృషి ఏమిటో పట్టుదలతో ఇప్పట్నుంచే ఎందుకు చేయకూడదని నిలదీసేది. నవ్వేవాడిని. ఈ చదువుతోనా! నా చదువు ఎందుకూ పనికిరాదని ఆమెకు తెలుసు. అయినా అదొక ఉన్మాదపు పట్టుదల. అదంతే.

చాలా రోజులాలోచించి చివరకు ఆమెకో నిర్ణయాన్ని తెలిపాను. ఆమె అలా పట్టుబట్టడం, తన కోర్కెలకోసం సాధించడం ఒకందుకు నా మంచికే కదూ? ఆ రకంగా ఆమె నా అభివృద్ధికి దోహదం చేయడంలేదూ? ఆమె ఈ పట్టుదలే లేకపోతే ఈనాడు నేనో మామూలు నాల్గో తరగతి ఉద్యోగిగానే మిగిలి పోయేవాడినేమో——

ఆమె నా నిర్ణయాన్ని హర్షించింది. పూర్తి అంగీకారాన్ని తెలిపి ప్రోత్సహించింది. ఆ వెంటనే నేను ఆమె పెద్దల్నీ, మా పెద్దల్నీ ఒప్పించేశాను.

స్వతంత్రుడిగా నేను నిలదొక్కుకుని సమృద్ధిగా సంపాదిస్తున్నప్పుడే పెళ్ళి. అప్పటికామె చదువు కూడా పూర్తవుతుంది.

ఆ ప్రకారంగా నేను నా చదువు పూర్తయ్యాక బెంగుళూరు ప్రయాణమయ్యాను. ఆ రోజు ఆమెనుంచి వీడ్కోలు తీసుకొంటున్నప్పుడు లోనైన బాధని చెప్పలేను. ఆమె కన్నీటితో వీడ్కోలు చెప్పింది. అవే మా చివరి చూపులవుతాయని నాకప్పుడు తెలియదు—

బెంగుళూరులో ఓ ప్రైవేట్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరి కంప్యూటర్ ప్రోగ్రామింగ్‌లో శిక్షణ పొందసాగాను. నా చదువుకు అదనపు అర్హతలేవైనా తోడయితే అవకాశాలు కొంత మెరుగ్గా ఉండొచ్చు.

కంప్యూటర్ ప్రోగ్రామర్స్‌కి అప్పట్లో విదేశాల్లో మంచి డిమాండు వుండేది. విదేశాలంటే నా ఉద్దేశంలో యూరప్ దేశాలు. కంప్యూటర్‌లో కోబాల్టు ప్రోగ్రామింగ్ అన్ని దేశాల్లోనూ పనికొస్తుంది— ఒక్క సోవియట్ రష్యాలో తప్ప. వాళ్ళకు కంప్యూటర్ భాష వేరే వుంది. అలాంటి ఓ దేశంలో ఉద్యోగం సంపాదిస్తే ఇహ నాకు తిరుగు వుండదు. ఒకవైపు ట్రైనింగు చేస్తూనే మరోవైపు ఉద్యోగాల ఏజెన్సీలని కాంటాక్టు చేయసాగాను. ట్రైనింగు మూడు నెలలే అయినా తిరిగి దాన్ని రిపీట్ చేయసాగాను — నన్ను ఇంటర్వ్యూ చేసేవాళ్ళు దిమ్మెరపోయేలా ప్రిపేర్ అవసాగాను.

ఆ మూడు నెలల్లోనూ లీలనుంచి చాలా ఉత్తరాలు వచ్చాయి. వారానికి రెండు చొప్పున వచ్చేవి. అవన్నీ నాకెంతో ఉత్సాహాన్నిచ్చేవి. ఆమెకు దూరమయ్యానన్న

బాధే కలిగేదికాదు. అలా రోజులు గడిచిపోతున్నాయి. నేను నాల్గో నెల కోర్సు రిపీట్ చేస్తున్నాను, మరో వైపు రెండు ఏజెన్సీలకు అప్లయ్ చేసి వున్నాను, ఇంతలో నా స్వప్న సౌధం కుప్పలా కూలిపోయింది!

మరెన్నడూ నిర్మించుకోలేనంతగా, ఆ శకలాలు ఏరి పేర్చుకోలేనంతగా, ఈ నాటి నా ఈ స్థితికి ప్రతీకగా- లీలనుంచి ఉత్తరం వచ్చింది .... నన్నిక ప్రేమించలేనందామె. రెండేళ్ళ వరకూ నా కోసం ఆగి సుఖాల్ని త్యాగం చేయలేనంది. ఈ క్షణంలో తనని ఇక శాశ్వతంగా మర్చిపొమ్మని వ్రాసింది.

నేను దిమ్మెరపోయాను. ఆ రోజంతా ఏడ్చేశాను దుఃఖంతో. ఇలా చేయడానికి ఆమెకు మనసెలా ఒప్పిందో ఎంత ఆలోచించినా అంతుపట్టలేదు. ఇది నేనూహించనిది. తిరిగి మా ఊరు వెళ్ళి కనుక్కోడానికి ముఖమే చెల్లలేదు. కొన్నాళ్ళకి ఇంటినుంచి ఉత్తరం వచ్చింది జరిగింది తెలియపరుస్తూ. నేను తిరిగి రాస్తూ జరిగిందానికేమీ బాధపడొద్దనీ, నన్నిక మర్చిపొమ్మనీ వ్రాశాను. వారం రోజులు గది కదలకుండా ఏడ్చాను.

అప్పుడు వచ్చింది మాతా తుగా ఒకరోజున అక్కయ్య. జరిగింది వివరంగా చెప్పింది. లీల మా వీధిలోనే ఓ వ్యాపారి కొడుకుతో వెళ్ళిపోయిందట ఎవరికీ చెప్పా పెట్టకుండా. వాడు ఇంట్లోంచి యాభై వేలు తీసుకొని పారిపోయాడట ఆమెతో.

అక్కయ్య నన్ను ఓదార్చి, ఆమెను ఇక మర్చిపొమ్మనీ, మరో మంచి సంబంధం తాను చూస్తాననీ నాకు నచ్చజెప్పబోయింది. కానీ నేను స నే మి రా అన్నాను. లీలలా మరెవర్నీ స్వీకరించలేనన్నాను. దుఃఖం

తన్నుకురాగా మరోసారి ఏడ్చేశాను ఆమె చేతులు పట్టుకొని. అవి అమాయకపు రోజులు. ఈ రోజు ఏడుద్దామన్నా రావడంలేదు ఏడుపు. ఆమె నాకు తల్లిలేని లోటు తీర్చింది. ఆమె పాదాలను తాకి, వీడ్కోలు చెబుతూ, నా గురించి ఇక ఆలోచించవద్దన్నాను. నా బ్రతుకు నేను బ్రతికేస్తానన్నాను.

ఆనాటినుంచీ మళ్ళీ నేను మా ఊరు ముఖం చూడలేదు. కొన్నాళ్ళు బెంగుళూరులో నే కబ్బన్ స్ట్రీట్ లో బన్నులు తింటూ గడిపి, అన్నిటిమీదా ఆసక్తి పోగొట్టుకొని, మిలటరీలో చేరుదామని పోయాను. కానీ వాళ్ళు నాకు పర్సనాలిటీలేదని పొమ్మన్నారు. అప్పుడు కష్టపడి ఒళ్ళు పెంచినా సైన్యంలో చేరే ఆసక్తి కూడా నశించింది.

ఆ తర్వాత అక్కడనుంచి ఈ హైద్రాబాదు కొచ్చేశాను. ఇక్కడో చౌకబారు లాడ్జిలో కూర్చుని క్రింద ట్రాఫిక్ నీ, పైన ఆకాశాన్నీ చూస్తూ కొన్నాళ్ళు కాలక్షేపం చేశాను. భవిష్యత్తు ఏమిటో నేనేం చేయాలో ఆలోచించుకోలేదు. అక్కయ్య ఇచ్చివెళ్ళిన వెయ్యి రూపాయలూ అయిపోవచ్చాయి. అప్పుడొక రోజున పేపర్లో ప్రకటన చూశాను—ఇప్పుడు నేను పనిచేస్తున్న ఏజెన్సీ ప్రకటన. ఆ ప్రకారం నాకదే తగిన వ్యాపకం అనుకొని వెళ్ళి బాస్ ని కలిశాను.

బాస్ నన్ను చూసి సందేహించాడు. కానీ నేను కొన్నాళ్లవరకు అప్రెంటీస్ గాచేసి అతని మన్నన, విశ్వాసం పొందాను. అప్పటినుంచీ ఈ అయిదున్నర సంవత్సరాలూ నేనీ డిటెక్టివ్ వృత్తిలో కొనసాగుతున్నాను—మరో వ్యాపకం, ఆలోచన, ధ్యాసలేకుండా. అయితే ఇందులో వెనకేసుకున్నది ఏమీలేదు. బ్యాంక్

అక్కౌంటూ లేదు. బాస్ ఇచ్చే వెయ్యిరూపాయలూ ఎలా అయిపోతున్నాయో తెలీదు.

కానీ ఒక ధ్యేయం వుంది. ప్రతిజ్ఞ వుంది. నన్ను ధ్వంసం చేసిన లీల ఎప్పటికైనా కన్పిస్తే తగిన శాస్తి చేయాలని, కసిదీరా చంపాలని. ఇప్పుడామె అనూహ్యంగా, కాకతాళీయంగా ఇక్కడ కంటపడింది. ఎక్కడెక్కడ ఎవరెవర్ని వదిలివచ్చిందో, ఇప్పుడీ ముసలాడ్ని పట్టుకుంది. ఈమె అంతు ఎలాటి పక్షంలోనూ చూడకుండా వదలను!

సిగరెట్ పారేసి లేచి నిలబడ్డాను అశాంతిగా. ఆ రాత్రి దొంగ రాలేదు. దిలీప్ డ్యూటీ సమయంలో కూడా రాలేదు.

ఆ రాత్రి లీల గురించి ఆలోచనలో నాకు నిద్ర పట్టలేదు.

## 4

మర్నాడు నేను ఉదయం ఆఫీసుకు వెళ్ళి రిపోర్టు చేస్తున్నాను, ఇంతలో సుడిగాలిలా వచ్చిపడ్డాడు మిస్టర్ ఫటాఫట్ ఇల్లాలి సమేతంగా.

వచ్చీరావడంతోనే ఆ ఇల్లాలు దండకం చదివింది. పూనకం బూనినట్లు కుర్చీలోంచి ఎగిరెగిరి చదివింది. మేం కంగారుపడి చూస్తున్నాం. నాకు హిందీ వచ్చు. బాస్‌కు ఇంకా బాగా వచ్చు. ఆమె దండం అసాంతం ఓపిగ్గా ఆలకించి, అప్పుడన్నాడు నింపాదిగా ఆమె అలసిపోగానే—

"మాతాజీ, మీరు నన్ను తిడుతున్నారా? పొరపాటు చేస్తున్నారు. చాలా తప్పు చేస్తున్నారు. మీరొకటి గ్రహించారా, మాతాజీ. ఇల్లాలి నోరు మంచిదైతే

ఇంట్లో లక్ష్మి నిలుస్తుందట. మీరిలా తిడితే నగలున్నట్రా తిరిగి వస్తాయంటారా? పోయిన వస్తువులు పూజలూ పునస్కారాలవల్ల తిరిగి నిక్షేపంలా పొందవచ్చునని శాస్త్రాలు చెప్తున్నాయి, మాతాజీ, కాబట్టి మీరీ ఆవేశం మాని, ఈ తిట్లు మాని, మాతాజీ, మీ అమూల్య భరణంకోసం వ్రతాలు చేయండి. నోములు నోచండి. అప్పుడు దైవానుగ్రహంవల్ల మీ హారం తప్పక ప్రసాదింపబడుతుంది—"

"సర్! మీ మాటలు జాగ్రత్త, ఆమె మళ్ళీ రెచ్చిపోగలదు!" సుమిత్ర హెచ్చరించింది తెలుగులో.

"డామిట్, ఈ అడవి జింకతో ఇంకెలా మాట్లాడాలి!" కసిరాడు బాస్.

"మిస్టర్ ఫటాఫట్, మీరు నిశ్చింతగా వుండండి. దొంగల్ని వీలయినంత త్వరలో పట్టుకుంటాం. వాళ్ళు ఈ ఊళ్ళో లేరు. ఎక్కడున్నారో వాళ్ళ భార్యాపిల్లలకి కూడా తెలియదు. కానీ నిన్నటివరకు మేం సేకరించిన సమాచారంబట్టి వాళ్ళొక కారును దొంగలించి పారిపోయారు బొంబాయివైపు. వెంటనే నిన్న నేను మా ఇద్దరు మనుషుల్ని పంపాను. వాళ్ళక్కడ ప్రతి హోటల్నీ, లాడ్జింగ్నీ గాలిస్తున్నారు. ఆ కారుని ట్రేస్ చేస్తున్నారు. ఇవాళ సాయంత్రంవరకు ఏ విషయం తెలుస్తుంది. అంతవరకు మీరు ఓపికపట్టండి."

ఫటాఫట్ ఆశాజనకంగా చూసి, ఇల్లాలిని శాంతింపజేసి, సెలవుతీసుకొని సాగిపోయాడు ఆమెతో మరో సంగ్రామానికి.

సుమిత్ర నవ్వసాగింది ముసిముసిగా.

"ఎందుకూ?" అన్నాడు బాస్.

"ఆమె అడవి జింకలా వుందా?" అంది సుమిత్ర.

"ఆమె తిక్క కుదురుతుంది చూడు!" అన్నాడు బాస్ నా వైపు తిరుగుతూ.

"కమల్, దొంగ నిన్న రాలేదని ఇవాళ ఏమరుపాటుగా వుండకు. ఎప్పుడైనా రావచ్చు. రావ్ పోలీసు రిపోర్టివ్వలేదని వాడికి తెలిసే వుంటుంది. కాబట్టి ప్రయత్నం మానుకోడు. నువ్వా సేఫ్‌లో నగలు చూశావా?"

"లేదు సర్, ఆమె చూపించలేదు. నేను అడగలేదు కూడా. ఆమె నన్ను నమ్ముతుందనుకోను. వాటిని చూడటం అవసరమా?"

"నో, అవసరంలేదు. నీ డ్యూటీ నువ్వు జాగ్రత్తగా చెయ్యి, చాలు."

ఆ సాయంత్రం నేను డ్యూటీకి వెళ్ళినపుడు ముభావంగా వున్నాను. బయటే కుర్చీలో కూర్చుని ఇంట్లో మనుషుల చర్యలు గమనించసాగాను. దూరంగా విక్కీ ఫుట్‌బాల్ ఆటలో నిమగ్నుడై వున్నాడు. రాజు తోట పని చేసుకుంటున్నాడు. ఒకటి రెండుసార్లు బయటకొచ్చి లీల నన్ను చూసి వెళ్ళిపోయింది. చీకటిపడేవరకు అలాగే కూర్చున్నాను సిగరెట్లు కాలుస్తూ, ఆలోచిస్తూ.

ఎనిమిది గంటలకి పనిమనిషి నా దగ్గరకొచ్చి, "అమ్మగారు పిలుస్తున్నారు" అంది.

తేరుకొని, "ఎందుకు?" అన్నాను.

"భోజనానికి పిలుస్తున్నారు" అందామె మళ్ళీ.

"రానని చెప్పు!"

"రమ్మని గట్టిగా చెప్పమన్నారు."

"రానని ఇంకా గట్టిగా చెప్పు!" కసిరాను.

ఆమె వెళ్ళిపోయింది గబగబా. నవ్వుకున్నాను

లోలోన. భోజనానికా? ఏమి ఉపాయం! నన్ను మంచి చేసుకోవాలనా ఎత్తు! సాగదు, ఆమె చావు ఖాయం! సమయం చూసి తినిపించనూ ఆమెకు బుల్లెట్లు!

పదినిమిషాల తర్వాత ఆమె బయటకొస్తూ కనిపించింది వేగంగా. ఏ మాత్రం సంకోచం లేకుండా నాముందు కొచ్చి నిలబడింది, చేతులు నలుపుకుంటూ.

"విన్నావా? నిన్ను భోజనానికి రమ్మన్నాను."

తలెత్తి చూశానామె ముఖంలోకి సూటిగా "విన్నాను. అయిడియా బాగుంది."

"అయిడియానా....?"

"నన్ను మంచిచేసుకోడానికి, నీ ప్రాణాలు రక్షించు కోడానికి."

"ఛీఫ్, నీకు పిచ్చిపట్టింది!"

నా వెనుక మొక్కలు గలగలమన్నాయి హఠాత్తుగా. తిరిగి చూశాను చటుక్కున. అవింకా వూగుతూనే వున్నాయి.... గాలికా? చీకట్లో ఇంకేమీ కనిపించలేదు. దొంగగానీ అక్కడ పొంచివున్నాడా అప్పుడే?

"కమల్!" ఆమె అరుపుకి తేరుకొని ఆమెవైపు తిరిగాను.

"ఛిట్టీ, నామీద అధికారమా? నీ ఎత్తులు పారవు, వెళ్ళిపో ఇక్కడ్నుంచి!"

"నువ్వెందుకు భోంచెయ్యవు?"

"మంచి ప్రశ్న. ఇది నిన్నెందుకు అడగలేదు?"

"నిన్న పరిస్థితి వేరు——"

"ఇవ్వాళా అదే పరిస్థితి. నీకు చావు తప్పదు."

"అయితే చంపెయ్యి మరి! చంపెయ్యి ఇప్పుడే! నీ జేబులో రివాల్వర్ వుంది—తీసి కాల్చెయ్యి వెంటనే!"

"పొరపాటు, చిట్టీ అలా కాల్చాను. నీమీద నాకు చాలా కసిగా వుంది. నిన్ను కొన్నాళ్ళపాటు టెన్షన్‌లో వుంచాలి. అప్పుడే నాకు తృప్తి!"

ఆమె అసహనంగా నాముందు కుర్చీలో కూలబడింది.

"నీలో మార్పు కనిపిస్తోంది, చిట్టీ. కొత్తగా అరుస్తున్నావు, చంపెయ్యి చంపెయ్యమని! నిన్నేమో చూస్తాగీస్తా అన్నావు. ఏమిటి సంగతి?"

"ఓహ్, నీకరంగాదు!"

"పశ్చాత్తాపమా?"

"నీ కరంగాదు!"

"పశ్చాత్తాపంలో మరో పదం వుంది చిట్టీ, తెలుసా? తాపం. ఇప్పుడు నీ పశ్చాత్తాపానికి కారణం అది కాదు కదా, పాత ప్రియుణ్ని చూసి? పాపం, ఎంతైనా ముసలి మొగుడు ఫ్లావ్ మాస్టరే కదా!" నవ్వాను గట్టిగా.

"నువ్వు పిచ్చిపిచ్చిగా వాగుతున్నావు!"

"మరి నువ్వేం వాగుతావో వినిపించు!"

"సరే, నేను తప్పుచేశాను, కమల్. ఒప్పుకుంటాను. చాలా తప్పుచేశాను. అయితే నన్ను క్షమించలేవా నువ్వు? నా మీద సానుభూతి లేదా నీకు? నా వయసు అలాంటిదప్పుడు....నిలకడలేని ఆలోచనలు. ఎటుపడితే అటు ఆలోచించేదాన్ని. నీ కోసం రెండేళ్ళు ఎందుకు వృధాచేయాలో నాకరంగాలేదు. శేఖర్ నాకు నీకంటే చాలా మెరుగైన జీవితమే వాగ్దానంచేశాడు. అది అప్పటికప్పుడు అమలు జరుపుతానన్నాడు. మరి నీ కోసం ఎదురుచూస్తూ నే నపురూపంగా భావించుకున్న జీవితంలో రెండేళ్ళు ఎలా వృధాచేసుకోను? నా కోరికల్ని ఎలా

అణచిపెట్టుకోను? అందుకే శేఖర్‌తో వెళ్ళిపోయాను. అతను ఇంట్లోంచి యాభై వేలు పట్టుకొచ్చాడు.

"మేం తిన్నగా బొంబే వెళ్ళిపోయి అక్కడ మూడ్నెల్లు గడిపాం. ఆ మూడు నెలల జీవితాన్నెలా వర్ణించను! కానీ అది మూనాళ్ళ ముచ్చటగానే ముగిసింది. అక్కడ్నుంచి గోవా వెళ్ళడమే మా పతనానికి... శేఖర్ మత్తు పదార్థాలకి అలవాటుపడ్డాడు. అది లేనిదే బ్రతకలేని స్థితికొచ్చాడు. రోజూ కావాలి. అతని బలహీనత, డబ్బూ కనిపెట్టి ముగ్గురు యూరోపియన్‌లు హెరాయిన్ ఇంజక్షన్‌లతో అంతా దోచుకున్నారు. ఎనిమిది నెలల్లోనే డబ్బంతా గుంజేశారు వాళ్ళు. అప్పుడు నా మీద కన్ను వేశారు. ఒక రాత్రి నా కోసం ప్రయత్నిస్తే, వాళ్ళనుంచి తప్పించుకుని పారిపోయాను ఎలాగో బొంబాయికి ..."

"అవును, చూస్తూనే వున్నాను అప్పుడు నీ ముఖంలో ఫీలింగ్స్. చెప్పు!"

"అప్పుడు నా పరిస్థితి ఏమిటో గ్రహించాను. నేనెటువంటి కష్టంలో, పడ్డానో తెలుసుకున్నాను. నాకు దుఃఖం ఆగలేదు! మీరంతా గుర్తొచ్చారు—అమ్మా, నాన్నా, నువ్వూ! ఆ రోజులూ! తిరిగి ఇంటికొచ్చేయాలనుకున్నాను. కానీ ముఖం చెల్లలేదు. అంతవరకు ఇల్లే జ్ఞాపకం రాలేదు. వాళ్ళెక్కడున్నారో తెలియదు ఇప్పటికీ! శేఖర్ విషయం కూడా తెలియదు.

"అప్పుడు నీ దగ్గరకొచ్చేయడమే మార్గమనిపించింది. నీ కాళ్ళమీదపడి క్షమాపణలు చెప్పుకోవాలనుకున్నాను. ప్రాధేయపడాలనుకున్నాను. నీ సానుభూతితో తిరిగి నీదాన్ని కావాలనుకున్నాను. నీలో అంత ఔదార్యం

వుంది. అభాగినుల కథలు విని నువ్వెంత కలతచెందే వాడివి, గుర్తుందా? వాళ్ళకు చేతనైన సహాయం చేయాలని—"

"కానీ నీ విషయం వేరు, చిట్టీ. నువ్వు చేతులారా చేసుకొని అభాగినివి కాలేవు. మూర్ఖురాలివి నువ్వు. నీ మీద నాకెప్పుడూ జాలి కలగదు. నిన్ను క్షమించను. నీ మొగుడితో గొడవ ముగిశాక నీ గట్స్‌లోకి బుల్లెట్ దిగ్గొట్టి పోతాను—"

"సరే, నే చెప్పిందంతా విని నీకెలాతోస్తే అలాగే చెయ్యి! నీ కోసం ఎక్కడ వెతకాలో తెలియలేదు. నువ్వు విదేశాలకి వెళ్ళిపోయుంటావనుకున్నాను. కానీ బెంగుళూరు వెళ్ళి కనుక్కుంటే మీ ఇన్‌స్టిట్యూట్‌లో నువ్వెక్కడున్నావో తెలీదన్నారు. మన ఊరెళ్ళి చూద్దామనుకున్నాను. కానీ నువ్వక్కడుంటావని నమ్మకం కలగ లేదు.

బెంగుళూరులో నే నీమీద ఆశ వదులుకొని సంవత్సరం గడిపాను. ఏవేవో ఉద్యోగాలు చేశాను. ఎప్పుడూ నిన్నే తలచుకున్నాను. మరో రెండేళ్ళు మద్రాసులో వున్నాను. అక్కడా ఉండలేక తర్వాత ఇక్కడ కొచ్చేశాను. ఇక్కడకొచ్చి రెండేళ్ళయింది....ఇన్నేళ్ళూ నిన్ను తలవని క్షణంలేదు, కమల్. అసలు నువ్విక్కడే వున్నావనీ, నిన్నిలా చూస్తాననీ కలలో కూడా అనుకో లేదు. కానీ నిన్ను ఇలాటి పరిస్థితిలో చూస్తాననుకోలేదు. నువ్వీ డిటెక్టివ్వి ఎలా అయ్యావు? విదేశాలకి వెళ్ళలేదా? ఇంకా పెళ్ళి చేసుకోలేదా?"

"పెళ్ళా?" నవ్వాను గట్టిగా, "విదేశాలా? ఏమంటున్నావు చిట్టీ నువ్వు? నన్ను పరిహాసించి నువ్వెళ్ళి

పోయాక నాకు జీవితంమీదే విరక్తిపుట్టింది! ఆడజాతి అంటే అసహ్యం ఏర్పడింది! మీరంతా మోసగత్తెలు. కనిపించే ప్రతి ఆడదాన్ని ద్వేషిస్తూ నేనిలాగే కసి తీర్చుకుంటాను—"

"నీ ఆలోచనలు చాలా అపసవ్యంగా వున్నాయి. నా మాట విని పెళ్ళిచేసుకో, కమల్. మనసు చక్కబడుతుంది."

"నాకు సలహా ఇచ్చే అర్హత కూడా నీకు లేదు. యూ ఆరే చీట్!"

"నువ్విలా ఎందుకయ్యావో అర్థంగావడంలేదు.... మీ వాళ్ళెక్కడున్నారు? ఎలా వుంది మీ అక్కయ్య? ఆమెను ఎంతో ఇష్టపడ్డాను...."

హఠాత్తుగా నా గుండె భారమైంది ఆమె ప్రస్తావనకి. తేలికబర్చుకున్నాను అతి ప్రయత్నంమీద. "చాలా కాలమైంది ఆమెను చూసి.... జ్ఞాపకం వస్తోంది...." అనుకున్నాను నాలో నేను.

"ఆమెను బాధపెట్టావు, నీకు తల్లిలాంటిది."

"మరి నువ్వేంచేశావు మీ వాళ్ళకు? నాకు అక్కయ్య సానుభూతైనా వుంది. మీ వాళ్ళకేముంది నీ మీద— వాళ్ళ ఉసురు తప్ప? చెడబుట్టారు నువ్వూ ఆ శేఖర్ గాడూ మీ కన్నవాళ్ళకు!"

"సరే, నన్నాలాగే తిట్టు! నేనీ హైద్రాబాదుకొచ్చి టైపిస్టు ఉద్యోగానికి ఈయన ఆఫీసుకెళ్ళాను. ఆయన దయచూపి ఉద్యోగమిచ్చారు. ఆయన అప్పటికింకా కోలుకోలేదు కూతురు పోయిన దుఃఖంలోంచి. భార్య ఎప్పుడో పోయింది. అయిదేళ్ళ కొడుకు ఒక్కడే మిగిలాడు. అతన్ని చూసుకొనేవారు లేరు. నేను అడపా

దడపా ఇంటికొచ్చి విక్కీ బాగోగులు చూస్తుండేదాన్ని. ఆయన శ్రద్ధగా గమనిస్తుండేవారు నన్ను. మూడు నెలల్లోనే — ఒక రోజు నన్ను పిలిచి తన ఆలోచన బైటపెట్టేశారు. మొదట్లో నేను భయపడ్డాను. కానీ తర్వాత ఆలోచిస్తే ఆయన అభ్యర్థనను తిరస్కరించలేననిపించింది. ఆయన కష్టాల్లో ఆదుకున్నారు. ఇప్పుడు తనని ఆదుకోమంటున్నారు. ఆయన ఋణం ఇలాగే తీర్చుకోవాలనిపించింది. విక్కీని చూసుకోడానికో మనిషి కావాలి. ఇంట్లో ఆడదిక్కు కావాలి. ఆయన పరిస్థితి కూడా చాలా దయనీయంగా ఉండేది. అంతే, నే నాలోచించకుండా పెళ్ళికి ఒప్పుకున్నాను...."

"ఓహ్, ఎంత జాలి హృదయం నీది! ఎంత త్యాగం చేశావు నువ్వు! దాని వెనుక ఐశ్వర్య దాహం లేదూ?"

ఆమె మాట్లాడలేదు.

నవ్వాను. "వదిలేయ్. మరి శరీర తాపానికే దారులు తొక్కుతున్నావు? ఈ రెండేళ్ళూ ఈ ముసలాడితోనే సరిపెట్టుకున్నానంటే నమ్మను."

ఆమె రెచ్చిపోతూ అరిచింది, "నువ్వు పిచ్చిపిచ్చిగా వాగుతున్నావు! నిన్నిలా వూహించలేదు. నువ్వింత హీనంగా మాట్లాడేస్థితికిలా దిగజారావు?"

"దిగజార్చావు."

ఆమె అసహనంగా లేచి నిలబడింది.

"సరే, భోంచేద్దువుగాని, లే!"

"చెయ్యనన్నాను, చెవుడా?"

"ఎందుకు చెయ్యనంటున్నాను?"

"నేను చంపబోయేవాళ్ళ చేతి అన్నం చచ్చినా ముట్టను!"

"ఎందర్ని చంపావేమిటీ, మొనగాడివి?"

"మళ్ళీ నీలాటి వంచకులబారిని పడలేదు నేను!"

"సరే, ఫోంచెయ్యకపోతే పోనీ, ఒకసారి ఇంట్లోకి రా!"

"ఎందుకు ఇంట్లోకి?"

"సేఫ్ గదికి తాళం పడటంలేదు, వచ్చి చూడు!"

"చూడను."

"ఎందుకు చూడవు?"

"తాళాలు నేనెప్పుడూ బాగుచేయను. చెడిపోతే తీసి అవతల పారేస్తాను."

"ఏదో ఒకటి చెయ్యి వచ్చి! అది నీ బాధ్యత. నువ్విక్కడ కాపలాకోసమే ఉన్నావు!"

"అవును—కుక్క బ్రతుకే నాది!" అరిచాను లేచి గబగబా నడుస్తూ.

"కమల్!" అర్చిందామె వెనుక పరుగెత్తివస్తూ, "నువ్వలా అనుకోకు దయచేసి! నేను వేరే ఉద్దేశంతో అనలేదు! మాట జారాను—"

నేను విన్పించుకోకుండా ఇంట్లోకి వెళ్ళి మేడ మెట్లెక్కసాగాను. సేఫ్ గదిలోకెళ్ళి సిగరెట్ వెలించుకుంటూ ఆవేశం అణచుకున్నాను -- అప్పుడు తోటలో ఒక దృశ్యం నా కంట పడింది—రాజు వేగంగా పరుగెత్తుకు పోతున్నాడు తన అవుట్ హౌస్ కేసి. లోపలికి దూరి కలుపులేసుకున్నాడు హాఠాత్తుగా.

"ఆ రాజుగాడెందుకలా ఉరికాడు ఇంట్లోకి?" అన్నాను ఆమెవైపు తిరిగి.

"అది వాడిల్లు—" అందామె.

"హాఠాత్తుగా తలుపులేసుకున్నాడు. ఏదైనా పట్టు

కళ్ళాడా దాచుకోడానికి?"

"వాడలాంటివాడు కాదు" అందామె మళ్ళీ.

నేను తలుపు దగ్గరికి కదిలి తాళం తిప్పిచూశాను. క్లిక్‌మని లీవర్ బైటికొచ్చింది. వెనక్కి తిప్పి తలుపువేసి లాక్ చేసి హాండిల్ పట్టి లాగాను. రాలేదు. తాళం పడింది. తాళంచెవి ఆమెకిస్తూ కోపంగా చూశాను.

"ఎందుకు అబద్ధమాడావు?" అన్నాను కర్కశంగా.

ఆమె తాళంచెవిని తీసుకుంటూ నా చేతిని తాకింది. వెచ్చగా తగిలాయి వేళ్ళు. అంతే, అవి నా అరచేతిని చుట్టేశాయి బలంగా. వెనక్కి తీసుకోబోయాను వెంటనే, కానీ అప్పటికే ఆమె చేతులు రెండూ నా మెడని చుట్టివేశాయి!

"కమల్! నువ్వు నన్ను రంచేసుకోనూ వద్దు, క్షమించనూ వద్దు! నీ బ్రతుకు నాశనంచేశాను. నాకు శిక్ష కావాలి! ఈ పాపం మోయలేను. నన్ను చంపెయ్యి! నీ చేతుల్లో చచ్చిపోతాను తృప్తిగా! ఎంతో హాయిగా! కానీ ఒక్క కోరిక! ఒకసారి నీ చేతులతో—నన్ను నీ దాన్నిగా చేసుకో ఒక్క రాత్రి! ప్లీజ్ కమల్, ఈ ఒక్క రాత్రి! అప్పుడు నువ్వేం చేసినా భరిస్తాను మనసారా! ముందు ఒక్క రాత్రి నన్ను—ప్లీజ్ కమల్, ప్లీజ్! నన్ను విడిచిపెట్టకు ప్లీజ్...."

ఆమె చేతులు ఇంకా బలంగా బిగుసుకుంటున్నాయి. ఆమె శ్వాస వెచ్చగా తగులుతోంది నా ఛాతీకి. ఆమె పెదవులు నా కంఠంపైనుంచి పైకి పైపైకి ప్రాకుతున్నాయి. ఆమె శరీరం నా నిలువునా వెచ్చగా రాసుకుంటోంది. హఠాత్తుగా తేరుకొని విదుల్చుకో జూశాను. సాధ్యంగాలేదు.

ఆమె శరీర భాగాలు ఇంకా బలంగా నన్ను హత్తుకుంటున్నాయి. ఉన్నట్లుండి నా వొంట్లో సంచలనం బయలుదేరింది. నరాలు జివ్వుమని లాగేస్తున్నాయి. ఇదే తొలి స్త్రీ స్పర్శ! గతంలో లీలను ప్రేమించానుగానీ ఎన్నడూ ఇంత దగ్గర కాలేదు.

ఇక నిగ్రహించుకోవడం నావల్ల కాలేదు! ఆమెను ప్రతిఘటించడం నా తరం కాలేదు! ఇన్నాళ్ళ నా కోపాన్నీ, ద్వేషాన్నీ, బ్రహ్మచర్యాన్నీ తీసి అవతల పారేసి విజృంభించాను—

గంట తర్వాత అడిగిందామె, ఉచ్ఛ్వాసనిశ్వాసలమధ్య బరువుగా.

"ఎలా వుంది, కమల్? ఈ అనుభవం ఎలా వుంది?"

## 5

ఎలా వుంటుంది? ఆ అనుభవంతో నా కసి, ద్వేషం, ప్రతీకార కాంక్షా అన్నీ పటాపంచలై పోయాయి! అంతా గల్లంతై పోయింది! అన్నీ తలకిందులై పోయాయి! జీవితమే చిత్రమైన మలుపు తిరిగింది!

నేను! ఇన్నాళ్ళూ పొగరుగా, మొండిగా బ్రతికొచ్చినవాణ్ని! కోరివచ్చిన కాంతల్ని కాదని దూరంగా విసిరేసినవాణ్ని! ఇప్పుడు ద్వేషిస్తున్న పడతి చేతిలో నే ఇలా చిత్తయిపోవడమా? ఎంత గమ్మత్తు! గాడ్, ఈ ఆడవాళ్ళు ఎంతకైనా సమర్థులే!

అలా ఆమెను నిందించడం ఎందుకు? అసలు ఆత్మవంచన ఎందుకు? నిజాయితీగా నా అంతరంగంలో ఏముందో ఇప్పుడు చూద్దాం.

ఆమె చేతిలో అలా చిత్తయిపోవడం అదొక అద్భుత

మైన అనుభూతిగా లేదూ? కమల్, యూ ఫూల్! నువ్వు నిజం ఒప్పుకో! నీ మేకపోతు గాంభీర్యం ఇక తగదు. ఎంతటివారైనా ఒక్క కనుసైగకు ఎగిరి గంతు వేస్తారు. కాబట్టి నువ్వు నిజం ఒప్పుకోవడానికి నామర్దా ఫీలవకు. ఆమె బిగికౌగిలిలో నువ్వు నలిపోగొట్టుకున్నప్పుడే నీ జీవితాశయానికి తిలోదకాలిచ్చేశావు! ఆమెమీద పగ, ద్వేషం పోసే ప్రేమ, మోహం చోటుచేసుకున్నాయి! అందుకు నిదర్శనంగా ఆ తర్వాత-ఈ మూడు రాత్రులూ ఆమెతో చుక్కల్లో తేలి విహరించావు! అవునా?

అవును, అది నిజం. ఒప్పుకుంటాను. అయితే నేనంత బలహీన మనస్కుణ్ణా? కావచ్చు. కానీ ఈ బల హీనతతో నాకెంత జ్ఞానోదయమైంది! స్త్రీ సాంగత్యంలో ఎంత మాధుర్యముంది! ఎంత ఆనందముంది! ఇన్నాళ్ళూ నేనెంత అవివేకంగా దేన్ని కోల్పోతూ వచ్చానో తలచు కుంటే చాలా విచారం కలుగుతోంది. ఇంతకంటే బుద్ధి తక్కువ పని మరొకటుండదు.

నాలాంటి మూర్ఖులు కనిపిస్తే ఈ సంగతే చెప్తాను. స్త్రీలు ద్వేషించటానికే కాదు, సవ్యంగా అర్థంచేసు కుంటే జీవితాన్ని స్వర్గతుల్యం చేసుకోవడానికే సృష్టించాడు భగవంతుడు. నీకు సరిపడని స్త్రీని విడనాడు. అంతేగాని, ఆమెను ఉదాహరణగా తీసుకొని మిగిలిన వారందరిమీదా అదే అభిప్రాయాన్ని ఏర్పరచుకోకు. తర్వాత చింతిస్తావు.

ఈ యదార్థం నాకాలస్యంగా అవగతమైంది. లేకపోతే నా జీవితంలో మరో స్త్రీ ప్రవేశించి వుండేది. నాకు లీలతోనే రాసిపెట్టివుందేమో. ఆమె నన్నిలా ప్రభావితం చేసింది మళ్ళీ!

ఈ మరపురాని మూడు రాత్రుల అనుభవంతో నేను గుర్తించిన వాస్తవం మరొకటి: లీలను విడిచి బ్రతకలేను. ఆమె నాక్కావాలి. ఆమెను వదిలి వుండలేను. ప్రతి నిమిషం, ప్రతి క్షణమూ ఆమె నాదయిపోవాలి!

అంతే!

ఇప్పుడు ఆమె తప్ప నాకు మరో ధ్యాసలేదు. ఆమె ఆలోచనల్లో, ఊహల్లో ప్రపంచం ఎంతో మనోహరంగా కనిపిస్తోంది. జీవితానికో కొత్త శోభ, తేజస్సు వచ్చినట్లు అనిపిస్తోంది. ఇదివరకటి దరిద్రం వదిలిపోయింది. ఆమె తలంపే నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది....అందుకే నిన్న రాత్రి అలా జరిగింది.

ఎవరనుకున్నారు అలా జరుగుతుందని! గాడ్, ఇదే నా తొలి అపజయం। దొంగను తరిమి పట్టుకోలేకపోయాను. నాకెలా తెలుసు, వాడలా వస్తాడని? రాత్రి మేమిద్దరం బాగా అలసిపోయి ఒకరి బాహువుల్లో ఒకరం వున్నాం, ప్రపంచాన్ని మరచిపోయి. ఇంతలో బయటేదో అలికిడయింది. అకస్మాత్తుగా అదిరిపడి విడిపడ్డాం.

అది దేని చప్పుడో నాకప్పుడు తెలియలేదు. కానీ ఎటునించి వచ్చిందో తెలిసింది. గబుక్కున లేచి కిటికీ దగ్గరికి దూకాను. అప్పుడు కిటికీ తెరచి బైటికి చూసిన నాకు, బాల్కనీలో ప్రక్కగది కిటికీ దగ్గర ఒక ఆకారం కన్పించింది. అది నన్ను చూస్తూనే, నేనింకా తేరుకునే లోపు అంతెత్తు బాల్కనీలోంచి దూకేసి పరుగులంకించుకుంది—

అదే వూపులో నేనూ బాల్కనీలోకొచ్చి కిందకి దూకేశాను మరి ఆలోచించకుండా. కిందపడి నడుము విరిగినట్టయింది! కదల్లేకపోయాను కొన్నిక్షణాలు. అప్పటికే

ఆ ఆకారం ప్రహరీగోడ దూకేస్తోంది. నేను లేచి పరుగెత్తేలోపు, అది వీధిలో ఎక్కడా లేకుండా కను మరుగైంది.

నా భయం, వణుకు ఇంకా పోలేదు. కదుటపడుతూ ఇంట్లోకి తిరిగి వచ్చాను. లీల సేఫ్ గదిలో వుంది. బాల్కనీలో సేఫ్ గది కిటికీలో వుండే పూలకుండీ కిందపడి పగిలివుంది....

దిలీప్ వచ్చినప్పుడు దొంగ ప్రహరీగోడ మాత్రమే దూకాడని చెప్పాను. బాల్కనీ వరకూ వచ్చినట్టు చెప్పలేదు. వాడెలా తప్పించుకున్నాడో కట్టు కథ చెప్పి అక్కడ్నుంచి వచ్చేశాను.

కానీ ఉదయం రిపోర్టిచ్చినప్పుడు బాస్ నన్ను కోప్పడ్డాడు. తిట్టాడు. నా నిర్లక్ష్యానికీ, అలసత్వానికీ సంజాయిషీ అడిగాడు. నేనేవో చెప్పి శాంతపర్చాను. ఈసారి అలా జరగదన్నాను.

యథాలాపంగా నా షర్టు జేబులోంచి నోట్ బుక్ తీసి ఈ ఉదయం నా ఎసైన్ మెంట్స్ చూసుకుంటున్నాను. అప్పుడు నా జేబులోంచి ఏదో రాలిపడినట్లనిపించింది. టేబిల్ మీద చూశాను. అది పూవు. వాడిన మల్లెపువ్వు.

బాస్ దాన్ని చూడనే చూశాడు. చటుక్కున దాన్నందుకుని గుప్పిట బిగించాను. బాస్ కళ్ళలో ఎన్నో అనుమానాలు! ఎన్నో ప్రశ్నలు! కానీ నన్నేమీ అడగ లేదు.

# 6

"సుర్వేనా ఆ నిద్రమబ్బాడి లెక్కెట్టివ్వి?"

జడుసుకున్నాను అతన్ని చూసి. అంతటి భయంగొలిపే మనిషిని నేనెక్కడా చూడలేదు. ప్రతాపరావుని ఇప్పుడే

చూస్తున్నాను.

అతని ఆకారమే వికృతంగా వుంది. ఆ ముఖాన్ని ఒక్కసారి చూస్తే జన్మలో మరిచిపోలేరు. ఆ చింత నిప్పుకళ్ళు, ఆ రాబందు ముక్కు, ఆ పందు కోతినోరు, ఆ నొసతిమీద దట్టంగా గొరిల్లా బొచ్చు—ఒకటేమిటి, అతని శరీరంలో ప్రతి అంగం దేన్నో ఒక జంతువు భాగాన్ని గుర్తుకుతెస్తుంది. శరీర వర్ణం ఎర్రని ఎరుపు.

ఇతని పోలికలు విక్కీకి రాకపోవడం అదృష్టమనాలా? అతనికి తల్లి రూపురేఖలు వచ్చాయి. కానీ—ఈ లీల—ఆమె అతన్నెలా ఇష్టపడింది! ఈ వికృతాకారాన్ని! ఎంత డబ్బుకాశపడ్డా ఇలాటి అందవిహీనుణ్ణి ఎన్నుకుంటుందా!

అతను ఫుల్‌సూట్‌లో ఉన్నాడు. చేతిలో సిగరెట్ వుంది. లాన్ మధ్య ఈజీచెయిర్‌లో కూర్చుని మద్యం సేవిస్తున్నాడు. అతని వెనక అతని సెక్రటరీ శివకుమార్ నిల్చుని వున్నాడు చేతులు కట్టుకొని. అతనికి ముప్పై ఏళ్ళుంటాయి. ముదురు రంగు. అతని కళ్ళు నావైపునుంచి మళ్ళడంలేదు. ఆ చూపులు నాకెందుకో నచ్చలేదు. అలా ఎవరు చూస్తారో నాకు తెలుసు! వీధుల్లో తిరిగే రౌడీలు, క్రూక్స్.

రావ్ గ్లాసులో ద్రవం ఒక్క గుక్కలో పూర్తిచేసి నా వైపు ఉరిమిచూశాడు.

"ఫూల్! దొంగవచ్చి పారిపోతుంటే పట్టుకోకుండా ఏంచేస్తున్నావ్?"

"నేను పట్టుకోవాలనే అనుకున్నాను...."

"మరేం చేస్తున్నావ్?"

"ఆలోచిస్తున్నాను."

"ఏమిటీ!" గొంతు చించుకున్నాడతను, లేచి నిలబడి.

అదిరిపడి తేరుకున్నాన్నప్పుడు. అతను ఒక్క అంగలో నాముందుకొచ్చి అరిచాడు ఉద్రేకంగా. "ఏమన్నావ్? ఆలోచిస్తున్నావా! పరాచికాలాడుతున్నావా నాతో! ఇందుకా మిమ్మల్ని పెట్టుకున్నది? రోజుకు అయిదొంద లిచ్చి మిమ్మల్ని మేపుతున్నది ఇందుకా! దొంగొ నే పట్టుకోకుండా కాలయాపనం చేస్తూ నా డబ్బు తిందా మనుకుంటున్నారా? నీ బాస్ ఇలా చేస్తాడనుకోలేదు! ఇంత ఫ్రాడ్ చేస్తాడనుకోలేదు నేను!"

నేను ధైర్యం తెచ్చుకున్నాను.

"సర్, పొరపాటు నా వల్ల జరిగింది. బాస్‌ని నిందించకండి."

"ఈసారి దొంగను పట్టుకోకపోతే నిన్నూ, నీ బాస్‌నీ కలిపి ఏంచేస్తానో చూడు!"

వెనుక హారన్ శబ్దమైంది. తిరిగిచూశాను చటుక్కున. ఒక కారు లోపలికొచ్చేస్తోంది .... అది బాస్ కారు! ఆశ్చర్యపడ్డాను. రావ్ రెప్పవేయకుండా చూస్తున్నాడు. శివకుమార్ కదిలిముందుకొచ్చాడు.

బాస్ కారు దిగి నవ్వుతూ వచ్చాడు. "హాలో, గుడీవినింగ్ మిస్టర్ రావ్. ఎప్పుడొచ్చారు?"

"మిస్టర్ జగన్‌మోహన్‌రావ్!" గొంతు చించు కున్నాడు ప్రతాపరావు ఎగిరిపడుతూ. "మీరేం చేశారు? మీ రిలాగే చేస్తారా క్లయంట్స్‌ని! మిమ్మల్ని ఇందుకా నమ్మాను! మీరు ఫ్రాడ్ చేస్తున్నట్లు అన్పిస్తోంది. మిమ్మల్ని ప్రాసిక్యూట్ చేసే అవసరం కనిపిస్తోంది!"

బాస్ నావైపో చూపు విసిరి నవ్వాడు. "మిష్టర్ రావ్, మీరు పొరబడుతున్నారు. మా రెప్యుటేషన్

మీకు సరిగా తెలీదనుకుంటాను. ఫ్రాడ్ మా రికార్డులో నే లేదు. మీరే శాంతంగా ఆలోచించండి. అలా దొంగని పట్టుకునే అవకాశాన్ని వదులుకుంటే మీరడనంగా ఇచ్చే ప్రతిఫలం పోతుందిగా? అది పోగొట్టుకుంటామా? ఆలోచించండి. మాకిదొక్కటే కాదు, చాలా గొడవ లుంటాయి. అన్నీ చకచకా ముగించుకుంటూపోతాం. రాత్రి పొరపాటు జరిగింది, ఒప్పుకుంటాను. ఈసారి అలా జరగదని హామీ ఇస్తున్నాను. మీరు విశ్వసించండి...."

"ముందీ నిద్రమబ్బుగాడ్ని తీసేసి మరొకడ్ని పెట్టండి!" అరిచాడు రావ్ నన్ను చూపిస్తూ.

గతుక్కుమన్నాను నేను.

బాస్ నవ్వాడు మళ్ళీ. "నా మోడస్ ఓపరెండిని సందేహించనవసరంలేదు. ఎవరికి ఏ పని కేటాయించాలో నాకు తెలుసు. హి ఈజె ఫర్ ఫెక్టు ఆపరేటర్...."బాస్ కళ్ళు దూరంగా ఎటో మళ్ళాయి. తల తిప్పి అటు చూశాను. లీల విక్కీతో బయటకొస్తూ కన్పించింది.... తిరిగి బాస్‌ని చూశాను. అతని ముఖంలో ఆశ్చర్యం వ్యక్తమవుతోంది.

చటుక్కున రావ్ వైపు తిరిగి అన్నాడు. "కానీ మిష్టర్ రావ్, ఈ దొంగ అలవాటు నాకు చిత్రంగా వుంది. ఇన్నిసార్లు ఎలా ధైర్యంచేస్తున్నాడు? అతడు ఎవరో అయితే ముసుగు ఎందుకు వేసుకుంటున్నాడు? నాకో అనుమానం వుంది....అతడు మీకు తెలిసినవాడని. ఏమంటారు?''

రావ్ ముఖం కోపంతో ఎర్రనయింది. "ఇంపాసిబుల్! పట్టుకోవడం వల్లగాకపోతే వెళ్ళిపోండి! నాకు తెలిసిన

వాడంటూ అనుమానాలు రేకెత్తించకండి! వాళ్ళెవరూ అలాంటివాళ్ళు కాదు!"

శివకుమార్ వెళ్ళి డ్రింక్స్ కలపసాగాడు. రావ్ తిరిగి తన చెయిర్‌లో కూర్చున్నాడు, బాస్‌ని ముందు చెయిర్‌లో కూర్చోమంటూ. నేను మళ్ళీ అటువైపు చూశాను. లీల విక్కీతో ఏదో మాట్లాడి ఇంట్లోకి సాగి పోతోంది. విక్కీ బాల్ పట్టుకొని పరుగెత్తుకొచ్చాడు.

అతడితో నేను ఇరవై నిమిషాలు ఫుట్‌బాల్ ఆడాను. ఈ మూడు నాలుగు రోజుల్లో విక్రాంత్ నాకు బాగా చేరువైపోయాడు. అతనితో ఆడుతూ కావాలని ఓడిపోతుంటే, అతనిలో ఉత్సాహం మరింత పెరిగింది. గర్వంతో నన్ను వెక్కిరించసాగాడు. అతడు నాకేమీ గాకపోయినా అతనిలో ఆత్మవిశ్వాసం పెంచాలని కోరిక కలిగింది నాకు.

శివకుమార్ మా ఆట చూస్తూ నా దగ్గరకొచ్చాడు. అతని చూపులు నాకంత నచ్చడంలేదు. రావ్ ఎంత అనాకారి అయినా అతని మనసులో వికారాలేవీ లేవు. కానీ ఈ క్రూక్ — వీడి మనసులో ఏదో నలుగుతోందనే అన్పిస్తోంది. ఏమిటది?

"మిష్టర్ కమలాకర్" అన్నాడతను అదోలా చూస్తూ వ్యంగ్యంగా, "మీ బాస్ మిమ్మల్ని బాగా పొగుడుతున్నారు....మరి రాత్రి అలా ఎలా ఫ్లాప్ అయ్యారు?"

నాకు మండుకొచ్చింది. తీక్షణంగా చూశాను అతన్ని.

"రాత్రి నేను పోరిని తెచ్చుకొని పాల్లుతున్నాను ఆ చెట్ల క్రింద" అన్నాను కసిగా.

అంతే, అతను బిత్తరపోయి చూశాడు అలా. ముఖం కందగడ్డలా అయింది ఒక్కసారిగా.

బాస్ చప్పట్లుకొట్టి పిల్చాడు నన్ను. నేనక్కడ్నుంచి విక్కీకి షేక్‌హేండ్ ఇచ్చి వెళ్ళాను. బాస్ కారు డోర్ తీస్తూ నన్నెక్కమన్నాడు. అర్థం గాక చూశాను. "కమాన్ నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి బయట!" అన్నాడతను.

ఇంకా తికమకపడుతూ ఎక్కి కూర్చున్నాను. కారు రోడ్డెక్కాక వీధి చివర ఆపి నా ముఖంలోకి సూటిగా చూశాడు. చీకటిపడుతోందప్పుడే. అతని ముఖభావాలు నాకు కనిపించడంలేదు....

"బ్యూటిఫుల్ కదూ?" అన్నాడతను చటుక్కున.

"ఎవరు సర్?"

"ప్రతాపరావ్ భార్య! కమల్, అతనికింత పడుచు భార్య ఉంటుందనుకోలేదు! వాటె బ్యూటీ! ఇప్పుడు నాకు తెలుస్తోంది, రాత్రి ఎందుకు ఫ్లాప్ అయిందో!"

"సర్?"

"రాత్రి నువ్వామెతో లేవూ? రాత్రి మీరిద్దరూ.... కమల్! ఓ గాడ్ నువ్వు నిజం చెప్పు! రాత్రి నువ్వేం చేశావు? ఏం జరిగిందసలు?"

"సర్, నాకేమీ అర్థం గావడంలేదు! నేనేం చేశాను?"

"నీకు తెలుసు, నువ్వేం చెప్పడంలేదు! రాత్రి నువ్వామెతో కలిసి వున్నావు! అందుకే దొంగని పట్టుకోలేకపోయావు! కమల్! నీకెన్నిసార్లు చెప్పాను? ఇలాటి పనులువద్దు! ఆడవాళ్ళతో చాటువ్యవహారా లొద్దు! అందులో ఈ పెళ్ళయిన వాళ్ళతో! ఈ గొప్పింటి పడుచు భార్యలతో! ఓహ్, ఈ సంగతి రావ్‌కి తెలిస్తే! గాడ్, కమల్! నా రెప్యుటేషన్ పాడుచెయ్యకు! దయచేసి,

చచ్చిపోతాను!... ”

“సర్, మీరెలా అంటున్నారో అర్థంగావడంలేదు.”

“ఎలా అంటున్నాను? ఉదయం నీ జేబులోంచి మల్లె పూవు రాలిపడింది. ఎక్కడిది?”

“అది__అది__”

“అదే__ఎక్కడిది? ఎలా వచ్చింది నీ జేబులోకి?”

నేను మాట్లాడలేదు.

“చెప్పు, ఎలా వచ్చింది జేబులోకి? బంగళా ఎదుట మల్లెపందిరి ఏదీలేదు! వెనక పెరట్లో వుండాలి బహుశ. నువ్వు బంగళాముందు వదిలిపెట్టి వెనక మల్లెపందిరి కింద కూర్చున్నావా కాపలా__అది రాలి నీ జేబులో పడిందనడానికి? మాట్లాడు, యూ ఫూల్!”

“రాత్రి నేను మొఘల్ రూముకెళ్ళాను సర్.”

“ఏ__ఏమిటీ! మొగల్ రూమ్‌కా! నువ్వా!”

“అవును సర్, మొదటిసారిగా వెళ్ళాలనిపించింది.”

“షటప్, షటప్ యూ లయర్! నువ్వు మొగల్ రూంకెళ్ళావా? ఐ వోంట్ బిలీవిట్. నువ్వలా చేయలేవు! ఆడవాళ్ళ విషయంలో నేనెంతో నువ్వంతే! మనిద్దరి ట్రాజడీలొక్కటే! జాతకాలొక్కటే! నువ్విలా నమ్మించలేవు నన్ను__”

“నమ్మండి సర్, రాత్రంతా అక్కడే వున్నాను.”

“షటప్, యూ ఫూల్! ఆ స్లట్స్ మల్లెపూలూ, మొహాన బొట్టు కాటుకా పెట్టుకొంటారంటున్నావా! వంటికి జానెడు గుడ్డ పేలికలతో వాళ్ళు వెస్టర్న్ స్‌ని అనుకరిస్తే వరస్టు _ నో, ఐ వోంట్ బిలీవిట్! నువ్వు ఖచ్చితంగా ఫ్యామిలీ ఎఫైర్ నడిపావు! అదీ రావ్ భార్యతో! నువ్విలా బుకాయించలేవు. రాత్రి నువ్వు నీ ఫ్లాట్‌కి

తిరిగివచ్చినట్లు వాచ్‌మన్ చెప్తాడని మర్చిపోకు! నువ్విక్కడ నీడ్యూటీ సమయంలో ఆమెతో కలిసివున్నావు, అందుకే, దొంగను పట్టుకోలేకపోయావు!"

అతన్ని నమ్మించడం ఇక సాధ్యం కాదనిపించింది. తలొంచుకొని చెప్పసాగాను గబగబా.

"అవును సర్. మీరన్నదే నిజం. నేనేం చెయ్యను? ఆమె నన్ను రెచ్చగొట్టింది. ఎలా తిరస్కరించను? ఈ మూడు రాత్రులూ వదల్లేదామె నన్ను. నన్ను క్షమించండి సర్. నేనిక ఆమెకు దూరంగా వుంటాను....ఇప్పుడామె భర్త కూడా వున్నాడు. కలుసుకునే వీలుండదు. ఆమెను మర్చిపోతాను, సర్."

"గుడ్, ఓ.కే, ఇక మర్చిపో! నువ్వు నిజం చెప్పినందుకు సంతోషిస్తున్నాను. నువ్వు మనసు మార్చుకుంటే చెప్పు, మంచి పిల్లని చూసి పెళ్ళిచేస్తాను. సుమన్ పెళ్ళి నేనే జరిపించాను. మీరంతా నా పిల్లలు. మీ బాగే నాక్కావాలి. అర్థమైందా? అడ్డదారులు తొక్కి ఈ సొసైటీ బిచ్‌తో కష్టాలు తెచ్చుకోకు! నిన్ను రక్షించడానికి నేను రానప్పుడు. నీ ఖర్మ నువ్వే అనుభవించాలి!"

## 7

ఈలవేసుకుంటూ తిరుగుతున్నాను తోటలో—

నాకింత హుషారు ఎలా వచ్చిందో తెలీదుగానీ, ఒకవైపు బాస్ హెచ్చరిక నన్ను పీకుతూనే వుంది! నేనతన్ని మోసంచేస్తున్నానన్నది స్పష్టం. నా బలహీనత అలాంటిది. లీలను వదల్లేను. నేను గతంలో ప్రేమించిందీ ఇప్పుడు ప్రేమించకుండా ఉండలేనిదీ ఈ లీల నేనని బాస్‌కేం తెలుసు! లీల అంగీకరిస్తే — నాకా నమ్మక

ముంది_బాస్‌నీ, బంధుజనాన్నీ ఎదిరించి ఆమెతో వెళ్ళి పోతాను దూరంగా ఎటైనా....

బంగళా అప్పుడే అంధాకారమైంది. అంతా నిద్రిస్తున్నారు. ఈ రోజు దొంగ మళ్ళీ సాహసిస్తాడనుకోను, నిన్నటి అనుభవం దృష్ట్యా. ఇప్పుడు కాపలా వుందని తెలుసుకున్నాడు. అయినా ప్రయత్నిస్తాడా? ఏమిటతని తత్వం? నాకు బాస్ మాటలు స్ఫురించాయి వెంటనే. ఒక వేళ—

ఒక వేళ?

శివకుమార్ మెదిలాడు నా కళ్ళముందు క్షణంపాటు- ఆ దరిద్రపు చూపులతో!

"ఉష్....కమల్!"

అదిరిపడి చూశాను. ఎక్కడ్నుంచి వచ్చాయి మాటలు? అంతలోనే గాజుల గలగలలు! నా గుండె జలదరించింది....ఎవరది? చీకట్లోంచి ఆమె వేగంగా, ఈదురుగాలిలా వచ్చి నన్ను ఢీకొంది!

నా వొళ్ళు చల్లబడిపోయింది.

ఆమెను విదుల్చుకో జూశాను. సాధ్యం కాలేదు. నన్ను బలంగా పెనవేసుకుపోయి చెవిలో గుసగుసలాడింది. "రా, డియర్!"

గుబురుగా పెరిగిన పొదల వెనుక అడిగాను, ఆమెను హత్తుకొని వాలిపోయి ఆవేశంగా. "నువ్వు—నువ్వెలా వచ్చావు?"

"మొగుడుగారిని నిద్రపుచ్చి — పాలలో మందు కలిపిచ్చి."

"యూ....!!"

"ఉష్...."నిశ్శబ్దం. "ఈ క్షణాలు వృధా చేయకు."

అప్పుడు నా భయం, బాస్ హెచ్చరికా, మానసిక నిషేధాలూ అన్నీ ఒకేసారి ఎగిరిపోయాయి! నేను తిరిగి నిన్నటి కమల్ నయ్యాను, ఆమె నా ప్రియ కాంత అయింది. సామర్థ్య గాలికి చోటులేకుండా పారి పోయింది.

చాలా సేపటి తర్వాత అందామె నిట్టూర్పులు విడుస్తూ.

"ఓహ్ డియర్! యూ ఆరే మార్వెలస్ లవర్! నీలో ఎంత బలం వుంది! ఈ ఛాతీ! కండలు! ఓహ్, ఇంత బలం దాచుకొని ఎలా ఉన్నావు ఇన్నాళ్ళూ?"

"ఏం చేయమంటావు?" అన్నాను ఆమె గుండెలమీద సున్నాలు చుడుతూ, "ఇంత బలం వుందని ఊరుమీద పడమంటావా?"

ఆమె పెదవులు చటుక్కున నా నోరు మూశాయి. "ఓహ్ డియర్, నువ్వలా మాట్లాడకు! బలం వున్న వాళ్ళెప్పుడూ బయటపడరు. లేనివాళ్ళే తమలోని ఇన్ ఫీరియారిటీని పారద్రోలటానికి అలా తిరుగుతుంటారు. అశ్లీల సాహిత్యాన్ని సృష్టిస్తారు. నీలాటివాళ్ళు మనసుకు నచ్చిన మనిషి ఒక్కర్ని ఎన్నుకొని జీవితాన్ని పండుగ చేసుకుంటారు."

"నిన్ను ఎన్నుకొని దండగ చేసుకున్నాను."

"అలా అనకు, నేనిప్పుడు నీదాన్నే."

"నాకు తృప్తిగా లేదు. యూ ఆరే సెకండ్ హాండ్."

"కమల్, ప్లీజ్, నువ్వలా మాట్లాడకు దయచేసి! నీ నోటినుంచి మంచి మాటలు వినాలి."

"నువ్వు మంచిదానివి కాదు."

"అవును కాదు. అయితే నేను నీక్కావాలా వద్దా?"

ఆమెని హత్తుకున్నాను బలంగా. "నువ్వు నాక్కావాలి! నిన్ను విడిచి వుండలేను, లీలా! నువ్వు లేకుండా బ్రతకలేను! నువ్వు నాతో వచ్చేయకూడదా?"

"ఎక్కడికి?"

"ఎక్కడైనా పారిపోదాం దూరంగా!"

ఆమె ఫక్కున నవ్వింది.

"ఏమిటి?"

"నీ దగ్గరేముందని రావాలి నేను?"

"అంటే.... నీకు డబ్బు కావాలి. అంతేనా? నేను సంపాదిస్తాను—"

ఆమె మళ్ళీ ఫక్కుమంది.

"నమ్మవా?"

"ఊహుఁ.... నువ్వంత సంపాయించలేవు."

"మరేం చేయమంటావు?"

"మళ్ళీ మొదటికే వచ్చాం.... ఆరేళ్ళ క్రితం ఇదే సమస్య వచ్చింది.... ఒక పని చెయ్యి!"

"ఏమిటి?"

"ఆ దొంగవి నువ్వేకా!"

"అంటే?"

"ఆ సేఫ్‌లో నగలు నువ్వే దోచుకో పిచ్చి మొహమా, పారిపోదాం!"

కిలకిలా నవ్వసాగిందామె. గబుక్కున నోరుమూశాను.

"షటవ్!"

"సరే, మనమిలాగే కలుసుకుందాం రోజూ! ఏమైందిప్పుడు?"

ఉలిక్కిపడి టైము చూసుకున్నాను. దిలీప్ వచ్చే సమయం అవుతోంది. ఆ సంగతి ఆమెకు గుర్తుచేసి లేచి

నిలబడ్డాను. ఆమె కూడా లేచింది.

"శీలా, నాకో విషయం చెప్పు" అన్నాను సూటిగా చూస్తూ.

"ఏమిటి?"

"ఆ శివకుమార్ ఎలాటివాడు?"

ఆమె కలవరంగా చూసింది. "ఎందుకు? ఏం జరిగింది?"

"ఏమీ లేదు. ఆ బాస్టర్డు నాకు నచ్చలేదు. ఆ చూపులు—గమనించావా?"

"నేనతన్ని పట్టించుకోను!"

"దొంగ అతని ఎత్తులో, అతని వాపులో నే వుంటాడు కదూ?"

"ఏమిటి నువ్వనేది?"

"అతన్ని కనిపెట్టాలనుకుంటున్నాను."

"నీకు మతిపోయింది! అతను నమ్మకస్తుడు!"

"ఎందుకతన్ని సమర్థిస్తున్నావు? చిన్నపిల్లలు కూడా అతన్ని అసహ్యించుకుంటారు."

"నువ్వు పిచ్చిగా మాట్లాడుతున్నావు!" ఆమె హఠాత్తుగా వెనుదిరిగి బంగళాకేసి ఉరకసాగింది....

నేనలాగే చూస్తూండిపోయాను ఆమె వైపు.

## 8

మర్నాడు నేను ఉదయం ఆఫీసుకు వెళ్ళేసరికి అక్కడ సిద్ధమై వున్నారు, భోయారామ్ ఫటాఫట్ దంపతులు.

"మాతాజీ" బాస్ అంటున్నాడు, "మీకో శుభవార్త! దైవానుగ్రహం వలన మీ హారం పూనాలో క్షేమంగా లభ్యమైనట్లు వర్తమానం అందింది, నిన్న

అర్థరాత్రి దాటి అయిదు నిమిషాలకు. పోలీసులు ఆ ముష్కరులను నిర్బంధం గావించారు. దేవుడు మీకు మేలుచేశాడు, మాతాజీ. మళ్ళెప్పుడూ మీరిలా బయటి కెళ్ళకండి. వెళ్తే ఆభరణాలు ధరించకండి. ధరిస్తే మీ సేట్‌జీతో వెళ్ళకండి. ఈసారి సేట్‌జీ మీ ఆభరణాలు పోనివ్వరాదన్న దృష్టితో, పరాక్రమంతో, విజయ వంతంగా వాటిని స్వాధీనపరచుకొని, మిమ్మల్ని పరాధీనంగా చేసి వేసే ప్రమాదముంది—"

సుమిత్ర ఫక్కుమంది.

మిసెస్ ఫటాఫట్ ఉరిమి చూసిందామె వైపు.

సుమిత్ర అక్కడ్నుంచి పరుగెత్తుకొని పోయి, వెనుక గదిలో తలుపువేసుకొని నవ్వసాగింది.

బాస్ అంటున్నాడు. "మిస్టర్ ఫటాఫట్, ఇట్స్ వెరీ సింపుల్. ఆ దొంగలు పూనా వెళ్ళి అక్కడ ఓ బట్టల వ్యాపారికి ఆ నగను అమ్మజూపారు. బొంబేలో వాళ్ళని ట్రేస్ చేస్తున్న మా మనుషులు చెప్పారు, రాత్రి ఫోన్ చేసి. వాళ్ళు రొటీన్‌గా పోలీస్ ఇన్ఫర్మేషన్ కోసం వెళ్తే ఇది తెలిసింది. నిన్న సాయంత్రం ఆ వ్యాపారికి ఆ నగను బేరంపెట్టారు దొంగలు. ఆ వ్యాపారి వెంటనే దాన్ని గుర్తుపట్టి, తెలివిగా ఫోన్ చేసి వాళ్ళని పోలీసులకు పట్టించేశాడు — నగ తన వశం చేసుకొని. ఆ దొంగలు నేరం ఒప్పుకోవడంలేదు. కానీ, ఆ వ్యాపారి ఆ నగ ఎవరిదో తనకు తెలుసునంటున్నాడు. అది—అది—హైద్రాబాదులో తన అత్తగారిదని—వికటాట్టహాసం చేశాడట."

ఫటాఫట్ అదిరిపడ్డాడు, "ఏమిటేమిటీ! పూనాలో బట్టల వ్యాపారియా అతను? పేరేమిటి?"

"పేరు.... ఆగండి చెప్తాను, భూకాచంద్."

మిసెస్ ఘటాఫట్ దిక్కులదిరే కేక పెట్టి ఎగిరి నిల్చుంది.

"ముంచారు! నన్ను నిండా ముంచేశారు దేవుడోయ్! వాడెవరనుకున్నారు? ఆ భూకాచంద్ — ఆ భూతంగా డెవరనుకున్నారు? వాడే మా అల్లుడు! మాకు యముడు! ఓ యమ్మోయ్ నా హారం! నా ముద్దుల హారం వాడి పరమైపోయిందా దేవుడా! దానికోసం వాడెన్ని ఎత్తులు వేశాడమ్మా! ఎంత ప్రాణాలు తీశాడమ్మా! మొన్న పండక్కి వచ్చినప్పుడు దాన్ని నా మెళ్ళో చూసి పెళ్ళానికి పెట్టితీగాలని ఎంత అల్లరిచేశాడమ్మా! ససేమిరా అంటే ఎన్ని సవాళ్ళు విసిరాడమ్మా! దాన్నెలాగైనా రాబట్టుకొంటానన్నాడు కోతి! పదేళ్ళయింది పెళ్ళయి, సిగ్గుండొద్దూ? ఎప్పుడూ ఆకలిమీదుంటాడు! అమ్మోయ్, చివరి కిలా కొట్టేశాడా! అదిప్పుడు నా చేతికొచ్చేనా! దీనికి కారణం మీరు! ఆ దొంగల్ని పట్టుకోలేక వాడి దాకా పంపారు! మీరు మోసం! మీ కంపెనీ దగా! మిమ్మల్ని — మిమ్మల్ని — మీ బల్లలు విరగ్గొట్టేస్తాను! మీ పుస్తకాలు చింపేస్తాను! మీ ఆఫీసు తగుల బెట్టేస్తాను—"

"మాతాజీ!" బాస్ కేక పెట్టాడు, "ఆపండి! మీ అరుపులు ఆపండి! మీ కుటుంబ గొడవలతో మాకు సంబంధం లేదు! సేట్ జీ, మీరు వెంటనే మీ సహధర్మ చారిణిని తీసుకుని చెక్కేయండి బైటికి!"

ఘటాఫట్ జీవితంలో మొదటిసారి లేచివుంటాడు అలా — చిరుతలా ఇల్లాలిమీద విరుచుకుపడి, ఒక్క

ఘర్జన చేసి, రెక్కపుచ్చుకు లాక్కెళ్ళాడు అవతలకి.

సుమిత్ర ముఖం తుడుచుకుంటూ వచ్చి గాభరాగా చూస్తోంది.

బాస్ తలపట్టుకొని పేపరు విసురుకుంటున్నాడు.

ఇంతలో బైట పొలికేక వినిపించింది హఠాత్తుగా-

అదిరిపడి ఊరికాను డోర్ తీసుకుని. రమణి మరోసారి కెవ్వుమంది. మిసెస్ ఫటాఫట్ ఆమె జుట్టూ బట్టలూ పట్టి లాగేస్తోంది. వొళ్ళు రక్కేస్తోంది. రమణి వీలు చిక్కినప్పుడల్లా నోరారా కెవ్వుమంటూ గింజుకుంటోంది. తన్నుకుంటోంది. మిసెస్ ఫటాఫట్ కసికసిగా, కలివిడిగా, విడివిడిగా జుట్టు పీకి, బట్టలు చింపి, తృప్తి చెందక కౌంటర్ వెనుకనుంచి అమాంతం ఇవతలకి ఈడ్చి కింద ఎత్తి పడేసి వెళ్ళిపోయింది—

అప్పుడే జలీక్ వచ్చిపడ్డాడు బయటనుంచి. అక్కడి దృశ్యం చూసి కంగారుపడ్డాడు. కలవరపడ్డాడు. తేరుకొని పకపకా నవ్వాడు. "అహా! ఓ నా స్వప్న సుందరీ! ఏమి ఈ రసమ్పాదయూతిరేక విన్యాసమూ— నా జన్మ ధన్యము!" అన్నాడు వంగి వంగి సలాము చేస్తూ.

అతను నడుము వూపినతీరు నాకు నవ్వు తెప్పించింది.

"షటప్!" అరిచాడు బాస్ వెనుకనుంచి, "రమణీ, నువ్వు లేచిపో! ఇంటికెళ్ళిపో!"

రమణి ఆయాసపడుతూ లేచి, చెల్లాచెదురైన తన మేకప్ శకలాలు ఏరుకోసాగింది.

"ఐ మస్టు నూ దట్ ఓల్డు కా!" అరిచాడు బాస్ కోపంతో ఊగిపోతూ.

పావు గంటలో తుపాను పూర్తిగా వెలిసింది....

నేనూ, దిలీప్ బాస్ ఎదురుగా కూర్చున్నాం.

బాస్ అంటున్నాడు. "శివకుమార్ గురించి నేను రావ్‌తో మాట్లాడాను. అతను కోపంతో ఊగిపోయాడు. దొంగను పట్టుకోవడం చేతగాకపోతే ఊరుకోమన్నాడు. తనవాళ్ళని అనుమానిస్తే ఊరుకోనన్నాడు. శివకుమార్ పట్ల అతని నమ్మకాన్ని మనమెలా కాదనగలం?"

"అతనిమీద నిఘా పెట్టి చూద్దాం—" దిలీప్ సూచించాడు.

"మనకెందుకా తీట! దొంగవస్తే నే మనం పట్టుకునేది. వాడికోసం వెతుక్కుంటూ పొమ్మని లేదు ఒప్పందం. శివకుమార్ గురించి మనం హెచ్చరించాం. అతనే దొంగయితే మరో ప్రయత్నంలో పట్టుబడవచ్చు. అప్పుడు ఎవరి నమ్మకాలేమిటో తెలుస్తాయి!" అన్నాడు బాస్.

(మిగతా వచ్చే సంచికలో)

సీరియ




(గత సంచిక తరువాయి)

"నన్ను మన్నించండి. నేను చాలా నిర్మో
మాటంగా వ్యవహరిస్తూ ఆఖరికి మీ డైరీలు కూ
చూశాను. నేను చెప్పిన రోజు రాత్రిపన్నెండు గంట

ఓ. దుష్ట శక్తి తయారయింది. అదీ ధర్మాసుపత్రిలో! ఆ తర్వాత అదేమయిందో తెలియలేదు. అది చూడ్డానికి మనిషిలాగే వున్నా దానికి అపూర్వ శక్తులున్నాయి. దాన్ని అరికట్టడం మాకు తప్ప ఇంకెవ్వరికీ సాధ్యంకాదు. దాన్ని వెతుకుతూ బయల్దేరాం. అప్పుడే అది నగరంలో తన మహిమలు ప్రదర్శించడం ఆరంభించింది. మీ చేష్ట కూడా దాని ప్రభావమేనని నా అనుమానం. ఏది ఏమైనా మీకే అచూకీ లభించినా నాకు తెలియ జేయండి—" అంటూ మహాదేవుడక్కడ తన చిరు నామాను వదిలిపెట్టి—"ఇఫ్ యూ డోంట్ మైండ్— మీ ఫోటో ఒకటి యివ్వగలరా?" అనడిగాడు రాగిణిని.

రాగిణి నిరభ్యంతరంగా తన ఫోటోనిచ్చి—"మా అక్కా వాళ్ళ ఆల్బంలో నా ఫోటో ఉండడం మీ అదృష్టం—" అంది. అంతా అక్కణ్నించి బైటకు వచ్చేశారు.

అప్పుడు మహాదేవుడు లింగంతో — "ఈ ఫోటో తీసుకొని నువ్వు రంగారావ్ అండ్ సన్స్ బట్టలషాపుకీ, ఆ టైలరింగ్ షాపుకీ వెళ్ళు. వాళ్ళెవరైనా గుర్తుపట్ట గలరేమో చూడు—" అన్నాడు.

"సార్! నేను బాగా గుర్తుపట్టాను. ఆ రోజు మనం బ్రతికించిన శవం ఈమె కాదు—" అన్నాడు లింగం.

"అది సరే—కానీ అనుమానాల్ని ఆదిలోనే తుడిచి పెట్టగల అవకాశముంటే విషయాన్ని ఊహాకు వదిలి పెట్టడమెందుకు?" అన్నాడు మహాదేవుడు.

"మరి మీరిప్పుడేం చేస్తారు?"

"సేఠ్ రతన్‌లాల్ ఇంటికి వెడతాం—" అన్నాడు మహాదేవుడు.

"రండి—కూర్చోండి—" అన్నాడు సేఠ్ రతన్ లాల్. అతడి నుదుట ఎర్రని కుంకుమ ప్రకాశిస్తోంది.

"వీరెవరు?" అన్నాడు మహాదేవుడు అక్కడ వున్న ఒక యువకుణ్ణీ, నడివయస్కురాలినీ చూసి.

"వీరు నా ప్రాణదాతలు—" అన్నాడు రతన్ లాల్.

యువకుడి పేరు మధు. నడివయస్కురాలు మధు తల్లి. ఆమె బైరాగి చెప్పిన పద్ధతిలో రతన్ లాల్ కు కూడా తాయెత్తు కట్టించగా అతడికి కూడా ఒక్కసారిగా ఎంతో ప్రశాంతత కలిగినట్లనిపించింది. మధుకు లాగే అతడు కూడా గతం మరిచిపోయాడు.

మధు తల్లి వకుళ గురించి ఇచ్చిన సమాచారం ఆధారంగా మహాదేవుడికి కొంత క్లూ లభించింది. తర్వాత ఆయన, అన్న కలిసి వకుళ ఇంటికి వెళ్ళారు. అక్కడ వకుళ ఫోటో చూశాక అన్ని సందేహాలూ తీరిపోయాయి. ఆ క్షణంలో మహాదేవుడికి కలిగిన థ్రిల్ ఇంతా అంతా కాదు. తెలిసో తెలియకో తను చేసిన ప్రయోగం ఒక దుష్టశక్తిని తయారు చేసింది. ఆ శక్తి అప్పుడే విజృంభించి అల్లకల్లోలాన్ని సృష్టించింది. ఆ సాయంత్రానికి నరసింహారావు ద్వారా మొత్తం వకుళకు సంబంధించిన వివరాలన్నీ లభించాయి.

మహాదేవుడు, లింగం, శివశంకరం ఈ విషయం చాలాసేపు చర్చించారు.

"ఆ బైరాగి ఎవడో కానీ—మహా మహిమాన్వితుడైన పురుషుడైనా అయుండాలి. లేదా శక్త్యోపాఖ్యానంలోని మంచి శక్తికి ప్రతిరూపమై ఉండాలి. ఆయన కారణంగా వకుళ బయటపడింది. ఆమె ఆట కట్టింది. అయితే

ఆమె నాశనం కాలేదు. రానున్న ప్రమాదాన్ని ముందే పసికట్టి ఎక్కడికో పారిపోయింది. అయితే వకుళ ఊరికే కూర్చోదు. దౌర్జన్యం కొనసాగిస్తూనే వుంటుంది—" అన్నాడు శివశంకరం.

"అది కాదన్నయ్యా—ఈ శక్త్యుపాఖ్యానంలో దుష్ట శక్తి గురించి చెప్పినవన్నీ నిజమే అయ్యాయి. ఇప్పుడు దుష్ట శక్తి గురించి మన ప్రయోగం విశేషాలన్నీ చెప్పి ప్రజలను హెచ్చరించడం అవసరమేమో—" అన్నాడు మహాదేవుడు సాలోచనగా.

"ఇందులో ఒక నష్టముంది. శవాన్ని దుష్ట శక్తిగా మార్చే అవకాశమున్నదని తెలిస్తే సమాజంలోని మానవ దుష్టశక్తుల దృష్టి మనమీద పడుతుంది. మనం తయారు చేసిన మందు గురించి ఏ మాత్రం బైటపడినా ప్రపంచం దుష్టశక్తులతో నిండిపోతుంది. ముందు మన ప్రాణాలకే ప్రమాదం వాటిల్లుతుంది—" అన్నాడు లింగం.

అది నిజమే! ఈ పరిశోధన గురించి ఏ మాత్రం బైటపడినా ప్రమాదమే! అంతమాత్రాన ఉపేక్షిస్తే ఎలా? దుష్ట శక్తి గురించి ప్రజలను హెచ్చరించడం అవసరం. బైరాగి ఇచ్చిన కుంకం గురించీ, దాని ప్రభావం గురించీ, అదెక్కడ లభించేదీ — అందరికీ తెలియాలి. లేకపోతే దుష్ట శక్తి స్వేచ్ఛా విహారం చేస్తుంది.

ముగ్గురూ చాలాసేపు చర్చలు జరిపాక ఈ వార్తను నరో త్తమరావుకి అందించదలచారు. దుష్ట శక్తి గురించీ, దాని లక్షణాల గురించీ—దానిబారినుంచి తప్పించుకునే కుంకుమ ఉపాయం గురించీ మాత్రం చెప్పి తమ పరిశోధన గురించి మినహాయించాలనుకున్నారు. ఈ సందర్భంలో

ఎట్టి పరిస్థితుల్లోనూ తను పేరు బయటపెట్టవద్దని వారు నర్సోత్తమరావుని కోరదలిచారు.

ఈ ఉపాయం ముగ్గురికీ నచ్చింది. మహదేవుడు నర్సోత్తమరావుకి ఫోన్ చేసి వివరాలు చెప్పాడు. ఆయన చెప్పిన షరతులన్నింటికీ నర్సోత్తమరావు అంగీకరించి—

"ఇది చాలా చిత్రమైన కథ! ప్రత్యక్ష దైవాల్లాగ—ప్రత్యక్ష దెయ్యాలు కూడా తయారౌతున్నాయన్నమాట. పరిశోధనలో నేనప్పుడే చాలా దూరం వెళ్ళాను. వకుళ అనే అమ్మాయి మొత్తంమీద చాలా భీభత్సం సృష్టించింది. నేను చెప్పిన టైలరింగ్ షాపు, బట్టల షాపు విశేషాలు ఆ అమ్మాయివల్లనే జరిగాయి. ఫోటో చూసి వాళ్ళు గుర్తుపట్టారు. ఆమె గురించి తెలిసిన ఇంకో విషయమేమిటంటే—ఆమె శరీరం మంచుకన్న చల్లగా ఉంటుందట. ఆమె నవ్వు నెమ్మదిగా, భయంకరంగా ఉంటుందట. మనుషుల మధ్య దెయ్యం మానవరూపంలో తిరగడం చాలా పెద్ద విచిత్రమే! ఆ వకుళ ఉనికి తెలుసుకోగలిగితే మనం దెయ్యాలు — స్వభావాలు గురించి రీసెర్చి కూడా ప్రారంభించవచ్చు—" అన్నాడు.

ఆ పనయ్యాక ముగ్గురూ కలిసి సదానంద విరచిత శర్త్యోపాఖ్యానాన్ని మళ్ళీ మళ్ళీ చదవసాగారు.

## 29

"మధూ!"

చెవుల దగ్గర గుసగుసలాడుతున్నట్లుగా, గాలిలో తేలిపోతున్నట్లుగా పిలుపు.

మధు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూశాడు. కిటికీకి అవతల వకుళ నిలబడివుంది.

"వకుళా!" అన్నాడతను అప్రయత్నంగా.

"ఒక్కసారి బైటకురా మధూ-నీతో మాట్లాడాలి!" అంది వకుళ.

మధు చటుక్కున మంచంమీంచి లేచాడు. అప్పుడతనికి ఉదయం జరిగిన తతంగమంతా గుర్తుకొచ్చింది. ఈ వకుళ పిశాచమని అంతా అంటున్నారు. ఈ పిశాచం కొంతకాలం తన్ను పీడించిందని తల్లి అంటోంది. అయితే తనకేమీ గుర్తులేదు. నిజంగా ఈ వకుళ పిశాచమా? పిశాచమే అయితే ఎలాగయింది? అసలు పిశాచాలనేవి ఉన్నాయా?

ఆమె పిశాచమైనా కాకపోయినా తనకేమీ భయం లేదు. తన వంటిపైన తాయెత్తు ఉన్నంతవరకూ ఏమీ భయంలేదు. ఈ వకుళ విశేషమేమిటో తెలుసుకోవాలి?

మధు గదిలోంచి బయటకు వచ్చాడు. అక్కణ్నించి నెమ్మదిగా వకుళ ఉన్నచోటుకి వెళ్ళాడు. అతణ్ని చూసి ఒకొక్కడుగే వెనక్కు వేస్తూ "రా మధూ! నీ కోసమే ఎదురుచూస్తున్నాను మధూ!" అంటూ గుసగుసలాడినట్లుగానే మాట్లాడింది వకుళ.

"నీ కోసమే వస్తున్నాను వకుళా — ఎందుకలా వెనక్కు వెనక్కు వెళ్ళతావు?" అంటూ మధు ఆమెను సమీపించసాగాడు. అతను వకుళనే పరీక్షగా చూస్తున్నాడు. నిండు యవ్వనంలో ఉందామె. చక్కటి అవయవ పరిపుష్టి. తెల్లని చీర తెల్లని రవిక. జాట్టు విరబోసుకొని — సినిమా దెయ్యంలాగున్నది. ఆమె పిశాచమేనా? పిశాచమే అయితే ఈ సమయంలో ఈ వేషంలో వస్తే అందరికీ తెలిసిపోతుందని తెలిసి కూడా ఇలాగే ఎందుకొచ్చింది? లేదా పిశాచాలీవేషం తప్ప ధరించలేవా?

"రా మధూ!" అంటూనే ఆమె వెనకడుగు వేస్తున్నది. అలా ఇద్దరూ ఒక చెట్టుక్రిందకు వెళ్ళారు. అది మధు ఇంటి పెరట్లోని వేపచెట్టు.

మధు త్వరత్వరగా అడుగులువేసి—"ఒక్కసారి నా కౌగిట్లోకి రా వకుళా!" అంటూ చేతులు చాపి ఆమెను అందుకోబోయాడు. అంతే! ఆమె కీచుమంటూ వికృతంగా అరిచి చెట్టుమీదకు ఎగిరింది.

ఆ దృశ్యం చూస్తే ఎలాంటివాడికైనా గుండెలవిసి పోవలసిందే—కానీ తాయెత్తు మహిమవల్లనో ఏమో అతడికంతగా భయంవేయలేదు. ఎట్టొచ్చీ ఆమె పిశాచమేనన్న విషయం అతడికి రూఢి అయింది.

"ఎందుకలా పైకి వెళ్ళిపోతావు వకుళా? నా కౌగిలిలోకి రావా, రాలేవా?" అన్నాడు మధు ఆమె వైపే చూస్తూ.

"వస్తాను మధూ! కానీ నీ చేతికి ఓ తాయెత్తు కట్టి వుంది. అందువల్ల నేను నిన్ను తాకలేకపోతున్నాను. అది తీసేశావంటే మనిద్దరం హాయిగా కలిసివుండొచ్చు. ఇన్నాళ్ళూ నువ్వు నాకెంత సాయం చేశావు? నువ్వు లేకపోతే నాకు రక్తం తెచ్చిపెట్టేవాళ్ళెవరు?" అంది వకుళ.

"రక్తం లేకపోతే నువ్వుండలేవా?" అన్నాడు మధు.

"రోజుకి రెండు ఔన్సుల రక్తం చాలు నాకు. కానీ ఎవరు తెచ్చిస్తారు? నువ్వు నాకు రోజూ హాస్పిటల్ నించి తెచ్చి ఇచ్చేవాడివి. నువ్వు తేలేక పోవడంవల్ల నేనీరోజునించీ రోజుకో మనిషి రక్తంపీల్చి బ్రతకాలి. అందుకే అడుగుతున్నాను. ఆ తాయెత్తు

తీసెయ్—" అంది వకుళ.

"తాయెత్తు తీయను. కానీ నాకు నువ్వు కావాలి...." అంటూ మధు వేపచెట్టు ఎక్కసాగాడు.

వకుళ మళ్ళీ వికృతంగా అరిచి మరి కాస్త పైకి ఎగిరి "నేను వెడుతున్నాను మధూ! కానీ నిన్ను వదలను. నువ్వు నా మొదటి బానిసవు. తిరిగి నిన్ను సాధిస్తాను" అంటూ కొంత దూరం అలాగే గాలిలో ప్రయాణం చేసింది. ఆమె అలా వెడుతూంటే రోడ్లలోనూ ఆరు బయటా పక్కలువేసి పడుకున్న కొంతమంది జనం చూశారు. ఆ దృశ్యం వాళ్ళను కొయ్యబారిపోయేలా చేసింది.

వకుళ అలా కొంతదూరం ప్రయాణంచేసి సేఠ్ రతన్ లాల్ ఇంటి దగ్గర ఆగింది. రతన్ లాల్ గదిలోకి వెళ్ళింది. ఆమె వెళ్ళేసరికి రతన్ లాల్ గదిలో ఎవరో ఒక యువతితో ఖుషీ చేస్తున్నాడు.

"రతన్ లాల్—అప్పుడే నన్ను మర్చిపోయావా?" అంది వకుళ.

మంచంమీది స్త్రీపురుషులిద్దరూ విడిపడ్డారు. రతన్ లాల్ కంగారుగా ఆమెవంక చూసి—"ఎవరు నువ్వు—ఇక్కడికెలా రాగలిగావు?" అనడిగాడు.

"నిన్ను వలచివచ్చిన వనితను. నీ కోసం వచ్చాను. ముందామెను బైటకు పంపివేయ్—" అంది వకుళ ఆజ్ఞాపిస్తున్నట్లుగా.

"ఆమెనెందుకు పంపాలి? కావాలంటే నువ్వు కూడా రా—" అంటూ రతన్ లాల్ ఆమెను ఆహ్వానిస్తున్నట్లుగా చేతులు చాపాడు.

"నేను నీ దగ్గరకు పరుగు పరుగున రాగలను. కానీ

నువ్వు నీ చేతికున్న తాయెత్తు తీసివేయాలి—" అంది వకుళ.

"ఎందుకని?" అన్నాడు రతన్‌లాల్.

"అది నాకు హానిచేస్తుంది—" అంది వకుళ.

"కానీ అది నాకు మేలు చేస్తుంది—" అన్నాడు రతన్‌లాల్.

"మూర్ఖుడా — తాయెత్తులను నమ్మే నీ రసికతపై నాకు అపనమ్మకం కలుగుతోంది—"

"తాయెత్తులంటే భయపడేవారుంటే-రసికతకన్నా నాకు ప్రాణాలే ముఖ్యం—" అన్నాడు రతన్‌లాల్.

"అయితే నే పోతున్నాను—" అంటూ వెనుదిరిగింది వకుళ.

"నా గదిలోనికి వచ్చిన ఆడదాన్ని పోనిస్తానా?" అంటూ రతన్‌లాల్ మంచంమీంచి లేచాడు. వకుళ కీచుమంటూ వికృతంగా అరిచి కటాలున గది తలుపు తెరిచి పారిపోయింది.

తర్వాత ఆమె అక్కణ్ణించి జోగారావు ఇంటికి వెళ్ళింది. వేరే గదిలో హాయిగా నిద్రపోతున్న పిల్లలిద్దర్నీ పేరు పేరున పిలిచి లేపింది. రమ, సూర్యం కళ్ళు నులుముకుంటూ లేచారు.

ఇద్దరి నుదుటా ఎర్రని కుంకుమ ప్రకాశిస్తోంది.

వకుళ ఒక్కడుగు వెనక్కి వేసి — "మీరు కులాసాగానే ఉన్నారే—" అంది.

పిల్లలిద్దరూ వకుళను గుర్తించారు—"అక్కా—ఎప్పుడొచ్చావ్?" అన్నారు.

"నన్ను చూస్తే మీకు భయంలేదా?" అంది వకుళ.

"లేదక్కా—నువ్వంటే మాకెంతో ఇష్టం. ఎన్నో

తమాషాలు చేస్తావు. చేయకా—చూడాలని వుంది—"
అన్నాడు సూర్యం. రమ కూడా అలాగే అంది.

"అయితే చూడండి—" అంటూ వకుళ తన చేతిని పొడుగ్గా పెంచి అవతల గదిలో ఎక్కడో గోడకు ఉన్న ఫోటో నొకదాన్ని తీసి వాళ్ల ముందు పడేసింది.

"భలే — భలే!" అంటూ చప్పట్లు చరిచారు పిల్లలిద్దరూ.

వకుళ తన చేయి మళ్ళీ చిన్నదిగా చేసేసింది.

"ఇంకా ఏమైనా తమాషాలు చేయకా—" అన్నారు పిల్లలిద్దరూ.

"చేస్తాను. కానీ ముందు ముఖానికున్న ఆ బొట్టు చెరి పేసుకోండి—" అంది వకుళ.

"ఆ బొట్టు మాకిష్టం. మేము చెరుపుకోము. నువ్వు తమాషాలు చెయ్యి—" అంది రమ.

"మీరు బొట్టు చెరుపుకోకపోతే నేను తమాషాలు చెయ్యను—" అంది వకుళ.

"చెయ్యాల్సిందే-.... చెయ్యకపోతే....?" అన్నాడు సూర్యం.

"ఊఁ.... చెయ్యకపోతే?" అని నవ్వింది వకుళ— నెమ్మదిగా, భయంకరంగా!

ఆ నవ్వు వింటూ రమ, సూర్యం ఇద్దరూ నవ్వసాగారు.

"ఎందుకు నవ్వుతారు?" అంది వకుళ.

"నీకులా నవ్వాలని చూస్తున్నాం. ఎంత ప్రయత్నించినా రావడంలేదు—" అంటూ ఇద్దరూ నవ్వసాగారు.

వకుళ ఉక్రోషంగా, అసహాయంగా ఇద్దరి వంకా చూసి గుమ్మంవైపు నడవబోయి ఆగిపోయింది.

అక్కడ జోగారావు, శారద నిలబడి ఉన్నారు. ఇద్దరికీ నుదుట కుంకుమ వుంది.

"ఎంత ధైర్యమే నీకు? ఇంత చేసి మళ్ళీ ఈ గడప తొక్కుతావా?" అంటూ గర్జించింది శారద.

జోగారావు మాత్రం బాధగా, దిగులుగా కూతురివంక చూస్తున్నాడు. ఈమె నిజంగా పిశాచమా? అంటే తన కూతురు చచ్చిపోయిందా? చచ్చిపోడానికి కారణం తన అశ్రద్ధయేనా?....ఇదంతా అబద్ధమైతే ఎంత బాగుండును? నిండుగా, అందంగా ఉన్న ఆ పదహారేళ్ళ పాప— పిశాచం కాక జీవం నింపుకున్న కూతురైతే ఎంత బాగుండును?

"అమ్మా—వకుళా—అంతా నిన్ను పిశాచమని అంటున్నారు. కాదని చెప్పమ్మా—ఎప్పట్లాగే ఈ యింట్లో మసలు తల్లీ-నిన్ను నేను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. నీమీద నేను ఈగను కూడా వాలనివ్వను—" అన్నాడు జోగారావు.

వకుళ మాట్లాడలేదు.

"మాట్లాడవేం తల్లీ—" అన్నాడు జోగారావు.

"అదేం మాట్లాడుతుందండీ — ఇప్పుడు దాని గతి చూడండి—ఈ గడి దాటి ఎలా వెడుతుందో చూస్తాను. ఈ ప్రపంచానికే దీని పీడ శాశ్వతంగా విరగడయ్యేలా చేస్తాను—" అంటూ—"రావే ముందుకురా—" అంది శారద. నుదుటనున్న ఆ కుంకుమ ఆమెకు ప్రసాదించిన ధైర్యమింతా అంతా కాదు.

వకుళ ముందడుగు వేయలేదు.

"రమ, సూర్యం—మీరు దాన్ని పట్టుకోండి—" అంది శారద. అంతే పిల్లలిద్దరూ వకుళమీద పడ

బోయారు. వకుళకు ఎటుపోవడానికీ దారి తోచలేదు. చటుక్కున గాలిలోకి ఎగిరింది. ఆమె అలా ఎగరడం చూస్తూనే జోగారావు హతాశుడయ్యాడు. అతడికి తన కూతురు మనిషికాదని రూఢి అయింది.

"ఏమండీ — మీరా మనూ ఇంటికి వెళ్ళి కుంకం తీసుకురండి. ఈలోగా నేను, పిల్లలు దీనికి కాపలా కాస్తుంటాం —" అంది శారద. జాగ్రత్తగా ఉండమని హెచ్చరించి — భార్య అనుజ్ఞ పాటించడానికి వెళ్ళిపోయాడు జోగారావు.

వకుళ చుట్టూ చూసింది. క్రిందకు చూసింది.

రమ, సూర్యం — తను నేలమీద వాలితే చాలు — పట్టుకుందామని చూస్తున్నారు.

గుమ్మానికి అడ్డంగా శారద నిలబడి వున్నది.

వాళ్ళామెను హేళనగా చూస్తున్నారు. ఆమెను నాశనం చేయాలన్న కసి వాళ్ళ కళ్ళలో కనబడుతోంది.

"ప్లీజ్ — దారి తొలగు. నేను నిన్నేమీ చెయ్యను. నువ్వు నాకు చేసిన ఘోరావమానాలకు పశ్చాత్తాపపడు. ఇంక నీ జోలికి రావడం మానేస్తాను —" అంది వకుళ.

"నేను నిన్ను అవమానించానా? నిన్నెలా చూడాలో అలాగే చూశాను. దేవుడికి నువ్వంటే ఎంత అసహ్యమో చావగానే పిశాచి రూపు ప్రసాదించాడు. స్వర్గానికెళ్ళే యోగం కూడా లేదు నీకు. పిశాచానివై మమ్మల్ని పీడించాలనుకున్నావేమో — నిన్నిప్పుడే సర్వనాశనం చేస్తాను. కొద్దిక్షణాల్లో కుంకం రానున్నది —" అంది శారద.

"ప్లీజ్ —" అంటూ గర్జించింది వకుళ. ఆమె ముఖంలో నిప్పులు చెరిగాయి. అత్యంత భయంకరంగా

తయారయిందామె ముఖం కోపంలో. గాలిలో తేలుతున్నదల్లా బోరగిల పడుకుందామె. ఆమె ఏదో ఎత్తయిన బల్లమీద పడుకుంటే ఆ బల్ల తీసివేసినట్లూ—అయినా ఆమె క్రిందపడకుండా అలాగేవున్నట్లు ఉన్నదా దృశ్యం. ఈ ఇంద్రజాలాన్ని పిల్లలు, శారద చూసి చప్పట్లు చరిచారు.

"ఆడూ—మా కోసం ఆడు. మాయలుచేసి మమ్మల్ని వినోదపరచు. నువ్వు మా బానిసవు—" అంది శారద.

వకుళ ముఖంలో నిప్పులు చెరిగాయి. ఆమె సంధించిన బాణంలా కదిలి—గుమ్మంలోంచీ దూసుకుపోయి హాల్లో వాలింది. ఊహించని ఈ సంఘటనకు శారద నివ్వెర పోయింది.

"పిన్నీ—మళ్ళీ వస్తాను. నీ బుద్ధి మారలేదు. నిన్నూ నీ కుటుంబాన్నీ సర్వనాశనం చేస్తాను—" అంది వకుళ.

అక్కణ్నించి ఆమె శరవేగంతో వీధిలోకి వచ్చింది. అలా పోతున్న ఆటోను ఆపి అందులో ఎక్కి కూర్చుంది. ఒకచోట ఆటోను ఆపమంది. వాడికి డబ్బులిచ్చి వడివడిగా అక్కణ్నించి నడిచి ఓ పెద్ద ఇంటిముందు ఆగింది.

ఆ ఇంటికో పెద్ద గేటు. గేటుముందు వాచ్ మన్.

వకుళ వాచ్ మన్ ముందు నిలబడింది.

"ఎవరమ్మా నువ్వు?" అన్నాడు వాచ్ మన్.

వకుళ నోరు తెరిచింది. నాలిక బారచాపింది. ఆమె నాలిక పొడుగ్గా బొడ్డువరకూ వచ్చింది. ఆమె కనుగుడ్లు గాలిలోకీ ఓ అంగుళం మేర ముందుకు వచ్చి ఆగాయి.

వాచ్ మన్ కి అరవాలన్నా గొంతు పెగలలేదు. వాడు కుప్పలా కూలిపోయాడు.

వకుళ వాడిదగ్గర తుపాకీ తీసుకుంది. లోపలకు నడి

చింది.

సింహాల్లాంటి రెండు కుక్కలు మొరుగుతూ వచ్చాయి. ఆమె వాటిని నిర్దాక్షిణ్యంగా తుపాకీతో కాల్చిపారేసింది. వకుళ క్రూరాతిక్రూరంగా చుట్టూ చూస్తూ ముందడుగు వేసి ఇంట్లో ప్రవేశించి ది.

అది పెద్ద హాలు. నలుగురు మనుషులు నిద్రపోతున్నారక్కడ. వాళ్లాయింట్లో పనివాళ్ళు.

హాల్లోంచి మేడమీదకు మెట్లున్నాయి. వకుళ చకచకా మెట్లెక్కింది. ఒకో గదినే చూసుకుంటూ ఓ గది ముందు ఆగింది. తలుపులు వేసివున్నాయి.

వకుళ బలంగా గది తలుపులు తోసింది. మూసుకోగానే తాళంపడే తలుపులవి. వకుళ తోయగానే— తాళం విరిగి తలుపులు తెరుచుకున్నాయి.

ఆ శబ్దానికి ఉలిక్కిపడి లేచారు గదిలో పడుకున్న స్త్రీ పురుషులు.

వారు భార్యాభర్తలు కాబోలు... స్త్రీ చటుక్కున దుప్పటి కప్పుకొని లోనికి వచ్చిన వకుళను చూసింది.

అప్పుడు వకుళ మామూలు స్త్రీకివలెనే ఎంతో అందంగా ఉంది.

"ఎవర్నువ్వు?" అన్నాడు పురుషుడు.

"నా పేరు వకుళ. నువ్వు ప్రజల రక్తం తాగి డబ్బు కూడబెట్టావు. నేను నీ రక్తం తాగి ఆ డబ్బు తీసుకుపోదామని వచ్చాను—" అందామె.

"నేనెవరో తెలుసా నీకు?" అన్నాడా పురుషుడు.

"తెలుసు. నీ పేరు జగదీష్. పదిహేనేళ్ళుగా మంత్రి నవాలని కలలుకంటున్నావ్. మంత్రివైనా కాక

పోయినా కోట్లకుకోట్లు డబ్బు మాత్రం కూడ బెట్టావు-" అంది వకుళ.

"ఈ గదికివచ్చి బ్రతికి వెళ్ళడం కష్టమని తెలుసా నీకు?" అన్నాడా జగదీష్ నిబ్బరంగా.

"అలా భయపడ్డానికి నేను బ్రతికుంటే కదా!" అంటూ వకుళ నాలిక బారచాపింది. ఆమె గుడ్లు గాలిలోకి వచ్చాయి.

మంచంమీద స్త్రీ కెవ్వుమని అరిచి పడిపోయింది.

జగదీష్ ఆమెకేసి వెర్రి చూపులు చూశాడు.

వకుళ త్వరగా జగదీష్‌ని సమీపించింది. అతడి చేతిని అందుకుంది. మణికట్టునుంచి మోచేతివరకూ నాలికతో నాకింది. ఉన్నట్లుండి భుజాల దగ్గర గాటు పెట్టింది. జగదీష్ అరిచాడు కానీ ఆమె పట్టు విడిపించుకోలేక పోయాడు.

అయిదు నిముషాలవరకూ ఆమె జగదీష్‌ని వదలలేదు. ఆమె కదలగానే జగదీష్ అచేతనంగా పడిపోయాడు. వకుళ గదిలో చుట్టూ చూసింది. ఆమె కనులిప్పుడు మామూలుగా ఉన్నాయి. చీర కొంగుతో మూతి తుడుచుకుంది. వకుళ గోడదగ్గరకు నడిచి అక్కడున్న పటాన్ని తీసింది. పటం వెనుక ఒక చిన్న మీట గోడరంగులో కలిసి ఉన్నది. దాన్నామె గుర్తించి నొక్కింది. ఆమె అలా చేయగానే ఏదో చిన్న శబ్దమైంది.

వకుళ—జగదీష్ పడివున్న మంచాన్ని అవలీలగా ఇవతలపక్కకు లాగింది. మంచంకింద ఒక పెద్ద అర ఏర్పడింది. వకుళ అందులోకి చేయిపెట్టి ఓ పెద్ద ఇనప్పెట్టెను సునాయాసంగా పైకిలాగింది.

ఇనప్పెట్టెకు లాకర్ సిస్టం వున్నది. దానికి ఏదో

నంబర్ కోడ్ కూడా ఉన్నది. అయితే వకుళ అవేమీ ఉపయోగించే ప్రయత్నం చేయలేదు. హోల్డర్ పట్టుకొని లాగి పెట్టె తెరచింది. దాన్నిండా నోట్లకట్టలు.

వకుళ వాటివంక చూస్తూ ఆగకుండా నవ్వింది. అదే నవ్వు.... నెమ్మదిగా, భయంకరంగా!

## 30

జగదీష్ చావు నగరంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది.

వంటిమీద ఒక్క గాయంలేకుండా — శరీరంలోని రక్తమంతా పోయి మరణించాడతను. అదెలా జరిగిందో ఎవరూ చెప్పలేకపోయారు. జగదీష్ భార్య వకుళను, ఆమె చేష్టనూ మాత్రం వర్ణించగలిగింది.

నరోత్తమరావు ఇది దుష్టశక్తిగా మారిన వకుళ అనే పిల్ల చేస్తున్న దురాగతమనడానికి కావలసిన సమాచారమంతా పోలీసులకు అందించాడు.

అయితే ఆ దుష్టశక్తి ఎవరు? ఎక్కడుంటోంది? దానికి ఎవరి ఆశ్రయం లభించింది? అదింకా ఎన్ని దురాగతాలు చేస్తుంది? దాని ఆగడాలకు అంతులేదా?.... ఈ ప్రశ్నలకు జవాబు దొరకడంలేదు.

మధు ఇంట్లోని కుంకుమకు ప్రచారం లభించింది. ఆ కుంకుమనిచ్చిన బైరాగి ఆచూకీ తెలుసుకోవాలని చాలా మంది అనుకున్నారు. అయితే అతడెవరో, ఎక్కడున్నాడో ఈషణ్మాత్రం వివరాలు కూడా తెలియలేదు. కుంకుమకోసం చాలా మంది మధు ఇంటికి రాసాగారు.

వకుళ ఫోటోలు అన్ని ప్రముఖ దిన, వార, మాస పత్రికల్లోనూ ప్రచురించబడ్డాయి. ఆ విషయమై హెచ్చ

రికలు ప్రకటించబడ్డాయి. రేడియోలో ప్రజలను హెచ్చరించడంకూడా జరిగింది.

మామూలు దొంగ అయితే ఫరవాలేదు. మానవాతీత శక్తులున్న దుష్టశక్తి వకుళ! ఆమెనెలా ఎదుర్కోవాలి?- నగరంలో ప్రజల ఆందోళనకు ముఖ్య కారణం ఇదే!

జగదీష్ చనిపోయిన వారంరోజులకు కోదండ రామయ్య చనిపోయాడు. సరిగ్గా జగదీష్ చనిపోయిన విధంగానే అతడూ చనిపోయాడు. అతడింట్లోంచి కూడా లక్షలకు లక్షలు డబ్బు మాయమైంది.

ఆ తర్వాత వారం రోజులకు అవతార్ సింగ్ చనిపోయాడు. అదేవిధంగా!

డబ్బున్న వారందరూ ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుంటున్నారు.

ఈలోగా ఇంకో చిత్రం జరిగింది. నగరంలో పేద వారికి, శ్రమజీవులకు ప్రతిదినమూ రెండుపూటలా అన్న దాన కార్యక్రమం ప్రారంభమయింది. అది వకుళ పేరిట జరుగుతోంది.

ఈ వార్త పోలీసు అధికారులనూ, ఇతర ప్రముఖులనూ కూడా కలవరపరచింది.

ప్రస్తుతం శివశంకరం మహాదేవుడి ఇంట్లో మకాం పెట్టేశాడు. వాళ్ళు వకుళను అణుపుచేసే విధానాల గురించి అనేక గ్రంథాలు చదివి పరిశోధిస్తున్నారు. బైరాగి ఇచ్చిన కుంకాన్ని వారు కెమికల్ ఎనాలిసిస్ చేసి పరిశీలించారు. భౌతికంగా చూస్తే అది మామూలు కుంకమే! దాంట్లో విశేషమేమీ లేదు. ఆ బైరాగి ఎవరో తెలిస్తే బాగుండేది! (సశేషం)

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



క్రైమ్‌లో
తమాషా

## దొరికిన దొంగ?

జైల్లో ఒక దొంగని రెండో దొంగ—"ఏం నేరంచేసి దొరికిపోయావు?" అనడిగాడు.

"పుస్తకాలు దొంగిలించి—"

"అదేమిటి?"

"అవును. ఒకింట్లో దొంగతనానికి వెళ్ళాను. ఆ ఇంట్లో సామాన్లు ఏమీ పెద్దగా లేవు. రెండు పెట్టెలు మాత్రం వున్నాయి. అందులో ఒక పెట్టె బరువుగా వుంది. ఆ ఇంటి యజమాని పిసినారని, ఆ పెట్టె నిండా డబ్బేనని భ్రమపడి, ఆ పెట్టెను ఇంటికి పట్టుకుపోయాను. ఇంటికి వెళ్ళి చూద్దునుకదా ఆ పెట్టెనిండా పుస్తకాలు తప్ప ఒక్క-ఐదుపైసలు కూడా లేవు. ఆ పుస్తకాలు నేనేం చేసుకుంటాను. తీసుకెళ్ళి పాత పేపర్లు అమ్మే కొట్టులో అమ్మబోయాను. ఆ కొట్టు అతనిదే అని నాకేం తెలుసు. పట్టుకొని జైల్లో పెట్టించాడు—" చెప్పాడు మొదటి దొంగ.

—వి. సుహలత, పార్వతీపురం.

## పదునులేని కత్తి

కొత్తగా దొంగల ముఠాలో చేరాడో అనుమానాల్రావ్. వారి నాయకుడు దొంగతనం చేసేటప్పుడు తీసుకోవల్సిన జాగ్రత్తలు, మెలకువలు నేర్పుతున్నాడు. అన్ని విషయాలూ చెప్పిన తర్వాత "మీ కింకేవన్నా అనుమానాలుంటే తీర్చు

కోవచ్చు" అన్నాడు.

అనుమానాగ్రావ్‌కు గొప్ప అనుమానం వచ్చింది.

"బాస్! ఎవరేనా నా వెంట పడేటప్పుడు పిస్టల్‌లో గుళ్ళు లేకపోతే?"

"వెంటనే లోడ్ చేసుకోవాలి."

"ఒకవేళ జేబుకు కన్నం వుండి, అందులో నుండి పిస్టల్ జారిపోయున్నట్టైతే?"

"కత్తి నుపయోగించాలి."

"కత్తికి పదును లేకపోతే?"

"దాంతో నీ పీక మీద కోసుకుంటే పదును అదే వస్తుంది!" విసుగ్గా అన్నాడు అనుమానాగ్రావ్ ప్రశ్నలకు తలతిరిగిన బాస్. —టి. మురళీకృష్ణ, మానికొండ.

## అబల ఆర్తనాధం

రాజబాబు ఒకరోజు తీరిగ్గా వీధిలో వెళుతున్నాడు.

ఓ ఇంట్లో భార్యాభర్తలు గొడవపడుతున్నారు. వాళ్ళ మాటలు విని టక్కున ఆగిపోయాడు రాజబాబు.

"ఇంతసేపు ఎక్కడికెళ్ళావు?" మగగొంతు అంది కోపంగా.

"సినిమా కెళ్ళాను!" భయంగా చెప్పింది ఆడగొంతు.

"నాకు చెప్పకుండా ఎందుకు వెళ్ళావు?"

"మీరు ఊర్లో లేరుకదండీ!"

"నేను ఊర్లో లేంది చూసి ఇంత పని చేస్తావా దయ్యం."

"ఎందుకండీ అనవసరంగా కేకలేస్తారు? నేనేం తప్పు చేసానని: సినిమాకెళ్ళడం తప్పా?"

"చెప్పకుండా సినిమా కెళ్ళిందే కాక పైగా నన్నే

దబాయిస్తావా రాక్షసి—"

అంతే! బెల్టుతో కొడుతున్న చప్పుడు "రక్షించండి!" అనే ఆ స్త్రీమూర్తి ఆర్తనాదం విని రాజబాబు ఆవేశంతో పొంగిపోయాడు. కుర్చీలు, బెంచీలు పడిపోతున్న చప్పుడు విని అభ్యుదయభావాలు గల రాజబాబు దారిన పోతున్న నలుగుర్ని ప్రోగుచేసి ఆ ఇంటి తలుపుతట్టాడు. గొళ్ళెం వేసిలేదు. తలుపు మామూలుగానే తెరుచుకుంది.

లోపలి దృశ్యం చూసిన రాజబాబు మొహం పాలి పోయింది. లోపల ఆడవాళ్ళు ఎవరూ లేరు. క్రొత్త మిమిక్రీ ఆర్టిస్టు ప్రాక్టీసు చేసుకుంటున్నాడు.

—యస్. శివానంద్, బెల్లంపల్లి.

## చెప్పలేని పేరు?

ఒక రోజు నగరంలో ఏదో ప్రత్యేక కార్యక్రమం ఉండడంవల్ల ఆఫీసులో అందరికీ సగం రోజు పర్మిషను ఇచ్చారు. మా సెక్షనులోని ఆడవాళ్ళంతా సినిమాకు వెళతా మని వెళ్ళారు.

మరుసటి రోజు "నిన్న ఏ సినిమాకు వెళ్ళారండీ" అని అడిగాను ఒకావిడ్ని. "ఏదో ఒకటి లెద్దూ" అంది. "ఏదో లెండి" అంది మరో ఆవిడ. వాళ్లే సినిమాకు వెళ్లారో తెలుసుకొని 'డిస్కస్' చేద్దామన్న ఉద్దేశంతో అందరినీ అడిగాను. సినిమాపేరు ఎవరూ చెప్పలేదు.

చివరకు ఒకావిడ మాత్రం చెప్పింది "శ్రీనివాసా థియేటర్లో" అని.

అందులో "మొగుడు కావాలి" ఆడుతోంది.

—సుంచు కృష్ణస్వామి, కమల్‌నగర్.

